# శ్రీకృష్ణామృతవాణి

## అను భగవద్గీత

తాత్పర్య, వ్యాఖ్యా, పదవివరణ

మర్ల అప్పారావు

*ప్రచురణ*

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**

**2015**

# SRI KRISHNAAMRUTHA VANI

*By*
**Marla Apparao**

T.T.D. Religious Publications Series No. 1192


*First Edition : 2015*

*Copies :* 1000

*Published by*
**Dr.D.SAMBASIVA RAO,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507

***D.T.P:***
Chief Editor Office
T.T.D, Tirupati.

*Printed at :*
**Tirumala Tirupati Devasthanams Press,**
Tirupati - 517 507

# ముందుమాట

**భారతామృత సర్వస్వం విష్ణో ర్వక్త్రాద్వినిస్సృతమ్ ।**
**గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే ॥**

మహాభారతం విజ్ఞాన సర్వస్వం. అందులోని జ్ఞాన – విజ్ఞానమంతా సాక్షాత్ విష్ణుభగవానుడే అయిన కృష్ణుని ముఖపద్మంనుండి వెలువడింది. మహాభారతంలోని భీష్మపర్వంలో భగవద్గీత ఒక భాగం. పురాణకాలంలో శ్రీమహావిష్ణువు పాదాలనుండి పుట్టిన గంగ, భగీరథుని ప్రయత్నంచే, దివినుండి భువికి వచ్చి ప్రజలకెలా జీవనాధారమయిందో, అలాగే ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడుగా అవతరించిన విష్ణుమూర్తి ముఖకమలంనుండి జాలువారిన గీతాగంగ భారతదేశ ప్రజలకే కాదు, యావత్ ప్రపంచ మానవాళికి పరమపవిత్రమైన, ఆధ్యాత్మిక సందేశాన్ని అందించింది. ఈ గీతాగంగను పానం చేసినవారు జనన, మరణ బంధాలనుండి విముక్తి రూపమైన విడుదలను చూరగొంటారు.

భగవద్గీతలో చిట్ట చివరిదైన 18వ అధ్యాయం – మోక్షసన్న్యాస యోగంలో

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ!**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥**

**(18–66)**

“ఓ అర్జునా! సమస్త ధర్మాలను విడిచిపెట్టి నన్నొక్కని మాత్రమే శరణు పొందు. నేను సమస్త పాపాలనుండి నీకు విముక్తిని కల్గిస్తాను. నీవు దుఃఖించవద్దు” అని భగవంతుడన్నాడు. భక్తులకిది పెద్ద ఊరట కల్గిస్తున్నది.

భగవద్గీతను రోజూ పారాయణం చేయడానికి అనుకూలంగా శ్రీమర్ల అప్పారావుగారు చేసిన కృషి ఎంతో ప్రశంసనీయం. ఎన్నో విధాలైన

భగవద్గీతలు తిరుమల తిరుపతి దేవస్థానం వారు అచ్చువేసి ఉన్నారు. వాటిలో ఈ గ్రంథం విశిష్టమైనది. పుస్తకం ముందుగల వివిధ శీర్షికలు, చివరగల పారిభాషిక పదవివరణలు సామాన్య పాఠకులకెంతో ఉపయోగకరంగా ఉన్నాయి. శ్రీకృష్ణగీతామృతవాణి అనే ఈ గ్రంథాన్ని పాఠకలోకం శ్రద్ధతో చదివి జ్ఞాన లబ్ధి పొందగలదని ఆశిస్తున్నాము.

తిరుపతి
16-9-2015

*సదా శ్రీవారి సేవలో....*

**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

# విజ్ఞాపన

భగవానుడు కృతయుగంలో చతుర్భుజములతో తెల్లనిరంగు కల వాడై, త్రేతాయుగంలో ఎర్రనిమేని ఛాయతో చతుర్బాహుడై, ద్వాపరయుగంలో శ్యామలవర్ణముతో పీతాంబరధారియై రెండుబాహువులతో శత్రుసంహార దీక్షలో నిమగ్నుడై, భారతాంతర్గతమైనట్టి, బ్రహ్మవిద్య, యోగ శాస్త్రము అయిన తన అమృతవాణిని, శ్రీకృష్ణావతారంలో అర్జునుని ద్వారా విశ్వజనులకు అందించిన శ్రీకృష్ణామృతవాణి అయిన గీత అమూల్యమైనది. దుఃఖవిపులమైన సంసారసాగరమును దాటించి మనుజులను మోక్షము ప్రసాదించునది. దీని శ్రోత అయిన అర్జునుడు నరుడు. కృష్ణ భగవానుడు నారాయణుడు.

ప్రతిరోజూ స్నానంచేయుట వలన మానవుని శరీర మలినము మాత్రము నిర్మూలింపబడును. శ్రీకృష్ణామృతవాణియైన గీతాపఠనం అనే స్నానం, ఒక్కసారిచేసినా సంసారబంధనం పాపకార్యం చేయడం అనే మలం, మనస్సును అంటుకున్న దుష్ట ఆలోచనామలములు నాశనం మవుతాయి.

ఇందు అధ్యాయార్థ సంగ్రహము, కర్మ యోగము, బ్రహ్మము, మోక్షమార్గము, ఆత్మస్వరూపము మొదలగు క్లిష్టమగు సమస్యలను భగవానుడు విశదపరచెను. అందువలన యోగేశ్వరుడు అయిన శ్రీకృష్ణ భగవానుడు గాండీవధనుర్ధారి అయిన పార్థుడు ఉండు ప్రదేశములందుండు జనులకు సకల ఐశ్వర్యములు గలిగి నీతిమంతులగుదురు.

"దళమైన, పుష్పమైనను, ఫలమైనను
సలిలమైన పాయని భక్తిం
గొలిచిన జనులర్పించిన నెలమిన్
రుచిరాన్నముగనె యేను భుజింతున్"

అని కృష్ణ భగవానుడు విశదీకరించెను. నిర్మలమైన, నిశ్చలమైన భక్తితో పత్రమైనా, పుష్పమైనా, జలమైనా, ఫలమైనా నాకు సమర్పించిన నేను ఇష్టమైనభోజనముగా ఆరగింతునని భగవానుడు తెలిపెను. దీనిని సకలజనులు ఆదరించవలెను.

**"కృష్ణాయవాసుదేవాయ హరయే పరమాత్మనే**
**ప్రణతక్లేశనాశాయ గోవిందాయ నమోనమః"**

"కృష్ణా! నీ పాదపద్మములు నా హృదయంలో ఎల్లవేళలలో ఉండునట్లు అనుగ్రహించు" అని అర్థము.

ఇటువంటి పవిత్రమైన శ్రీ కృష్ణామృతవాణిని సమర్పించుట కేవలము నా పుణ్యఫలమే, భక్తులైనపాఠకులు ఈ గీతను సహృదయంతో పఠింతురని నా విశ్వాసము.

ఈ శ్రీకృష్ణామృతవాణిని ప్రచురిస్తున్న తిరుమల తిరుపతిదేవస్థానముల బోర్డు ప్రెసిడెంట్ శ్రీచదలువాడ కృష్ణమూర్తిగారికి, ప్రస్తుతకార్య నిర్వహణాధికారిగా యున్న డా॥ డి.సాంబశివరావుగారికి, శ్రమకు ఓర్చి దేవస్థానం తరపున ప్రచురించిన కమిటీవారికి, మరియు ప్రముఖ రచయిత, కవి, ఎడిటర్-ఇన్-చీఫ్ అయిన డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారికి నా నమస్కారములు.

ఈ రచనలో నాకు అన్ని విధములా సహకరించి, తగిన సలహాలిచ్చిన, సంస్కృతాంధ్ర పండితులు, కర్ణాటక సంగీతభూషణ, గీతా మాతకు వందనము వ్రాసిన శ్రీ ఎ.సి.పి.శాస్త్రిగారికి నా అనంతమైన అభివందనములు.


ఇట్లు విధేయుడు

**మర్ల అప్పారావు**
హౌస్.నెం.8.3.1110, కేశవనగర్‌కాలనీ,
శ్రీనగర్‌కాలనీ పోస్ట్,
హైదరాబాదు-500 073.
ఫోన్: 23745673, సెల్.నెం. 96520 54223


# గీతామాతకు వందనము


**ఎ.సి.పి.శాస్త్రి***
Assistant Manager (Retired),
Reserve Bank of India,
Hyderabad.


చతుర్వేదాలను తెలుగులో దండాన్వయముగా వ్రాసిన అనువాద కర్తలు, పురాణ వాచస్పతి బ్రహ్మ శ్రీ బంకుపల్లె మల్లయ్య శాస్త్రిగారు ఆ ఆంధ్రాను వాద సందర్భంలో ఇలావా్రశారు.

## "వేదార్థముయొక్క ఉపయోగము"

మంత్రముల అర్థమును గుర్తించుచునే కర్మలాచరింపవలెను. అపుడే ఫలముకలుగును. అని పూర్వుల సిద్ధాంతము. అందుకనే గీర్వాణ భాషకు సంస్కృతార్థము భాష్యకర్తలు వ్రాసిరి. అప్పుడు సంస్కృతము, కర్మలు చేయువారి కెల్లను తెలియుచుండెను. రానురాను సంస్కృతము నెఱుగని వారు ఇప్పటికి నూటికి తొంబది మందికలరు. (ఇది 1940 నాటి మాట-రచయిత వ్యాఖ్యా నూటికి డెబ్బది మంది కర్మల యందాసక్తి కలవారే, వారికర్థమెట్లు తెలియనగును? సంస్కృత గ్రంథములు పాఠము చెప్పినపుడు ప్రారంభ విద్యార్థులకు గురువులు స్వభాషలోనే అర్థము చెప్పుచున్నారుకదా! ఆ సంస్కృత భాష్యములోని వేదార్థము కూడా దేశభాషలోనే చెప్పవలసి యున్నది. మరియు కర్మలాచరించితే వచ్చు ఫలము, ఆ మంత్రార్థమునెఱింగిన వానికిగూడ వచ్చునని**'య ఉచైనదేవం వేద'** "ఎవడు దీనినిట్లు తెలిసికొనునో" అని శ్రుతియు గలదు. ఇపుడు బ్రహ్మశ్రీ మర్ల అప్పారావు గారు భగవద్గీతకు

---

* రచనలు - "పులకేశి", బిల్హణ కవితా విజయం, నలచరిత్ర ఇత్యాది దశ నాటక కర్త 'సంగీతభూషణ్' ఋషి పీఠంలోనూ 'మూసీ' పత్రికలోనూ పలువ్యాసాలను వ్రాసిన వ్యాసకర్త. 'నోరినరసింహశాస్త్రి పురస్కారగ్రహీత'

తేట తెనుగులో తాత్పర్యసహిత వ్యాఖ్యానము **"శ్రీకృష్ణామృతవాణి"** అనేపేరుతో మధురంగా వ్రాశారు. అయితేపైన ఉదహరించిన మల్లయ్య గారి అభిప్రాయమునకు, మర్లఅప్పారావుగారి వ్యాఖ్యానమునకు సంబంధము ఏమిటి ? పైన చెప్పిన విషయము వేద కర్మలకు సంబంధించినది కదా! అంటే–

శ్రీమద్భగవద్గీత సకల ఉపనిషత్తుల సారమగుట చేత భగవద్గీతను కూడా ఉపనిషత్ అన్నారు. ఉపనిషత్తులు కూడా వేదమే. వేదాన్ని స్మరిస్తూ వ్రాయటం వలన ఉపనిషత్తులను స్మృతులన్నారు. 'ఉపనిషత్' అంటే గురువు సమీపంలో ఉండటమూ,కూర్చోవటము మొదలయినవి, ఏ శిష్యుడైతే, దీక్షాపారమ్యంతో విద్య నేర్చుకుంటాడో, వాడికి వచ్చే అనుమానాలన్నీ గురువు ఏకాంత బోధలో తీరుస్తాడు. కనుక ఉపనిషత్తులు, ఎప్పుడూ గురు శిష్య సంవాద రూపంలో ఉంటాయి. వ్యాసుడు కూడా అర్జునుడిని శిష్యుడిగా చేసి, (శిష్యస్తే ఉహం శాధిమాం ప్రపన్నం) శ్రీకృష్ణుని గురువుగా చేసి, ప్రశ్నలు అడిగించే సన్నివేశం సృష్టించాడు. అందుకని, భగవద్గీతకు ఉపనిషద్స్వరూపము, స్థాయి వచ్చేసింది.

ఇక సారంలోకి వెళితే అద్వైత, ద్వైత, విశిష్టాద్వైత మతాలు మూడూ "ఈ భగవద్గీత మూడుమతాల సిద్ధాంతాన్నే చెప్పింది" అనేమాటకువీలుగా, సర్వమూ ఇందులో ఉంది. **అద్వైతం** – 'ఉన్నది ఒకటే సత్యము అంటుంది. **ద్వైతము** – ఉన్నవి రెండుసత్యాలు అంటుంది. **విశిష్టాద్వైతం** – సత్యం ఒకటే కానీ రెండుగా కనబడుతుంది' అంటుంది. ఇందులో ఏది ఎవరు కాదనగలరు? కారణజన్ముల అనుభవమును సామాన్య జీవనములో మునిగితేలే మనము తెలుసుకోగలమా!

అందుకని, భగవద్గీతను పారాయణముగా చేసి రోజూ స్మరిస్తూ ఉంటే అందులో అర్థం ఏదో ఒక రోజున అపరోక్షానుభూతి ద్వారా తెలుస్తుంది,



అన్ని సుఖదుఃఖాలు, గొప్ప అనుభవాలు మాతృభాషలోనే జీవుడికి అనుభవంలోకి వస్తాయి కనుక, సత్యం తెలుసుకోవటానికి, తెలుగువారికి, వారి మాతృభాషలో ఉన్న ఈవ్యాఖ్యానం ఎంతో ఉపయోగపడుతుంది.

బహుశ భారతదేశంలో, ఇన్ని వ్యాఖ్యానాలు ఏ గ్రంథానికీ రాలేదేమో! ప్రపంచభాషలన్నిటి లోనూ ఉన్న గ్రంథం ఇదొక్కటేనేమో! అలాంటప్పుడు మళ్ళీ మనం వ్రాయటం ఎందుకు అన్నప్రశ్న ఉదయించవచ్చు. వ్యాఖ్యానం వ్రాయటం కూడా ధ్యానంలో ఒక భాగం. అంతరంగంలో ఎంతోలోతులో ఉన్న సంస్కారాలు తమ విశ్వప్రయత్నంతో, ఈవ్యాఖ్యానాన్ని రసవంతం చేయటానికి ప్రయత్నిస్తాయి. స్వచ్ఛమైన నీటి ప్రవాహంలో అడుగున రాళ్ళుకనబడినట్లు మన అంతరంగంలోని జడత్వం మనకు కనబడుతుంది. ఒకసారి కంటికి కనబడ్డ తరువాత జడత్వం జడత్వంగా ఉండదు. చైతన్యంగా రూపు దిద్దు కుంటుంది. అంతేకాదు, భగవద్గీతను చాలామంది వ్రాసినా, శ్రీ మర్ల అప్పారావుగారు విభిన్నంగా వ్రాశారు. పురాణాలు అర్థం చేసుకోటానికి, అవసరమైన, పూర్వగ్రంథమును, అంటే పరిభాషను చెప్పి, దానికి వివరాలు ఇచ్చారు. భగవద్గీతవ్యాఖ్యానంలో ఇటువంటి వివరణలు ఉండటం అరుదు. ఉపనిషణ్మతము తెలుసుకోవాలంటే పురాణాంతర్గత పూర్వచరిత్ర కొంత తెలుసు కోవటం అవసరం, ఇందులో శ్రీమర్ల అప్పారావు గారు కృతార్థులైనారు.

ఇందులో మాటిమాటికీ భగవానుడు, ఆదిత్యులు, రుద్రులు, వసువులు అని ప్రశంసిస్తూ ఉంటాడు. ఈమూడూ జగతి, త్రిష్టుప్పు, గాయత్రీ ఛందస్సులు. ఈ ప్రపంచం మూడులోకాలుగా, స్వర్గ, అంతరిక్ష, పృథువులుగా పై ఛందస్సులతో చేయబడ్డది. మూడులోకాలు పొందటానికి భగవద్గీతలోని అన్ని మార్గాలు ఉపయోగపడతవి అని గీత ఆశయం.

మనకు జగత్కారణమైన ఆత్మ ప్రత్యక్షంగా కనబడదట. అపరోక్షం గానూ, నిర్వికల్పంగానూ మాత్రమే అనుభవంలోకి వస్తుందట. మరి ఆ అనుభవాన్ని ప్రమాణీకరించేదెవ్వరు? జగత్కారణంలో సగం దేహమని చెప్పబడేస్త్రీ శక్తి (సృష్టిశక్తి) మాయాశక్తి అయిన అమ్మవారి రూపం. కనుక అయ్యవారిని ఎప్పుడూ అమ్మవారి రూపంలోనే పూజించాలి. అలాగే ప్రత్యగాత్మ అయిన శ్రీకృష్ణుని తెలుసుకోవాలంటే గీతా మాతయే శరణ్యము.

అందుకే గీతామాతకు అనేక వందనములు.

జిజ్ఞాసువు
**ఎ.సి.పి.శాస్త్రి**
హౌస్.నెం.8.3.1105,
కేశవనగర్‌కాలనీ,
హైదరాబాదు-500 073.
ఫోన్: 040-23748972
సెల్.నెం. 94403 08760

# గాయత్రీ మంత్రము

**"ఓం భూర్భువస్సువః! ఓం తత్స వితుర్వరేణ్యం!
భర్గోదేవస్య ధీమహి! ధియోయోనః ప్రచోదయాత్॥**

"సత్యమును ఋతము చేత చుట్టూ
ప్రోక్షించి తడుపుతున్నాను. ఋతం- అంటే సత్యమనే అర్థము."

**ఓం భూర్భువస్సువః:-**

అనేది గాయత్రీమంత్రములోని భాగముకాదు. వీటిని త్రివ్యాహృతులు అంటారు. అంటే మూడులోకాలను గుర్తు చేసుకోవటం దీని అవసరం ఏమిటంటే గాయత్రీ మంత్రము సోమరస స్వరూపము. ఇది సూర్యునికి మొదట అర్ఘ్యముగాను, (దేవ కర్మయందు చేతులు కడుగుకొనుటకు ఇచ్చునీరు), తరువాత పాత్రతో సోమరసము పానీయముగా ఇచ్చినట్లు 108 సార్లు జపము చేయటము. అయితే సూర్యునికి ఇచ్చే సోమరసము సారవంతముగా ఉన్నదే ఇవ్వవలెను. మరి వట్టి గాయత్రీ మంత్రము సారహీనమైనదా అంటే అవును. కారణము, ఒకప్పుడు గాయత్రి మూడులోకాలను గూర్చి తలంచింది. అందుకని సోమరససార మంతామూడులోకాలలోకి వెళ్లింది. కనుక సూర్యుడుకిచ్చే అర్ఘ్యము జపము (పానీయము) సారవంతమగుటకు ఆమూడులోకాల నుండి సారమును తిరిగి తెచ్చి గాయత్రిని సారవంతము చేసి సూర్యునకు ఇవ్వవలెను. ఇట్లా మూడులోకాలను గూర్చి తలంచటమే త్రివ్యాహృతులు. అదే "ఓం భూర్భువస్సువః-" దీనినే సంభరణము అంటారు. ఇది యజుర్వేదములో ఆరవకాండలో ఉన్నది.

ముఖ్యకాలము అతిక్రమించినపుడు సప్తవ్యాహృతులు అంటే ఓంభూః ఓంభువః ఓంసువః ఓంమహః ఓంజనః ఓంతపః ఓంసత్యం-అని చెబుతాము. అనగా సంధ్యాసమయము (ఉదయంకాని, సాయంత్రంగానీ) దాటిన తరువాత గాయత్రీసారము ఏడులోకాలలోకి వెళ్లిందని, అది మనము తిరిగి తీసుకొని వస్తున్నామని భావము.

ఓం

# శ్రీకృష్ణామృత వాణి

## తొలిపలుకు

దశావతారములలో విశిష్టమైనది కృష్ణావతారం. మహావిష్ణువు క్షీరసముద్ర నివాసి. సాగరంలో మహాలక్ష్మితో కలసి నివసించే విశ్వేశుడు. హిరణ్యాక్షుడనే రాక్షసుని వరాహావతారమెత్తి సంహరించి భూమినిపైకి తీసుకువచ్చాడు. తర్వాత నరసింహావతారమెత్తి హిరణ్యకశిపుని సంహరించాడు. వామనావతారమెత్తి బలిచక్రవర్తిని ఖండించాడు. పరశురామావతారమెత్తి దుష్టచక్రవర్తులను తన పరశువుతో శిక్షించాడు. శ్రీరామవతారమెత్తి రావణ, కుంభకర్ణ మొదలగు రాక్షసులను సంహరించాడు. కృష్ణావతారమెత్తి కంసాది దుష్టులను పరలోకాలకు పంపేడు. ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో విశ్వవాసులకు శ్రీమద్భగవద్గీతా అమృతవాణిని అందించిన మహావిష్ణువే శ్రీకృష్ణభగవానుడు. కేశవుడు, నారాయణుడు, మాధవుడు, గోవిందుడు, మధుసూదనుడు, త్రివిక్రముడు, హృషీకేశుడు, పురుషోత్తముడు, వాసుదేవుడు, నారసింహుడు, జనార్దనుడు, ఉపేంద్రుడు, శంఖచక్ర గదాధరుడు.

తేజస్సుతో ఆచ్ఛాదితుడైన పరాత్పరుడు శ్రీకృష్ణుడు. హృదయ కుహరమున ఆత్మను తెలుసుకునే ఆత్మజ్ఞానమును ప్రసాదించిన పరమాత్ముడు, కలియుగం అజ్ఞానపాపకార్యాలు, స్పర్ధలు, ద్వేషాలు, అసూయలు మనుజులను ఆవహించి వారిని పాపలోకాలకు పంపిస్తోంది. మనిషిని అవి పశువు క్రింద మారుస్తాయి. వారికి భగవద్గీతే రక్ష. ఎవరు ప్రాణులను సృష్టిస్తారో. ఎవరు ప్రాణులను రక్షిస్తారో, అతడే సంహరిస్తాడు. అతడే అనంతుడు సచ్చిదానందస్వరూపుడు శ్రీకృష్ణుడు. అందరి మనస్సులనూ ఆకర్షించేవాడు, ఆ కృష్ణుడే తన వేణుగానంతో అందరిని ఆకర్షించే వాడు కనుక వేణుగోపాలుడు.

హస్తమునందు పిల్లనగ్రోవి ఉన్నవాడు. నల్లని మేఘచ్ఛాయగలవాడు. పూర్ణచంద్రునివంటి ముఖము కలవాడు. నేత్రములు తామరపూల రేకులవలె వికసించి ఉన్నవాడు అయిన శ్రీకృష్ణ భగవానుడు తప్ప నా కితరము ఏమీ తెలియదు.

## ధ్యానం

మరోజన్మ లేకుండా చేసే గీతామాతా! నీవు అష్టాదశాధ్యాయినివై ఉన్నావు. అద్వైతామృతమును వర్షిస్తావు. స్వయం భగవానుడైన నారాయణునిచేత పార్థుడికోసం బోధింపబడినావు. పురాణముని అయిన వ్యాసునిచేత భారతమహాగ్రంథ మధ్యమున నిలుపబడ్డావు. అటువంటి మహిమ కలిగిన భగవద్గీతామాతా నిన్ను మనసులో నిలిపి ధ్యానిస్తున్నాను.

భారత తైలపూర్ణములో జ్ఞానమయ ప్రదీపమును ప్రజ్వలింప చేసిన విశాలబుద్ధి, వికసించిన అరవిందములవంటి కన్నులతో ప్రకాశించు ఓ వ్యాసమహర్షీ! నీకు నమస్కారము. గీతామృతము పిండి, జ్ఞానముద్రలోవుండి, పిల్లనగ్రోవిని ఒక చేతిలో ధరించి, ఆపన్నులకు పారిజాతవృక్షము వంటి రక్షకులైన శ్రీకృష్ణునికి నమస్కరిస్తున్నాను. వసుదేవసుతుడై భగవానునికి, కంసచాణూరులను సంహరించిన వానికి, దేవకికి ఎపుడూ పరమానందమును ప్రసాదించే జగద్గురువైన కృష్ణునికి నమస్కరిస్తున్నాను. పాండవులు రణము అనగా యుద్ధము అనే నదిని దాటడానికి ఉపాయశాలి అయిన కేశవుడు నావలాంటివాడు. ఆ నదికి భీష్ముడు, ద్రోణుడు రెండు తీరాలు. జయద్రథుడు జలము. శకుని అందులో పెరిగే కలువలు. కర్ణుడు ఆకులంబైన తీరము. అశ్వత్థామ వికర్ణులు మకరములు. దుర్యోధనుడు సుడిగుండము. ఇలాంటి విశేష గుణములుకల యుద్ధ నదిని బుద్ధిశాలి అయిన కేశవుని సహాయంతో, నావవలె రక్షణతో, పాండవులు దాటగలిగారు.

భారతము అనే పవిత్రమైన పద్మము. మా యందలి దోషమును పోగొట్టి మాకు శ్రేయస్సును సమకూర్చునది అగుగాక. ఈ పద్మ విశేషణమేమిటంటే,



ఇది వ్యాసునియొక్క వచనముల రూపము. గీతార్థ సువాసనను వెదజల్లుతుంది. ఈ భారతములో చాలా కథలు కేసరములవలె పద్మగర్భంలో నిలచి ఉన్నా హరిని గురించి కథల రూపంలో బోధింపబడినాయి. విశ్వములో సజ్జనులనే భ్రమరములు, ప్రతిదినము ఇందులో మధువును ఆనందముతో గ్రోలుతూ ఉంటాయి. అటువంటి భారతము మనకు శ్రేయస్సు సమకూర్చుగాక. పరమానందరూపుడైన గోవిందుని కృప ఎంతటి శక్తివంతమైనదంటే, అది మూగవానిని మాట్లాడ చేయగలుగుతుంది. కుంటివాడిచేత కొండలనుగూడా అధిరోహింప చేస్తుంది. అటువంటి కేశవునికి సాష్టాంగ ప్రణామము చేయుచున్నాను.

సర్వలోకైకనాథుడు భవభయహరుడైన విష్ణువు ఎటువంటివాడంటే, శాంతికారుడు, శేషశయనుడు, పద్మనాభుడు, సురేశ్వరుడు, విశ్వనాథుడు, గగనమువలె విశ్వవ్యాపి, మేఘపురంగువలె ముచ్చటైన శరీర ఛాయగలవాడు, లక్ష్మీనాథుడు, కమలనేత్రుడు, యోగులందరిచేత సర్వకాల సర్వావస్థలందు ధ్యానింపబడేవాడు. అటువంటి శ్రీకృష్ణభగవానునికి ప్రణామము చేయుచున్నాను.

## శ్రీ భగవద్గీతామృతవాణీ మాహాత్మ్యము

మనస్ఫూర్తిగా ఈ గీతావాణిని పఠించేవాడు, పుణ్యాతిశయముతో, భయశోకాది వర్జితుడై విష్ణుపదాన్ని పొందుతాడు. ప్రతిదినము గీతాధ్యయనం చేస్తూ ప్రాణాయామము చేసేవారి వర్తమాన పూర్వజన్మ పాపాలు నశించిపోతాయి. జలస్నానం ప్రతిదినం చేస్తే మనుజులకు మాలిన్యము కడిగి వేయబడుతుంది. కాని, భగవద్గీతా స్నానము ఒకసారిచేస్తే సంసార భయం అనే మలము నాశనమయిపోతుంది. స్వయంగా కృష్ణభగవానుని ముఖపద్మమునుండి జాలువారిన గీతాశాస్త్రము కర్తవ్యమై నిరంతర గేయమానమగుచుండగా మిగతా శాస్త్రములతో పనేముంది.

విష్ణువుయొక్క ముఖము నుండి జాలువారిన భారతామృత సర్వస్వము అనే గీతాగంగోదకము త్రాగినవానికి పునర్జన్మ ఉండదు. ఉపనిషత్తులన్నియు గోవులు, దోగ్ధ అనగా పాలుపితికేవాడు గోపాలనందనుడు. అర్జునుడు వత్సము అనగా దూడ. ఈ విధంగా గోపాలునిచేత పిదుకబడిన గీతామృత క్షీరమును, బుద్ధిమంతులయినవారు తాగి సుఖింతురు. ప్రపంచంలో ఒకే ఒక శాస్త్రమది. అది దేవకీ పుత్రుడు బోధించిన భగవద్గీతలో ఒకే ఒక కర్మ ఉన్నది. అది ఆ దేవునిసేవ. ఇతరములేదు.

శ్రీమద్భగవద్గీత ఉపనిషత్తులసారము. బ్రహ్మవిద్య. యోగశాస్త్రము. ఇటువంటి శాస్త్రమును సకలజనులకు, ఆనందామృతంగా పంచిన విష్ణుమూర్తి, దుష్టసంహారానికి, సజ్జన రక్షణకు చక్రాయుధాన్ని చేతబట్టినవాడు. ద్వాపరయుగంలో సత్యం, ధర్మం రెండూ మాయమగుటవలన ఈ కృష్ణావతారాన్ని ఎత్తి, తానే జగన్నాథుడనని, భగవంతుడనని ప్రకటించవలసి వచ్చింది.

# శ్రీకృష్ణగీతామృతవాణి

గీత దివినుంచి భువికి దిగివచ్చిన పురుషోత్తముని ముఖారవిందంనుంచి వెలువడిన వాణి. ఇది అమృతవాణి. పార్థుని ద్వారా పార్థసారథి విశ్వవేదికకు అందించిన అమృతవర్షం. అది మన శరీరాన్నేకాక మనసును, హృదయాన్నికూడా కదిలించి కరిగించి ప్రజ్వలింపజేసి ఆ విధంగా ఆచరించమంటుంది. విరాట్ స్వరూపమే ఈ గీతావాణి. ఈ వాణి విశ్వవాసులను పానీయం, సువాసనపుష్పాలలోని తేనెలలో మునిగించుతుంది. మన వాకిళ్ళలో, గృహాలలో మొట్టమొదట వెలిగిన వసంతంలాగ అనుభవం కలిగిస్తుంది. చీకటి కోణాలను ఆదిత్యుని కిరణాలు పారద్రోలినట్లు మన అంతరంగంలోని అంధకారాన్ని అంతం చేస్తుంది.

శ్రీకృష్ణుడు రసస్వరూపుడు. పరిపూర్ణ అవతార పురుషుడు. తైత్తిరీయ ఉపనిషత్తు ఏం చెబుతుందంటే **"రసోవైసః రసగ్గ్ హ్యేవాఽ ఽ యం లబ్ధ్వాఽ ఽ నందీ భవతి"**. భగవంతుడు రసస్వరూపంలో వుంటాడు. అది పొందినవాడు నిజమైన ఆనందాన్ని పొందినవాడౌతాడు. "రసం" మనకు ఎందుకు ఆనందం కలిగిస్తుందంటే అది మధురంకనుక. శ్రీకృష్ణభగవానుని భక్తిలో పారవశ్యం చెందిన వల్లభాచార్యులవారు, శ్రీకృష్ణుని మధుస్వరూపునిగా అభినందించారు. మధురాధిపతి అయిన ఆ శ్రీకృష్ణుని "అధరము, నయనము, హసితము, (చిరునవ్వు), హృదయం, గమనం (జ్ఞానము)" సర్వమూ మధురమే. శ్రీకృష్ణ పరమాత్ముని మాట, చరితము (నడక), పీతాంబరం, జీవితం, వలితం, చలితం (పదము), మధురములే. పూర్ణావతారపురుషుడు వాయించే వేణువు, దానిని ధరించే హస్తము, ఆయన నిలుచున్న త్రిభంగీమనోజ్ఞ నాట్యభంగిమ, గోపికలతో సఖ్యము, స్నేహములు ఇవన్నియూకూడా వర్ణించుటకు అలవికానివి. శ్రీకృష్ణుడు వేణువుపై వాయించే గీతము, సేవించే పానీయము, భుజించే ఫలములు, ఆయన రూపము, ముఖము మీద ప్రకాశించే కస్తూరీతిలకము – ఇవన్నియూ అతిమధురములే.

శ్రీకృష్ణుని "కరణము" అనగా ఆయన చేసే క్రియలు, "తరణం" అంటే ఆయన వేసే అడుగులు. "హరణం" అంటే ఆయన చేసే చోరకృత్యాలు. "రవణం" అంటే గోపికలతో చేసే క్రీడలు. "వమితం, శమితం" అనగా ఆయన కూర్చుండే ఆసీనం, నడచే పవిత్రస్థలం, వ్యాహ్యాళి, యమునా నదీ జలం, దానిలోని కమలపుష్పములుకూడా సుమధురములే. గోపికలతో, ఆయన చేసే రాసక్రీడ ప్రపంచాన్ని మురిపింపచేస్తుంది. విడిగావున్నా "దృష్టం" (దృశ్యం), "శిష్టం" (అలసట)లు కూడా మధురాతిమధురములే. "గోపా" ఆవులను పాలించువారు, "గవాం" (గోవులు), "యష్టి" (వేణువు), "సృష్టి" (వేణువు వాయించునపుడు జరిగే సృష్టి, సంగీతము), "దళితము" (ఆయన కౌగిలి), "పలితం" (క్రీడ). ఇవన్నియూ కూడా అతిమధురములే. శ్రీకృష్ణుడు వసుస్వరూపుడు, వసువులు 8 మంది. ఈ వసువులూ గాయత్రీమంత్రపాద సంఖ్య ఎనిమిది. అదియే గరుత్మంతుడు. అందువలననే శ్రీకృష్ణపరమాత్మ వాహనము గాయత్రీ ఛందస్సు. అనగా గరుత్మంతుడు.

## సప్తశ్లోకీ అమృతవాణి

**1. ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్,**
**యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ ॥**

**అర్థము :** పరబ్రహ్మ అంటే పురుషుడు. పరబ్రహ్మ అపరబ్రహ్మ అను ఈ రెండు రకాలూ "ఓంకారా"లే. 'అ' కార, 'ఉ' కార, 'మ' కారములే 'ఓం' కారము. ఈ 'అ'కార, 'ఉ'కార, 'మ'కారములను స్మరించువాడు ఉత్తమోత్తమమైన గతులు, సోమలోకం పొందుతూ పాపరహితుడై సూర్యమండలములో స్థిరపడతాడు. అట్టి "ఓం" కారముతో, మరణ సమయంలో నన్నే స్మరించుతూ ప్రాణములు విడుచువాడు అత్యుత్కృష్టమైన మోక్షమునుపొందును.

**2. స్థానే హృషీకేశ! తవ ప్రకీర్త్యా, జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ**
**రక్షాంసిభీతాని దిశోద్రవంతి, సర్వేసమస్యంతి చ సిద్ధసంఘాః ॥**



**అర్థము :** ఇక్కడ రాక్షసజాతి గురించి కూడా అర్జునుడు ఉటంకించుచున్నాడు. ఈ విశ్వము, ఈ జగత్తు అంతయూ నీ మహోన్నతమైన తేజస్సుకు, మాహాత్మ్యమునకు ఆశ్చర్యచకితమై, నిన్ను ఆరాధిస్తూ సంతోషానుభూతిని పొందుచున్నది. రాక్షసజాతి అంతయూ భయముతో, నిరాశతో, అష్టదిక్కులకూ పరుగిడుచున్నది. సిద్ధులు యావన్మందీ నీకు సాష్టాంగ ప్రణామములు అర్పించుచున్నారు.

**3. సర్వతః పాణిపాదం తత్ సర్వతోక్షి శిరోముఖమ్,**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥**

**అర్థము :** మోక్షమును పొందడానికి ధ్యానం ముఖ్యము. ధ్యానమును శ్వాసద్వారా పొందవచ్చు. మోక్షమును పొందుటకొరకు దేనిని గ్రహించి తెలుసుకొనవలెనో దానిని "సత్త"ని, "అసత్త"ని విశదీకరించే ఈ సనాతన, తత్త్వం లోకాలన్నింటిలోనూ విస్తరింపబడి, వ్యాపించియున్నది.

**4. కవిం పురాణ మనుశాసితారం అణోరణీయాంస మనుస్మరేద్యః**
**సర్వస్య ధాతార మచింత్యరూపం, అదిత్యవర్ణం తమసః పరాస్తాత్ ॥**

**అర్థము :** సర్వ విషయములందును జ్ఞానమును కలిగినవాడును, పూర్వీకుడును, యావన్మందిని ఆజ్ఞాపించు శక్తికలవాడును, అణువుకంటెనూ కూడా సూక్ష్మాతిసూక్ష్మ స్వరూపుడును, సర్వప్రదాతయును, చింతించడానికి వీలుకాని రూపమును కలవాడును, సూర్య, ఆదిత్య, భాస్కరునివలె నిత్య ప్రకాశరూపమును కలవాడును, అజ్ఞానమును నశింపచేయువాడును అగు ఆ పురుషోత్తముడు పరబ్రహ్మస్వరూపుడు.

**5. ఊర్ధ్వమూలమధశ్శాఖం అశ్వత్థం ప్రాహురవ్యయమ్**
**ఛందాంసి యస్యపర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥**

**అర్థము :** పైన వున్న ఆదిపురుషుడే మూలమూగా చతుర్ముఖబ్రహ్మయే కాండముగా వేదములే ఆకులుగా కల ఈ సంసారమనే ఆకృతిగల అశ్వత్థ

వృక్షము నిత్యమైనది, శాశ్వతమైనది, నాశనముకానిది. దీనిని అర్థము చేసుకొనినవాడు ధన్యుడు, వేదములనే జీర్ణించుకొన గలిగిన మహానుభావుడు.

**6. సర్వస్య చాహం హృదిసన్నివిష్టో మత్తః**
**స్మృతిర్జ్ఞానమపోహనం చ,**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యోవేదాంత**
**కృద్వేదవిదేవ చాహమ్ ॥**

**అర్థము :** కృష్ణపరమాత్మ అర్జునునకు చెప్పుచున్నాడు. నేను సమస్తజీవరాసుల హృదయాంతర్గతమై వున్నాను. అందువలన ఆ ప్రాణులకు, జ్ఞానము, స్మృతి, సందేహములు లేకుండుట ఏర్పడుచున్నది. వేదాలను ఎరిగినవాడను, తెలుసుకొన దగినవాడను, వాటి అర్థము, మహిమలను జీర్ణింప శక్తికలవాడను, కర్తను, మూలమునూ కూడ నేనే.

**7. మన్మనాభవ మద్భక్తో మద్యాజీమాం నమస్కురు,**
**మామేవైష్యసి యుక్త్వైవం ఆత్మానం మత్పరాయణః ॥**

**అర్థము :** కృష్ణభగవానుడు మోక్ష సన్యాసయోగంలో విశదీకరించుచున్నాడు. ఓ అర్జునా! నీ మనస్సు, హృదయం, భక్తి, ఏకాగ్రత నాయందేనిలిపి, నన్నేస్మరిస్తూ, నాకు సాష్టాంగ ప్రణామము చేస్తూ, నా యందే నీ దృష్టిని, నీ శక్తిని, కేంద్రీకరించుతూవుండి, నాకు శరణార్థుడవుకమ్ము. ఆ విధంగా నాకు ప్రియుడవై, స్నేహశీలివై, భక్తుడవై, నన్నే పొందగలవు. ఇది సత్యము. ఇది నా వాగ్దానము. ఆ విధంగా నీకు బోధించుచున్నాను.

# శ్రీకృష్ణాష్టకమ్

**శ్లో॥ వసుదేవసుతం దేవం కంసచాణూర మర్దనమ్,**
**దేవకీ పరమానందం కృష్ణం వందేజగద్గురుమ్ ॥ 1**

(ఇది మొత్తము ద్వితీయా విభక్తిలో వ్రాయబడినది. అంటే 'ని, ను, ల' గురించి అని ఉన్నదన్నమాట, అంటే జగద్గురువైన కృష్ణుని నమస్కరిస్తున్నాను అని అర్థము. తెలుగులో కృష్ణునికి అనే మాట స్థానములో సంస్కృతంలో కృష్ణుని నమస్కరిస్తున్నాను అని ప్రయోగిస్తారు. (తాత్పర్యము) ఈ జగద్గురు శబ్దము కృష్ణుడు భగవద్గీతను బోధించటంవలన వచ్చినది.)

**అర్థము :** వసుదేవసుతుడు, కంసచాణూర మర్దనుడు, దేవకికి పరమానందం కలిగించేవాడు అయిన శ్రీకృష్ణుని(కి) నమస్కారము అంటే వందనం చేస్తున్నాను. ఆనందం కలిగించేవాడు కనుక నందనుడు. ఇది పురాణ పురుషులు వాడినమాట. రామునికూడా వాల్మీకి "కౌసల్యానందవర్ధనః" అన్నాడు. అంటే కౌసల్యామాతకు ఆనందం కలిగించేవాడు అని.

**శ్లో॥ అతసీపుష్పసంకాశం హారనూపురశోభితం**
**రత్నకంకణకేయూరం కృష్ణం వందేజగద్గురుమ్ ॥ 2**

**అర్థము :** అతసీపుష్పమువలె నల్లని శరీరఛాయ కలిగినవాడు (అతసీపుష్పము అంటే నల్లగా ఉండే (అవిసె) పుష్పము.) దానితో సమానమైన నలుపురంగు కలవాడు. అనగా నీలవర్ణుడు అని అర్థము. హారాలతోనూ, నూపురము (అంటే గజ్జెలు)తో శోభించేవాడు, రత్నకంకణాలు, భుజములకు కేయూరాలు కలిగినవాడు అయిన జగద్గురువునకు నమస్కరిస్తున్నాను.

**శ్లో॥ కుటిలాలక సంయుక్తం, పూర్ణచంద్ర నిభాననమ్,**
**విలసత్ కుండలధరం కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 3**

**అర్థము :** వంకరలు తిరిగిన ముంగురులు (గిరజాలు) కలవానిని, పున్నమి చంద్రునివంటి మోము కలవానిని, ప్రకాశించే కర్ణకుండలములు కలవానిని, జగద్గురువు అయిన కృష్ణునకు వందనము చేస్తున్నాను.

**శ్లో॥ మందారగంధ సంయుక్తం, చారుహాసం చతుర్భుజం,**
**బర్హిపింఛావ చూడాంగం కృష్ణం వందేజగద్గురుమ్ ॥ 4**

**అర్థము :** మందారపుష్పముల వాసనలతో కూడిన వానిని (ఇవి దేవవృక్షమునకు పూచినపూలుగదా – కృష్ణునియొక్క పురుషోత్తమ రూపం వర్ణించబడుచున్నది), సమ్మోహన పరచే చిరునగవు కలవానిని, నాలుగు భుజములు కలవానిని (విష్ణువుగా భావించి, ఆయన పంచాయుధ స్వరూపాన్ని అభేదంగా వర్ణిస్తున్నాడు), నెమలిపింఛము చూడము (తలలో ఉన్న కేశములముడి) నందు కలవానిని, జగద్గురువైన కృష్ణునకు వందన మాచరించుచున్నాను.

**శ్లో॥ ఉత్ఫుల్లపద్మ పత్రాక్షం, నీలజీమూత సన్నిభమ్,**
**యాదవానాం శిరోరత్నం, కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 5**

**అర్థము :** వికసించిన తామరలవంటి కనులు గలవానిని, నల్లని మేఘమువంటి శరీరఛాయ గలవానిని (నల్లని మేఘము వర్షాన్ని కురిపిస్తుంది), యాదవులలో శిరోరత్నం (అంటే శ్రేష్ఠుడు అనే అర్థం సిద్ధిస్తుంది). ఇలాంటివాడైన జగద్గురువు కృష్ణునికి నమస్కరిస్తున్నాను.

**శ్లో॥ రుక్మిణీ కేళి సంయుక్తం, పీతాంబర సుశోభితం,**
**అవాప్త తులసీ గంధం, కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 6**

**అర్థము :** రుక్మిణి విలాసంగా ప్రక్కన నిలుచుకొని ఉండగా, బంగారురంగు గల పట్టువస్త్రాలతో శోభించేవాడు, మెడలో తులసీమాల ఉండటంవలన, నిరంతరము ఆ సుగంధంతో కూడినవాడు అయిన జగద్గురువు కృష్ణునికి నమస్కరిస్తున్నాను.



**శ్లో॥ గోపికానాం కుచద్వంద్వ కుంకుమాంకిత వక్షసమ్**
**శ్రీనికేతం మహేష్వాసం, కృష్ణంవందే జగద్గురుమ్ ॥ 7**

**అర్థము :** గోపికల కుచములమీద ఉన్న కుంకుమ తన వక్షస్థలానికి అంటుకుని ఉన్నవాడు, (కుచములమీద చల్లదనానికి స్త్రీలు కుంకుమను రాసుకునేవారు. అలా కుంకుమతో కూడిన స్తనాలతో కృష్ణుని గాఢంగా (ప్రేమాతిశయంతో) కౌగలించుకున్నారు గోపికలు. ఎంత గట్టిగా కౌగిలించుకున్నారంటే ఆ కుంకుమ కృష్ణుని వక్షస్థలానికి అంటింది. గోపికలకు కృష్ణుడంటే ఉన్న ప్రేమ తెలియపరచబడింది. శ్రీనికేతం అంటే కృష్ణుని వక్షస్థలము మీద లక్ష్మీదేవి నివాసం ఉంటుంది.

ఇది ఎలా జరిగింది. దీని ఆధారం వామనావతారంలో ఉంది. 'ఇంతింతై వటు డింతయై' రోదసీలోకి ఎత్తుగాపెరిగి విరాట్స్వరూపం వచ్చినపుడు, లక్ష్మీదేవి స్థానం సరిగా ఆయన వక్షఃస్థలము ఎత్తుకు వచ్చిందట. అందుకని ఋషులు, విష్ణువుయొక్క అన్ని అవతారాలలోను లక్ష్మీదేవి వక్షఃస్థలంమీద ఉంది అని భావిస్తారు. ఇటువంటి వానిని, మహేష్వానుని, జగద్గురువు అయిన కృష్ణునికి వందనమాచరించుచున్నాను.

**శ్లో॥ శ్రీవత్సాంకం మహోరస్కం, వనమాలా విరాజితం,**
**శంఖచక్రధరం దేవం, కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 8**

**అర్థము :** కౌస్తుభమణిని శ్రీవత్సం అంటారు. అపాం సారం – కౌస్తుభం అంటే కౌస్తుభమణి నీటియొక్క సారము అని అర్థం. అది వక్షస్థలంమీద హారంలో ధరించిన కృష్ణుని, కనుకనే గొప్పదయిన చక్కన నయిన వక్షస్థలం కలవానిని, వనమాలలో అంటే తులసీమాలతో విరాజిల్లే కంఠము కలిగినవానిని, శంఖచక్రములు ధరించినవానిని (అంటే కృష్ణుని విష్ణువుగా, పురుషోత్తముడుగా భావించి చేసిన వర్ణన ఇది) అయినటువంటి జగద్గురువు కృష్ణుని నమస్కరిస్తున్నాను.

## ఫలము

**శ్లో॥ కృష్ణాష్టకమిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్**
**కోటిజన్మ కృతం పాపం స్మరణేన వినశ్యతి ॥**

**అర్థము :** శ్రీకృష్ణాష్టకమును ఎవరైతే ఉదయమే నిద్రలేచి చదువుతారో, వారి కోటి జన్మలలో చేయబడ్డపాపము, కేవలం ఈ స్తోత్రాన్ని జ్ఞాపకం చేసుకోవటంవలననే నిర్మూలించబడుతుంది.

కృష్ణునికి సంబంధించినదేదైనా '8' సంఖ్యతో కూడి ఉంటుంది. అష్టవసువులు అని, కృష్ణుడు సంతానంలో 8 వ వాడు. భీష్ముడు అష్ట వసువులలో చివరివాడు. వసువు అంటే బంగారమని, కిరణమని అర్థాలు ఉన్నాయి. గాయత్రీ పాదానికి 8 అక్షరాలు, గాయత్రీ మంత్రానికి విష్ణువు అధిదేవత. అందుకే కృష్ణుడు అష్టమగర్భము. '8' సంఖ్యతో ఏమి చేసినా అది విష్ణువుకే చెందుతుంది.

## అవతారములు

శ్రీమద్భాగవతంలో పేర్కొనబడిన భగవంతుని అవతారములు 28. వాటిలో ముఖ్యమైనవి 10.

**1. మత్స్యావతారం :** చాక్షుష మన్వంతరంలో సముద్రంలో మీనమై భూమిని నావగాచేసి వైవస్వత మనువును ఆ నావమీద కూర్చుండబెట్టి కాపాడాడు. ఈ అవతారం చైత్రశుద్ధ తదియనాడు వెలసింది.

**2. కూర్మావతారం :** దేవతలు దానవులు అమృతంకోసం పాలసముద్రాన్ని మథిస్తుండగా మునిగిపోతున్న మందరపర్వతాన్ని నైపుణ్యంతో తన వీపుపై మోసి పైకిలేవనెత్తిన భగవంతునిది కూర్మావతారం. ఇది వైశాఖపూర్ణిమనాడు జరిగింది.



**3. వరాహావతారం :** హిరణ్యాక్షుడు భూమిని కడలిలో ముంచితే వరాహావతారమెత్తి విశ్వాన్ని పైకి తీసుకువచ్చి రక్షించాడు. ఇది భాద్రపదశుద్ధ తదియనాడు వెలిసింది.

**4. నరసింహావతారం :** భక్తప్రహ్లాదుని తండ్రి అయిన హిరణ్యకశిపుని నరసింహావతారమెత్తి స్తంభంలోంచి వచ్చి భీకరంగా సంహరించాడు. నరసింహావతారంలో ఇది వైశాఖశుద్ధ చతుర్థశినాడు జరిగింది.

**5. వామనావతారం :** పొట్టివానిగా, వామనునిగా జన్మించి మూడులోకాలను ఆక్రమించి బలితలపై పాదంపెట్టి భూలోకంలోకి అణగదొక్కిన భగవంతుని ఇంకొక అవతారం వామనావతారం. ఇది భాద్రపదశుద్ధ ద్వాదశినాడు జరిగింది.

**6. పరశురామావతారం :** ఆనాటి రాజులు, బ్రాహ్మణులను అనేక బాధలనుపెట్టి వేధించుచుండగా, జమదగ్ని, రేణుకలకు పరశురామునిగా జన్మించి 21 మార్లు అట్టి క్షత్రియులను వెదకి వధించాడు. ఇది వైశాఖశుద్ధ తదియనాడు జరిగింది.

**7. రామావతారం :** దశరథ, కౌసల్యలకు ప్రథమ తనయుడుగా శ్రీరామచంద్రుడు జన్మించాడు. సముద్రంమీద వారధికట్టి లంకకుచేరి రావణాది రాక్షసులను సంహరించినాడు. ఇది చైత్రశుద్ధ నవమినాడు జరిగింది.

**8. కృష్ణావతారం :** దేవకీ వసుదేవులకు, అష్టమగర్భంలో శ్రీకృష్ణుడుగా జన్మించి కంసాది దానవులను వధించి లోకాలను రక్షించాడు. ఈ అవతారంలోనే పార్థునికి శ్రీకృష్ణామృతవాణిని (భగవద్గీతను) ఉపదేశించి, తద్వారా విశ్వమానవజాతికి మేలుచేకూర్చి ఆధ్యాత్మిక, తాత్త్విక, సందేశాలను అందించి పార్థసారథియై వెలిశాడు. ఇది శ్రావణ బహుళాష్టమినాడు జరిగింది. అదే శ్రీకృష్ణాష్టమి.

**9. బుద్ధావతారం :** బుద్ధావతారమెత్తి పెడత్రోవ తొక్కుతున్న ప్రజలకు సత్య, అహింసలను ప్రబోధించి సవ్యమైన మార్గగమనంలోకి నడిపించి మేలు చేశాడు. మధ్య గయాప్రాంతంలో ఆశ్వీయుజశుద్ధ దశమినాడు బుద్ధుడు జన్మించాడు.

**10. కల్క్యవతారం :** విష్ణుయశుడు అనే బ్రాహ్మణునికి కల్కిగా జన్మించి పాలకులు స్వార్థాలతో ధన, కనక, వస్తువాహనాలను మోసంతో ప్రజలను పీడిస్తూ, సంపాదించుతుంటే, ప్రజలకు మేలుచేయ పూనుకున్నాడు. ఇతడు శ్రావణశుద్ధ షష్టినాడు జన్మించాడు.

# శ్రీకృష్ణామృతవాణి (భగవద్గీత) మహిమ

**శ్లో॥ గీతాశాస్త్ర మిదం పుణ్యం యః పఠేత్ప్రయతః పుమాన్ ।**
**విష్ణోః పదమాప్నోతి భయశోకాది వర్జితః ॥ 1**

**అర్థము :** ఈ పుణ్యప్రదమైన గీతాశాస్త్రమును ఏ మానవుడు ప్రయత్నపూర్వకముగా (అంటే సర్వశాస్త్రాలతో పోల్చి, గీతాశాస్త్రమే ఉత్తమ శరణ్యమని నిశ్చయబుద్ధితో) పఠిస్తాడో, అతడు భయము, శోకము లేనటువంటి విష్ణుపదమును పొందును.

**శ్లో॥ గీతాధ్యయనశీలస్య ప్రాణాయామపరస్య చ ।**
**నైవసంతి హి పాపాని పూర్వజన్మ కృతాని చ ॥ 2**

**అర్థము :** గీతాధ్యయనమే శీలము అంటే స్వభావముగా గలవాడూ, ప్రాణాయామమును విడువక నిత్యము అభ్యసించేవానికి పాపములు ఉండవు. ఈ జన్మకేకాదు పూర్వజన్మలోచేసిన పాపాలుకూడా నశిస్తాయి. అంటే వాక్కులకూ అదే సమయంలో ప్రాణాయామంలోనూ పాపములను హరించేశక్తి ఉన్నది అని అర్థం.

**శ్లో॥ మల నిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే ।**
**సకృద్గీతాంభసి స్నానం సంసారమలనాశనమ్ ॥ 3**

**అర్థము :** ప్రతిరోజూ స్నానం చేయుటవలననే మానవుని శరీరమలము నిర్మూలింపబడుతుంది. గీతాస్నానం (అంటే గీతాపఠనం అనే స్నానం) ఒక్కసారి చేసినా సంసారబంధము అనే మలము (మనస్సును అంటుకుని ఉన్నది) నాశనము చేయబడుతుంది.

**శ్లో॥ గీతా సుగీతా కర్తవ్యాకిమన్యైః శాస్త్ర విస్తరైః ।**
**యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతా ॥ 4**

**అర్థము :** సుగీతా (అంటూ చక్కగా గానము చేయుటకు తగినది, గానము చేయుటకు అన్నిటికంటే అర్హత కలిగినది అయిన) గీతాశాస్త్రము ఉండగా ఇతర శాస్త్రములతో పనియేముంది. ఎందుకంటే, ఈ గీత స్వయముగా చతుర్ముఖ బ్రహ్మను సృష్టించిన విష్ణుని నోటినుండి వెలువడినది. (విష్ణువునకు కృష్ణునకు ఇక్కడ అభేదము పాటించబడినది).

**శ్లో॥ భారతామృత సర్వస్వం విష్ణో ర్వ క్త్రాద్వినిస్సృతమ్ ।**
**గీతా గంగోదకంపీత్వా పునర్జన్మ న విద్యతే ॥ 5**

**అర్థము :** ఇక భారతమనే అమృతము సర్వస్వము ఈ భగవద్గీతలోనే ఉన్నది. కారణం ఏమంటే ఇది విష్ణువుయొక్క నోటినుండి వెలువడినది. (సామాన్యంగా గంగ విష్ణువుయొక్క పాదములనుండి ఉద్భవించినదని భాగవతం చెబుతుంది. అది జలవిషయం. ఈ గీత వాక్ప్రవాహము అయిన గంగ. అందుకే ఇది అమృతంతో సమానం. అటువంటి గంగోదకం ఎవడైతే త్రాగుతాడో నోటితో గీత చదువుతాడో) వానికి పునర్జన్మలేదు. ఇందులో చాలా విషయములు చెప్పబడ్డాయి. సామాన్యంగా అమృతం తాగితే మరణం ఉండదు. ఈ గీతామృతంతాగితే జన్మరాహిత్యమే వస్తుంది. గంగ అని చెప్పటానికి కారణం, దానికున్న పవిత్రత. మనం రోజూస్నానం చేసేటప్పుడుకూడా "గంగా గంగేతియో బ్రూయాత్' అని స్మరించాలి. కాళిదాసు రఘు వంశంలో విష్ణువువాక్కు నోటిలోనుండి వచ్చిన 'గంగయా'! అని అంటాడు.

**శ్లో॥ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నందనః ।**
**పార్థోవత్సస్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥ 6**

**అర్థము :** ఉపనిషత్తుల సమాహారరూపం గోవు. అయితే, కృష్ణుడు పాలుపితికేవాడు. అర్జునుడు దూడ అంటే దూడను చూసి పాలివ్వాలని సంకల్పం ఉంటేగాని ఆవు పొదుగులో పాలురావు. ఆ దూడ త్రాగిన తరువాత మిగతాపాలను అందరూ తాగుతారు. ఆ రహస్యం కృష్ణునికి తెలుసు. అందుకని, ఉపనిషత్తుల సారము అనబడే గీత అను గోవు ముందర అర్జునుడనే దూడను ఉంచాడు గోపాలుడైన శ్రీకృష్ణుడు. ఆ గీతా క్షీరమును అర్జునుడు తాగిన తరువాత ఇక సుధీయుక్తులే అంటే ఆత్మానాత్మ విచారణ కలిగిన మేధావులే దానిని తాగుతారు. ఈ శ్లోకంలో ఇంత అర్థము ఉంది.



**శ్లో॥ ఏకశాస్త్రం దేవకీ పుత్ర గీతం ఏకోదేవో దేవకీపుత్ర ఏవ ।**
**ఏకోమంత్రస్తస్య నామాని యాని కర్మాస్యేకం తస్యదేవస్యసేవా ॥ 7**

**అర్థము :** ఈ ప్రపంచంలో పేరుకు ఎన్నిశాస్త్రాలున్నా నిజమైన శాస్త్రం భగవద్గీతయే. అదేవిధంగా పేరుకు ఎందరు దేవతలున్నా నిజమైన దేవుడు గోపాలనందనుడైన శ్రీకృష్ణుడే. ఆ శ్రీకృష్ణుని నామజపమే నిజమైన మంత్రము. ఆయనకు చాలా నామాలు ఉన్నాయి. ఏ నామమయినా మంత్రమే. ఈ జగత్తులో నిజమైన పని శ్రీకృష్ణదేవుని సేవ చేయడమే.

**శ్లో॥ సర్వశాస్త్రమయీగీతా, సర్వవేదమయో హరిః ।**
**సర్వతీర్థమయీ గంగా, సర్వతేజోమయీ రవిః ॥ 8**

**అర్థము :** గీతాశాస్త్రము సర్వశాస్త్రమయం. అంటే సర్వశాస్త్ర ప్రచురము. ఇక హరి సర్వవేదమయుడు. వేదాలు ఆయన నిశ్వాసములాంటి అప్రయత్నకార్యాలు. అలాగే గంగానది సర్వతీర్థమయము. గంగలో తీర్థమాడితే అన్య తీర్థాలలో స్నానం చేసినట్లే. ఇదంతా ఎంత సత్యమయినదీ అంటే సూర్యుడు అన్ని కాంతులకూ మూలము, అన్ని కాంతుల స్వరూపము, అన్నంత. ఇది నిత్య సత్యమైనది. అలాగే ఈ శ్రీకృష్ణామృతవాణి అన్న భగవద్గీత సర్వశాస్త్రమయము. శ్రీకృష్ణుడు సర్వవేదమయుడు. గంగ సర్వతీర్థ స్వరూపము.

## శ్రీకృష్ణామృతవాణి – భగవద్గీతా మాహాత్మ్యము

1. పూనికతో ఎవరైతే ఈ గీతాశాస్త్రమును చదువుతాడో, వాడు పుణ్యాతిశయముతో భయశోకాది వర్జితుడై విష్ణుపదాన్ని పొందుతాడు.

2. ప్రతిదినము ఈ అమృతవాణి అయిన గీతాధ్యయనము చేస్తూ, ప్రాణాయామము విడువకుండా చేసేవాడి పాపాలు, పూర్వజన్మలో చేసిన పాపాలతో సహా నశించుతాయి.

3. జలస్నానం ప్రతిదినము చేస్తేనే మనుజులకు మాలిన్యము కడిగివేయబడుతుంది. కాని, భగవద్గీతా స్నానము ఒక్కసారి చేస్తే సంసార భయము అనే మలము నాశనమయిపోతుంది.

4. స్వయంగా పద్మనాభుని ముఖపద్మమునుండి జాలువారిన ఈ గీతాశాస్త్రము కర్తవ్యమై, నిరంతర గేయమానమగుచుండగా మిగతా శాస్త్రములతో పనేముంది.

5. విష్ణువుయొక్క ముఖమునుండి జాలువారి, భారతామృత సర్వస్వము అనబడే అమృతవాణి గీతాగందోదకము త్రాగినవారికి పునర్జన్మ ఉండదు.

6. ఉపనిషత్తులన్నియు గోవులు, దోగ్ధ (పాలుపితికేవాడు) గోపాల నందనుడు. అర్జునుడు వత్సము (దూడ) ఈ విధముగా గోపాలునిచేత పితకబడిన గీతామృత క్షీరమును బుద్ధిమంతులు అయినవారు పానము చేసి ఆనందిస్తారు.

7. ప్రపంచములో ఒకటే ఒక శాస్త్రము ఉంది. అదియే దేవకీపుత్రుడు చెప్పిన శ్రీకృష్ణామృతవాణి (భగవద్గీత) ఒకేఒక దేవుడున్నాడు. అతడే దేవకీపుత్రుడు. ఒకేఒక్క మంత్రము ఉంది. అవియే గోవిందనామాలు. ఒకటే ఒక కర్మ ఉన్నది. అదే దేవునిసేవ. ఇతరములేదు.

# విషయసూచిక

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

## మొదటి అధ్యాయము

## అర్జున విషాద యోగము

వ్యాసమహర్షి సాక్షాత్తు భగవంతుని అంశతో జన్మించిన కృష్ణద్వైపాయనుడు. బాదరాయణుడు. అనంతములైన శాస్త్రవిషయములను ఔపోసనబట్టిన మహాఋషి. ఆర్షవిజ్ఞాన సారస్వత దీపములను వెలిగించి మోక్షమును ఆశించినవారికి మార్గమును జూపెను. అష్టాదశ పురాణములను, బ్రహ్మసూత్రములను రచించెను. దానితో సంతృప్తినొందక నారదుని సలహా ప్రకారము శ్రీకృష్ణలీలలను, విశ్వసృష్టి మొదలగువాటి నన్నింటిని విశదముగా పొందుపరచి భాగవతమును కూడా రచించెను. వేదములను సంస్కరించి వేదవ్యాసుడైన పుణ్యమూర్తి. రామాయణము, భారతములు, పురాణములు, భాగవతం వేదమయము.

వ్యాసమహర్షి భారతాంతర్గతమైన "శ్రీకృష్ణామృతవాణి అయిన భగవద్గీతను రచించెను. విశ్వవాసులకు మోక్షజ్ఞానమార్గములను జూపించెను. సాక్షాత్తు నారాయణ స్వరూపుడైన వ్యాసుడు గురువులకే గురువు. ఆయన జయంతిరోజున "గురుపూర్ణిమ"గా పర్వదినముగా సుజనులు జరుపుకొందురు.

వ్యాసుడు సత్యవతీ, పరాశరుల పుత్రుడు. ధర్మప్రయోజకులు, మహానుభావులలో ఒకరిగా ప్రకటించబడినాడు. వ్యాసుని పేరుతో "వ్యాసస్మృతి, వ్యాససంహిత" అను రెండు కృతులు 364 శ్లోకాలతో ఉన్నాయి.

ధృతరాష్ట్రుడు కౌరవ, పాండవుల యుద్ధవిశేషాలు తెలుసుకోవాలని వ్యాసుని కోరెను. ఆయన కోరికమేరకు సంజయునికి దూరదృష్టి, దూరశ్రవణ మహిమలను ప్రసాదించి, చూచిన విధంగా ధృతరాష్ట్రునికి వివరించమని వ్యాసుడు సంజయునికి తెలిపెను. సంజయుడు కౌరవ పాండవ యుద్ధ

విశేషములను ధృతరాష్ట్రునికి చూచిన విధంగా వివరించెను. ఈ అధ్యాయము అర్జున విషాద యోగముతో ప్రారంభమవుతుంది.

**ధృతరాష్ట్ర ఉవాచ**

**ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।**
**మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ ॥ 1**

**తాత్పర్యము:** కౌరవుల తండ్రి అయిన ధృతరాష్ట్రుడు సంజయుని ఈ విధంగా ప్రశ్నిస్తున్నాడు. ఓ సంజయా! ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందు యుద్ధ సన్నద్ధులైన నా పుత్రులు పాండవరాజు పుత్రులు ఏమి చేసిరి.

**సంజయ ఉవాచ**

**దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా ।**
**ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్ ॥ 2**

**తాత్పర్యము:** సంజయుడిట్లు చెప్పెను. దుర్యోధనుని సమరవ్యూహరచనతో ఏర్పాటు చేయబడిన పాండవసేనను వీక్షించి గురువైన ద్రోణాచార్యునిని సమీపించి అతడు ఈ విధముగా కోరెను.

**పశ్యైతాం పాండు పుత్రాణాం ఆచార్యమహతీం చమూమ్ ।**
**వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవశిష్యేణ ధీమతా ॥ 3**

**తాత్పర్యము:** ఓ ఆచార్యవర్యా! బుద్ధిశాలి అయిన మీ శిష్యుడు, మీ కుమారుడు అయిన ధృష్టద్యుమునిచే ప్రముఖంగా, ఒక పద్ధతి ప్రకారం ఏర్పాటు చేయబడిన ఈ మహాసైన్యమును వీక్షింపుము.

**అత్ర శూరా మహేష్వాసా భీమార్జున సమాయుధి ।**
**యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥ 4**

**ధృష్టకేతుశ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్ ।**
**పురుజిత్ కుంతి భోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః ॥ 5**



**యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।**
**సౌభద్రో ద్రౌపదే యాశ్చ సర్వ ఏవ మహారథాః ॥ 6**

**తాత్పర్యము:** ఈ పాండవసేనా సమూహమున గొప్పధనుస్సులను ధరించిన సాత్యకి, విరాటరాజు, ద్రుపదరాజు, దృష్టకేతువు, చేకితానుడు, శూరుడైన కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, నర ప్రముఖుడైన శైబ్యుడు, పరాక్రమశాలి అయిన యుధామన్యుడు, బలశాలి అయిన ఉత్తమౌజుడు, సుభద్రాపుత్రుడైన అభిమన్యుడు, ద్రౌపదీపుత్రులు ఐదుగురు మొదలగువారు కలరు. వీరందరు మహారథులేగాక, భీమార్జున వీరులతో సమానమైనవారే.

**అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ ।**
**నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే ॥ 7**

**తాత్పర్యము:** ఓ ద్విజోత్తమా, ద్రోణచార్యా! మన సైన్యసమూహంలో ప్రముఖులైన వీరాధివీరులను గురించి మీరెరుంగుటకై చెప్పుచున్నాను.

**భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః ।**
**అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిస్తథైవ చ ॥ 8**

**తాత్పర్యము:** పూజనీయులైన మీరును భీష్మపితామహుడును, కర్ణుడును, కృపాచార్యులును, సోమదత్తుని పుత్రుడైన భూరిశ్రవుడు మొదలైనవారు మీ సమూహములో ప్రముఖులు.

**అన్యే చ బహవః శూరా మదర్థే త్యక్త జీవితాః ।**
**నానాశస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః ॥ 9**

**తాత్పర్యము:** ఇంకను, నానా శస్త్రములు ప్రయోగించుటలో ప్రావీణ్యం గలిగి, యుద్ధకోవిదులై నాకోసం ప్రాణాలు త్యజించడానికి సిద్ధముగా (వీరమరణమునకు) నున్న చాలామంది వీరులుకలరు.

**అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభి రక్షితమ్ ।**
**పర్యాప్తం త్విదమే తేషాం బలం భీమాభి రక్షితం ॥ 10**

**తాత్పర్యము:** వీరాధివీరుడైన భీష్మాచార్యుని శిక్షణతో రక్షింపబడుచున్న మన సేన, పరిమితిలేనిదై అధికముగానున్నది. భీముని నాయకత్వంతో రణములో రక్షింపబడుచున్న పాండవసైన్యము చాలా పరిమితమైయున్నది. కనుక పాండవులను జయించుట సులభము.

**అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః ।**
**భీష్మమేవాభి రక్షంతు భవంతః సర్వ ఏవ హి ॥** 11

**తాత్పర్యము:** అందువలన మన సైన్యసమూహమంతయు నియమించబడిన, ఎవరిస్థానములో వారు ఉండి సన్నద్ధులై భీష్ముని రక్షించుచుండవలెను.

**తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః ।**
**సింహనాదం వినద్యో చ్చైః శంఖం దధ్మౌప్రతాపవాన్ ॥** 12

**తాత్పర్యము:** అందుచేత, మీరు యావన్మంది మీ మీ విభాగముల ప్రకారము ఆయా స్థానములయందుండి భీష్ముని రక్షించుచుండవలెను. దుర్యోధనుడు పలికిన ధైర్య వచనములు విని, భీష్మ పితామహుడు సింహగర్జనతో తన శంఖమును పూరించెను. అది విని హర్షముతో దుర్యోధనుని హృదయము ఉప్పొంగెను.

**తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః ।**
**సహసైవాభ్యహన్యంత స శబ్దస్తుములోఽ భవత్ ॥** 13

**తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ ।**
**మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః ॥** 14

**తాత్పర్యము:** భీష్మ పితామహునికి యుద్ధమునందున్న ఉత్సాహము అందరిని అన్నివిధముల ధైర్యము కలిగించెను. అంతేకాక, ఉత్సాహమును కూడా కలిగించెను. భేరులు, ఢక్కలు, మృదంగములు, రణశృంగములు ఒక్కసారిగ మ్రోగినవి. వాటన్నింటి ధ్వనులు అన్ని విధములుగా కలిసిపోయెను.



అటుతర్వాత తెల్లని అశ్వములచే కట్టబడిన ఉన్నతమైన రథమునందు ఆశీనులై శ్రీకృష్ణార్జునులు తమ తమ దివ్యములైన శంఖములను పూరించిరి.

**పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః ।**
**పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మావృకోదరః ॥** 15

**అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః ।**
**నకులః సహదేవశ్చ సుఘోషమణి పుష్పకౌ ॥** 16

**తాత్పర్యము:** శ్రీకృష్ణుడు పాంచజన్యము, అర్జునుడు దేవదత్తం, భీముడు పౌండ్రము, ధర్మరాజు అనంతవిజయము, నకులసహదేవులు సుఘోష మణిపుష్పకములను శంఖములను ఉత్సాహముతో పూరించిరి.

**కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః ।**
**ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః ॥** 17

**ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే ।**
**సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్ ॥** 18

**తాత్పర్యము:** సంజయుడు దృతరాష్ట్రునితో అనుచున్నాడు. ఓ రాజా! శ్రేష్ఠమైన ధనుస్సుగల కాశీరాజును మహాంధుడైన శిఖండియును, ధృష్టద్యుమ్నుడును, విరాటరాజును, అపజయమెరుగని సాత్యకియును, ఇంకను ద్రుపద మహారాజును, ద్రౌపదీ పుత్రులైన ఉపపాండవులును, సుభద్రా అర్జునుడైన అభిమన్యుడును, ఎవరి శంఖములను వారు బిగ్గరగా పూరించిరి.

**సఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।**
**నభశ్చ పృథివీం చైవతుములోఽ భ్యనునాదయన్ ॥** 19

**తాత్పర్యము:** పాండవులయొక్క, వారి పక్షమున నిలచియున్న వీరులయొక్క ప్రతిధ్వనులు అధిక శబ్దముతో గగనభాగమునందెల్ల దద్దరిల్ల కౌరవులయొక్క హృదయములలో భయము ఆవహించెను.

**అథవ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।**
**ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః ॥ 20**
**హృషీకేశం తదావాక్యం ఇదమాహ మహీపతే ।**

**అర్జున ఉవాచ**

**సేనయో రుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ॥ 21**

**యావదేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్ ।**
**కైర్మయా సహయోద్ధవ్యం అస్మిన్ రణసముద్యమే ॥ 22**

**తాత్పర్యము:** ధనుస్సును ఎక్కుపెట్టి యుద్ధమునకు సిద్ధముగా నున్న అర్జునుడు ఆంజనేయుని ధ్వజముగాగల రథములోనుంచి దుర్యోధనాదులను జూచి శ్రీకృష్ణునితో ఈ విధముగా పలికెను. నేను ఎవరెవరితో యుద్ధము చేయవలెనో వారందరిని చూడవలెను. అంతవరకు మన రథము నిలిపియుంచమని కోరుచున్నాను.

**యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః ।**
**ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః యుద్ధే ప్రియ చికీర్షవః ॥ 23**

**తాత్పర్యము:** నేను ఎవరెవరితో సమరము చేయవలెనో దుర్యోధనుని దుర్బుద్ధితో వీరందరూ సమావేశమైనారో వారినందరిని నేను చూడగోరుచున్నాను. అందువలన మన రథమును ఉభయసేనల మధ్య నిలిపియుంచుము.

**సంజయ ఉవాచ**

**ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।**
**సయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్ ॥ 24**

**భీష్మద్రోణ ప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్ ।**
**ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి ॥ 25**



**తాత్పర్యము:** సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పుచున్నాడు. ఓ రాజా! అర్జునుని కోరిక ప్రకారము భీష్మద్రోణ మొదలగు వీరుల మధ్య, ఇంకనూ అనేక వీరుల మధ్యను తన రథమును నిలిపి యుద్ధమును చేయవచ్చిన ఈ కౌరవ వీరులనందరిని చూడుము.

**తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్ ।**
**ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా ।**
**శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయోరపి ॥ 26**

**తాత్పర్యము:** అర్జునుడు ఉభయసేనా సమూహముల మధ్యనున్న భూరిశ్రవుడు మొదలగు తండ్రులను, భీష్మాది తాతలను, ద్రోణాచార్యుడు మొదలగు గురువులను, శల్యుడు మొదలగు మేనమామలను, దుర్యోధనాది సోదరులను, పుత్రులను, మనుమలను, మిత్రులను, మరియు మామలు మొదలగు బంధువులను చూచెను.

**తాన్ సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూ నవస్థితాన్ ।**
**కృపయా పరయావిష్టో నిషేదన్నిదమబ్రవీత్ ॥ 27**

**తాత్పర్యము:** యుద్ధముచేయుటకు వచ్చియున్న బంధుమిత్రులందరిని చూచిన అర్జునునకు మిక్కిలి దుఃఖము కలుగగా ఈ విధముగా పలికెను.

**అర్జున ఉవాచ**

**దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితం ।**
**సీదంతి మమగాత్రాణి ముఖం చ పరిశుష్యతి ॥ 28**

**వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ।**
**గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే ॥ 29**

**న చ శక్నోమ్యవస్థాతుం భ్రమ తీవ చ మే మనః ।**
**నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ॥ 30**

**తాత్పర్యము:** అర్జునుడు ఈ విధముగా కృష్ణునితో పలుకుచున్నాడు. ఓ కృష్ణా! ఉన్మాదముతో సమరమునకు వచ్చిన బంధువులను మొదలగు వారలను చూచి నాసర్వ అవయవములు శక్తిహీనములగుచున్నవి. నోరు ఎండిపోవుచున్నది. నా శరీరము కంపము నొందుచున్నది. రోమములు చలనము పొందుచున్నవి. మనస్సు కలతచెందుచున్నది. గాండీవము జారిపోవుచున్నది. చర్మము మండుచున్నది. కృష్ణా! స్థిరముగా నుండలేకున్నాను. మనస్సు భ్రమకు లోనగుచున్నది. విపరీతముగా అపశకునములు కనపడుచున్నవి.

**న చ శ్రేయోఽనుపశ్యామి హత్వాస్వజన మాహవే ।**
**న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ ॥ 31**

**కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా ।**
**యేషా మర్థేకాంక్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ ॥ 32**

**తాత్పర్యము:** శ్రీకృష్ణా! సమరమున బంధువులను, మిత్రులను చంపగా వచ్చు రాజ్యమును, సుఖమును ఆశించను. రాజ్యముతో వచ్చు అధికారమును, భోగములును నాకు అవసరములేదు. మరియు నేనుకోరను.

**త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్యక్త్వా ధనాని చ ।**
**ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః ॥ 33**

**మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సంబంధిన స్తథా ॥**

**తాత్పర్యము:** ఎదుటి పక్షములోనున్న గురువులు, తండ్రులు, పుత్రులు, తాతలు, మామలు, మేనమామలు, బావమరుదులు, అంతేగాక, ఇతర బంధువులు, వారి వారి ధనములను, భోగములను, రాజ్యములను తిరస్కరించి ఈ రణమునకు వచ్చి యుండిరి.

**ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన । 34**



**అపిత్రైలోక్యరాజస్యహేతోః కిం ను మహీకృతే ।**
**నిహత్య ధార్తరాష్ట్రాన్ నః కా ప్రీతిః స్యాత్ జనార్దన ॥ 35**

**పాపమే వాశ్రయేదస్మాన్ హ త్వైతా నాతతాయినః ।**

**తాత్పర్యము:** కృష్ణా! ఒకవేళ వీరందరిని హతమార్చినచో మూడులోకములపై అధికారము పొందగలిగిననూ నేను ఇష్టపడను. ఇంక తాత్కాలికమైన విశ్వాధిపత్యము సంగతి చెప్పనవసరములేదు.

ఓ శ్రీకృష్ణా! ధూర్తులగు దుర్యోధనాదులను సంహరించిన ఏమి ఆనందము కలుగును. మదోన్మత్తులను, ఆతతాయులను సంహరించుటవలన మనకు పాపమే లభించును.

**తస్మా న్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్ ।**
**స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ ॥ 36**

**తాత్పర్యము:** ధృతరాష్ట్రుని పుత్రులు మనకు బంధువులుకదా. అందువలన వారిని హతమార్చుటకు మనము అర్హులముకాదు. కాబట్టి, మనకు సుఖము ఎట్లు లభించును?

**యద్యప్యేతే న పశ్యంతి లోభోపహత చేతసః ।**
**కులక్షయ కృతం దోషం మిత్రద్రోహే చ పాతకం ॥ 37**

**కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మాన్ని వర్తితుమ్ ।**
**కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన ॥ 38**

**కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాః సనాతనాః ।**
**ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభి భవత్యుత ॥ 39**

**తాత్పర్యము:** ఈ దుర్యోధనుడు మొదలగువారు దోషముతోకూడిన లోభమునందు మునిగినవారై, బంధువులను మిత్రులను వధించుటవలన వచ్చు పాపమును ఊహించ అసమర్థులైయున్నారు. కృష్ణా! ఈ

వంశనాశనమువలన మనకు పాపము తప్పక కలుగును. దీనినుండి మనము బందీలుకాకుండా యుండుటకు తీవ్రప్రయత్నము చేయవలెనుకదా. ఇది ముఖ్యము. కులనాశన కారణముగా సనాతనమైనవి, శాశ్వతమైనవి అయిన కులధర్మములు నశించును. అధర్మము, అనాచారములు వంశమంతయు వ్యాపించి నాశనము చేయును.

**అధర్మాభి భవాత్ కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః ।**
**స్త్రీ షు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః ॥ 41**

**తాత్పర్యము:** శ్రీకృష్ణా! అధర్మమును అనుసరించుటవలన సత్కులమున నున్న స్త్రీలు దూషింపబడి చెడిపోవుదురు. అందువల్ల వర్ణసంకరము కలుగుట తథ్యము.

**సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।**
**పతంతి పితరోహ్యేషాం లుప్తపిండోదక క్రియాః ॥ 42**

**దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః ।**
**ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥ 43**

**తాత్పర్యము:** వర్ణ సంకరము కులములను నాశనము చేసినవారికే కాక, కులమంతటికి నరకమే ప్రాప్తించును. పితృదేవతలు పిండ, దాన, తర్పణాదులు లేక నరకలోకమున పడుదురు. ఈ వర్ణసంకరము మూలముగా దోషములు కలిగి, కులనాశకులవల్ల సనాతనము, శాశ్వతమైన ధర్మములు, నశించి నష్టము కలుగును. ఇది వాంఛనీయముకాదు.

**ఉత్పన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన ।**
**నరకే నియతం వాసో భవితీత్యనుశుశ్రుమ ॥ 44**

**అహో! బత! మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।**
**యద్ రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః ॥ 45**



**తాత్పర్యము:** కృష్ణా! కులధర్మములు నాశనము చేసినవారు భ్రష్టులగుదురు. ఈ విధముగా వారు నిత్యము నరకమునందే ఉందురు. దీనిని పరంపరంగా వినుచున్నాము కదా! ఇట్లు మనము రాజ్యము, ధనము కొరకు లోభముతో మనబంధువులు, స్నేహితులు అయిన స్వజనులను వధించిన పాపమునకు లోబడినవారముకదా!

**యది మామప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః ।**
**ధార్తరాష్ట్రా రణే హన్యుః తన్మే క్షేమతరం భవేత్ ॥ 46**

**తాత్పర్యము:** శస్త్రాదులను విడిచి పెట్టినట్లయిన నేను నిరాయుధుడగుదును. అప్పుడు సమరము చేయలేనుకదా! అటువంటి సమయములో ధృతరాష్ట్రుని పుత్రులు మొదలగువారు నన్ను వధించినను నాకు మంచిదే. నాకు శ్రేయస్కరమే అగును.

**సంజయ ఉవాచ**

**ఏవ ముక్త్వార్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।**
**విసృజ్య సశరం చాపం శోక సంవిగ్న మానసః ॥ 47**

**తాత్పర్యము:** సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పుచున్నాడు. అర్జునుడు యుద్ధములో బాణములతో కూడిన ధనస్సును, ఇతర ఆయుధములను త్యజించి రథమునందు కూలబడి, విచారములో మునిగియుండెను.

***ఇట్లు ఉపనిషత్తులును, బ్రహ్మావిద్యయు, యోగశాస్త్రమును "శ్రీకృష్ణార్జున" సంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందలి "అర్జున విషాదయోగ" మనెడి ప్రథమోఽధ్యాయము.***

ఈ విధముగా వాదించి అర్జునుడు ఎందులకు యుద్ధము చేయవలెనని ఆయుధములను విసర్జించెను. తాను ఎవరితో యుద్ధము చేయవలయునో, వారందరు తనకు బంధు, మిత్ర, గురువులని సంగ్రామమునకు ముందు తెలియదా! తీరా యుద్ధమునకు సన్నద్ధుడైవచ్చి, వారందరిని వీక్షించి, యుద్ధము చేయనని వింతగా ప్రవర్తించుటలో ఉన్న రహస్యమేమిటి? అర్జునుడు రాజు, క్షత్రియ ధర్మమును పాటించువాడు. రాజులకు ధర్మవ్యవస్థను రక్షింపవలసిన ధర్మము విధిగానున్నది. కనుక, వర్ణవ్యవస్థ దృష్టిలో ఆలోచించాడు. వీరందరినీ చంపితే స్త్రీలు భవిష్యత్తులో చెడగొట్టబడితే, వారికి పుట్టే సంతానము వర్ణసంకరమవుతుంది. అందువలన, పితృదేవతలకు "స్వధ" లభింపకవారు శాశ్వతనరకంలో ఉంటారు. ఇందులో సంతాన శుద్ధత, పాతివ్రత్యము, లోకము పుణ్యమార్గములో నడచుట, అనే రాజధర్మము అర్జునుని హృదయములో ప్రముఖంగా ఉంది. అది నిజమే అయినా తప్పు అని కృష్ణుడు నిరూపిస్తాడు.

ఇది అంతయూ శ్రీకృష్ణ భగవానునకు తెలియకపోలేదు. తన అవతార సమాప్తి అనంతరము కలియుగము ప్రారంభమవుతుంది. పురుషులు, స్త్రీలకు లొంగి ఉందురు. పుత్రులే శత్రువులౌతారు. వారు తల్లితండ్రులను, తోడపుట్టిన వారికి ద్రోహముచేస్తూ, లక్ష్యము చేయక, భార్యలకు బందీలయి, వారి బంధువులను మాత్రమే ఆదరిస్తూ తల్లితండ్రులను హింసించెదరు. తమ సౌఖ్యమే ముఖ్యమనే దుష్టభావముతో ప్రవర్తించెదరు. ఆ విధంగా ప్రవర్తిస్తూ ప్రస్తుత జన్మలోనేకాక, మరుజన్మలో కూడా పాపమును మూట గట్టుకుని చివరకు విధి విధించిన దండనకు లోనవుదురు.

ధర్మదేవత మూడుపాదములను కలి సంహరిస్తాడు. నాల్గవపాదము కూడ సంహరిస్తుంటే, పరీక్షిత్తు మహారాజు అడ్డుకుని, కలిని సంహరింప ఉద్యమించెను. "నీవు అధర్మమునకు ప్రియుడవు, బంధువు, అందువలన నా రాజ్యములో ఉండుటకు తగవు, వెంటనే నిష్క్రమించుము" అని ఆజ్ఞాపించెను. అయితే నేనెక్కడ ఉండవలెనని కలి పురుషుడు పరీక్షిత్తును ప్రార్థించెను. అపుడు పరీక్షిత్తు ఈ విధముగా కలికి 'ఆజ్ఞాపించెను' "నీవు నాస్తికులు, భగవన్నామస్మరణ లేనిచోట, ఎక్కడ జూదము, ఇంద్రియములయం దత్యాసక్తి, హింస, అసత్యము, చౌర్యము, ధర్మహాని, స్త్రీ హింస, కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యములుండునో ఆప్రదేశాలలో నివసింపుము" అని ఆజ్ఞాపించెను.



ఇదంతయూ భగవానుడైన శ్రీకృష్ణ పరమాత్మ భవిష్యత్ దర్శనమును గ్రహించినవాడై తన అమృతవాణి అయిన "భగవద్గీత"ను అర్జునునకు ఉపదేశించి, తద్వారా విశ్వవాసులకు అందజేయుటకు, వారు ఈ అమృతవాణిని కరతలామకము చేసుకుని, భగవన్నామం చేసుకుంటూ, భక్తిభావంతో పాపరహితులై, పుణ్య మార్జించ సన్నద్ధులగుటకు, వారికి మేలు చేయుటకే జరిగినది, అని గ్రహించవలెను. ఈ పాప కలియుగంలో, భగవంతుని అమృతవాణి అయిన గీతా పఠనంతో, శ్రీకృష్ణుని ఆదేశం ప్రకారం నడచుకొన వలసిన బాధ్యత జనవాహినిలో ఉన్నది. భగవద్గీత ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రముల సమూహము. ఇది జనన, మరణ, సంసార విషచక్ర బంధములనుండి మానవుని విడిపించి, ఆత్మను సాక్షాత్కరింపజేయడమనే బృహత్కార్యమును, భక్తి, జ్ఞాన, వైరాగ్యములద్వారా మనుజునికి విముక్తిని ప్రసాదించటమే శ్రీకృష్ణామృతవాణి ముఖ్యోద్దేశము.

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

# రెండవ అధ్యాయము

# సాంఖ్య యోగము

ఆధ్యాత్మికత అంటే ఏమిటి? జీవాత్మను పరమాత్మతో అనుసంధానించుకొనే ఒక పవిత్రమైన సాధన, అనుభవం, ఏకాగ్రత, ధ్యానం ఆధ్యాత్మికత చేతనే లభిస్తుంది. ఆత్మజ్ఞానం సాధ్యపడాలి. జీవగతమైన ఆత్మ పరమాత్మగా పరిణతి చెందాలి. ఆత్మానుసంధానంతో సర్వం శక్తిమయమవుతుంది.

మనస్సులోని మాలిన్యమును నశింపజేసుకొని పరిశుద్ధమైన ఆత్మవిజ్ఞానము, ఆత్మయే నిత్యమని, సత్యమని, నశింపబడనివనే దృక్పథంతో జీవితాన్ని మలచుకొని, ఆధ్యాత్మిక స్థాయిని మానవుడు దర్శించుకోవాలి. ఏకాగ్రతతో, మనోబుద్ధులతో మానవుడు చైతన్యము పొందుటకు ప్రయత్నించాలి. శ్రీకృష్ణపరమాత్మయే ఈ ప్రకృతిని నియమించే నాథుడనే తత్త్వాన్ని జీర్ణించుకొని మానవుడు స్వధర్మాలను నిర్వర్తిస్తూవుండాలి. సాధ్యమైనంతవరకు ఆశకు బానిసకాకుండా, జ్ఞానాన్ని అభివృద్ధి (చేసుకొని, శాస్త్ర విరుద్ధ)మగు కర్మలను చేయకుండా ఉండాలి. మానవుడు తన శక్తికొలది సత్యమును, ధర్మమును ఆచరించడము, నీచమైన కర్మలకు స్వస్తిచెప్పడం, తపస్సు, శౌచము మొదలగు యోగధర్మాలను పాటించాలి.

ఇదియే సాంఖ్యయోగములోని ముఖ్యవిషయము.

**తం తథా కృపయా విష్టం అశ్రుపూర్ణాకులేక్షణమ్ ।**
**విషీదంతమిదం వాక్యం ఉవాచ మధుసూదనః ॥ 1**

**తాత్పర్యము:** సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పుచున్నాడు. అర్జునుని హృదయం ఆ విధంగా కరుణతో నిండిపోయినది. వ్యాకులపాటుతోనూ, శోకముతోనూ బాధపడుచున్న అర్జునునితో శ్రీకృష్ణు డిట్లు వివరించెను.



శ్రీభగవాన్ ఉవాచ

**కుతస్త్వాకశ్మలమిదం విషమే సముపస్థితమ్ ।**
**అనార్యజుష్టమస్వర్గ్యం అకీర్తికరమర్జున ॥ 2**

**తాత్పర్యము:** శ్రీకృష్ణ పరమాత్మ చెప్పుచున్నాడు. ఓ అర్జునా! నువ్వు శ్రేష్ఠుడవు. అట్టి నీకు ఇటువంటి అనర్థమైన మోహము తగదు, ఇది నీవంటి వారికి కీర్తి స్వర్గాదులు మొదలగు వాటిని దూరము చేయును.

**క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే ।**
**క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ॥ 3**

**తాత్పర్యము:** అర్జునా! నీ పిరికితనము మంచిదికాదు. నీచమైన ఈ దుర్బలత్వమును విసర్జించి ధైర్యము తెచ్చుకొని యుద్ధము చేయుటకు సిద్ధముగా నుండుము.

అర్జున ఉవాచ

**కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।**
**ఇషుభిః ప్రతియోత్స్యామి, పూజార్హావరిసూదన ॥ 4**

**తాత్పర్యము:** పరమాత్మా! భీష్మ పితామహుడు, ద్రోణాచార్యులు నాకు పూజ్యులు, గురువులు అట్టి మహాత్ములను ఎదిరించి సమరము ఎట్లు చేయగలను.

**గురూ నహత్వా హి మహానుభావాన్**
**శ్రేయోభోక్తుం భైక్ష్య మహీహలోకే ।**
**హత్వార్థ కామాంస్తు గురూనిహైవ**
**భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్ ॥ 5**

**తాత్పర్యము:** మహానుభావులైన గురువులను చంపకుండా భిక్షముతో బ్రతుకుట శ్రేయము. అంతియేగాక, వారిని వధించి రక్తసిక్తమైన రాజ్యమును భోగములను నేను అనుభవించవలెను కదా.

**న చైతద్విద్మః కతరన్నోగరీయో**
**యద్వా జయేమ యది వానో జయేయుః ।**
**యానేవ హత్వా న జిజీ విషామః**
**తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥ 6**

**తాత్పర్యము:** ఏది మంచిదో తెలియుటలేదు. మనము జయించుటయా లేక వారు జయించుటయా? ఎవరినైతే జయించి జీవించగోరమో వారే యుద్ధమునకు సిద్ధముగా వచ్చియున్నారు.

**కార్పణ్య దోషోపహతస్వభావః**
**పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢ చేతాః ।**
**యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహితన్మే**
**శిష్యస్తేఽహంశాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥ 7**

**తాత్పర్యము:** ఓ కృష్ణా! దీనతా దోషము నన్ను ఆవరించియున్నది. ఈ దోషముతో నేను మూఢునిగా ధర్మమును నిర్ణయింపలేనిస్థితిలో నిన్ను ప్రార్థించుచున్నాను. నేను నీ శిష్యునిగా శరణుపొందుతూ నా కర్తవ్యమును నేను తెలుసుకొనలేక నిన్ను శరణాగతిని పొంది ఉపదేశించ కోరుచున్నాను.

**నహిప్రపశ్యామి మమాపనుద్యాత్**
**యచ్ఛోక ముచ్ఛోషణమింద్రియాణామ్ ।**
**అవాప్య భూమావసపత్నమృద్ధం**
**రాజ్యం సురాణామపి చాధిపత్యమ్ ॥ 8**

**తాత్పర్యము:** ఈ శోకము నా ఇంద్రియములను శుష్కింపచేయుచున్నది. ఈ భూమియందు సర్వాధికార, సిరిసంపదలాది భోగములున్న రాజ్యమేకాక, చివరకు దేవతలయొక్క ఆధిపత్యము లభించిననూ ఈ శోకము నశించునట్లులేదు. అట్టి ఉపాయమును కనుగొనలేకున్నాను.



**సంజయ ఉవాచ**

**ఏవ ముక్త్వా హృషీకేశం, గుడాకేశః పరంతప ।**
**న యోత్స్య ఇతి గోవింద ముక్త్వాతూష్ణీం బభూవహ ॥ 9**

**తాత్పర్యము:** సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పుచున్నాడు. ఓ రాజా! ఈ విధంగా అర్జునుడు నిరాశపడి గోవిందునితో “నేను సంగ్రామము చేయలేను” అని స్పష్టముగా చెప్పి అర్జునుడు ఊరకుండెను.

**తమువా చ హృషీకేశః ప్రహసన్నివ భారత ।**
**సేనయోరుభయోర్మధ్యే విషీదంతమిదం వచః ॥ 10**

**తాత్పర్యము:** ఓ రాజా! రెండుసేనల నడుమ శోకహృదయంతో పరితపిస్తున్న అర్జునుని జూచి శ్రీకృష్ణభగవానుడు చులకన చేయుచున్నవానివలె చిరునగవుతో ఈ విధముగా పలికెను.

**శ్రీభగవాన్ ఉవాచ**

**అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।**
**గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః ॥ 11**

**తాత్పర్యము:** శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు. ఓ అర్జునా! వారందరు శోకింపదగనివారు. అట్టివారి గురించి నీవు ప్రముఖపండితునివలె పలుకుతూ విచారించుచున్నావు. పండితులు జీవించియున్నవారిని గురించి కాని, విగత జీవుల గురించి కాని శోకింపరు.

**న, త్వేవాహం జాతు నాసం నత్వం నేమే జనాధిపాః ।**
**న చైవ న భవిష్యామః సర్వే వయమతః పరమ్ ॥ 12**

**తాత్పర్యము:** నేను, నువ్వు, ఈ రాజులు కాని ఇదివరలో లేని వారముకాము ఇప్పుడు లేనివారుకాము. మరియు భవిష్యత్తులో కూడా ఉండెదము అంటే ఆత్మయేశాశ్వతము అని అర్థము.

**దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।**
**తథాదేహాంతర ప్రాప్తిః ధీరస్తత్ర న ముహ్యతి ॥ 13**

**తాత్పర్యము:** ప్రతి జీవునకు కౌమారము, యౌవనము, వార్ధక్యము ఉండును. అదే విధంగా మరణానంతరము మరియొక శరీరము పొందును. ఎటువంటి మార్పు ఉండదు. అందువలన ఈ విషయమును జీర్ణించుకొన్న ధీరుడు, మోహమునకు వశుడుకాడు.

**మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః ।**
**ఆగమాపాయినోఽనిత్యాః తాంస్తితిక్షస్వ భారత ॥ 14**

**తాత్పర్యము:** ఓ అర్జునా! ఇంద్రియములన్నియు వాటివాటితో సంయోగముచెందుట వలన శీతోష్ణ దుఃఖములు ఏర్పడుచున్నవికదా! అవి ఉత్పత్తి, వినాశనములు. నిత్యముకానివి. అందువల్ల నీవు సహించి పట్టించుకోకు.

**యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ ।**
**సమ దుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥ 15**

**తాత్పర్యము:** ఓ అర్జునా! పురుషశ్రేష్ఠుడు శీతోష్ణ, సుఖ దుఃఖములను సమానముగా జూచును. అవి విషయేంద్రియ సంయోగములు. అట్టివి ఏ మనుజుని బాధించవో, వ్యాకుల పరచవో అట్టివాడు మోక్షార్హుడగును.

**నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।**
**ఉభయో రపి దృష్టోఽన్తః త్వ నయోస్తత్త్వ దర్శిభిః ॥ 16**

**తాత్పర్యము:** లేని దానికి (అసత్తుకు) ఉనికిలేదు. ఉన్న సద్వస్తువుకు వినాశములేదు. వాటినే అసత్తుసత్తు అని అందురు. ఈ రెండు విధానాలును తత్త్వజ్ఞానులచేత చూడబడెను.

**అవినాశి తు తద్విద్ధి యేనసర్వమిదం తతమ్ ।**
**వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్ కర్తుమర్హతి ॥ 17**



**తాత్పర్యము:** ఈ తత్త్వము నాశనములేనిది. ఈ తత్త్వము అంతయు వ్యాపించియుండెను. ఇది శాశ్వతము. దీని నెవ్వరూ నాశనము చేయలేరు.

**అంత వంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః ।**
**అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వభారత ॥ 18**

**తాత్పర్యము:** ఓ పార్థా! ఈ శరీరములన్నియు నాశనమవవలసిందే. జీవాత్మ ఒక్కటే నాశనములేనిది, నిత్యమైనది అందువలన సమరము చేయుము.

**య ఏవం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్ ।**
**ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే ॥ 19**

**తాత్పర్యము:** ఆత్మ ఎప్పుడూ నశింపదు. ఎవ్వరూ దానిని నశింప చేయలేరు. ఈ సత్యమును ఎవరైతే తెలిసికొనలేరో. వారు జ్ఞానహీనులు. అనగా ఆత్మ తత్త్వమును తెలిసినవారుకారు.

**న జాయతే మ్రియతే వాకదాచిన్**
**నాయం భూత్వా భవితావాన భూయః ।**
**అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే ॥ 20**

**తాత్పర్యము:** ఈ ఆత్మ ఒకానొక కాలమందు జన్మించినదికాదు. ఒకానొకకాలమందు చనిపోవునదికాదు. ఆత్మ శాశ్వతమైనది. అది ఒకప్పుడు ఉండి మరొక్కప్పుడు లేకుండ ఉండదు. ఉత్పత్తి, అస్తిత్వము, వృద్ధి, విపరిణామము, అపక్షయము, వినాశము అనునవి ఆరువికారములు. అవి ఆత్మకులేవు. శరీరానికే ఈ ఆరువిధలైన మార్పులు కల్గుతాయి. ఆత్మ జన్మలేనిది. సనాతనమైనది. శాశ్వతమైనది. శరీరము మాత్రమే చనిపోయినా, ఆత్మకు చావులేదు. ఆత్మ నిత్యము.

**వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్ ।**
**కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్ ॥ 21**

**తాత్పర్యము:** అర్జునా! నేను నీకు విశదీకరించినట్లు, ఆత్మనిత్యము, నాశనము లేనిదనియు, అక్షయమనియు ఎవరు గ్రహింతురో, అటువంటి పురుషుడు ఎవరినైనా ఎట్లు చంపును, మరియు ఎట్లు చంపించును.

**వాసాంసి జీర్ణాని యథా విహాయ**
**నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।**
**తథా శరీరాణి విహాయ జీర్ణాన్**
**అన్యాని సంయాతి నవాని దేహీ ॥ 22**

**తాత్పర్యము:** మానవుడు తన వస్త్రము నిరుపయోగమైనపుడు నూతన వస్త్రమును ధరించునుకదా! అటులనే జీవాత్మ అట్టి శిధిలమైన తన పాత శరీరమును విడచి నూతన శరీరమును ధరించుచున్నాడు.

**నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ।**
**నచైవం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః ॥ 23**

**తాత్పర్యము:** ఆత్మను శస్త్రాస్త్రములు ఛేదింపలేవు. అట్లే అగ్ని కాల్చలేనిది. ఆ విధముగానే నీరు తడుపలేదు. అటులనే వాయువు ఎండింపలేదు.

**అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయం అక్లేద్యోఽశోష్య ఏవ చ ।**
**నిత్యః సర్వగతః స్థాణుః అచలోఽయం సనాతనః ॥ 24**

**తాత్పర్యము:** అటులనే ఈ ఆత్మ ఛేదించుటకును, అగ్ని జ్వాలచేత దహింబడుటకును, తడుపబడుటకును, ఎండింపబడుటకును అసాధ్యమైనది. ఇది స్థిరమైనది. నిత్యమైనది. సనాతనమైనది.

**అవ్యక్తోఽయమచింత్యోఽయం అవికార్యోఽయ ముచ్యతే ।**
**తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి ॥ 25**

**తాత్పర్యము:** అర్జునా! ఇంకనూ విశదపరచుచున్నాను. ఆత్మకంటికి కనబడనిది. వ్యక్తము కానిది. వికారము లేనిది. ఈ విషయములను నీవు గ్రహించి నీవు విచారవదనముతో శోకించడం తగదు.



**అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।**
**తథాపి త్వం మహాబాహో నైనం శోచితుమర్హసి ॥ 26**

**తాత్పర్యము:** ఓ అర్జునా! ఒకవేళ ఆత్మ పుట్టునదిగను, మరణించునదిగను నీవు అభిప్రాయపడిననూ నీవు విచారించ వలసిన విషయముకాదు.

**జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మమృతస్య చ ।**
**తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి ॥ 27**

**తాత్పర్యము:** మరణం జననంతో పుట్టును. జన్మించినవారికి మరణం అనివార్యము. మరణించినప్రతీప్రాణికి పునర్జన్మ అనివార్యము అందువలన నీవు ఇటువంటి అనివార్య విషయములందు శోకించవలదు.

**అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।**
**అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా ॥ 28**

**తాత్పర్యము:** ప్రాణులన్నియు పుట్టకమునుపు మనకు కనబడవు. మరణము తర్వాత కూడా అవి అవిమనకు కనబడవు. జీవనమరణాల మధ్యనే మనకు గోచరములు. అట్టి పరిస్థితులలో నీవువాటికై విలపించుటవలన ప్రయోజనము లేదు. అది శోకింపదగిన విషయముకాదు.

**ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమ్**
**ఆశ్చర్యవద్వదతి తథైవ చాన్యః ।**
**ఆశ్చర్య వచ్చైన మన్యః శృణోతి**
**శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥ 29**

**తాత్పర్యము:** ఒకడీ ఆత్మను ఆశ్చర్యముగ చూచును. మరొకడు దానిని విస్మయముతో వర్ణించును. ఇంకొకడీ ఆత్మను విస్మయముతో వినును. మరియొకడెవడో దానిని చూచియు, వినియు కూడ తెలిసికొనజాలడు.

**దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।**
**తస్మాత్ సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి ॥ 30**

**తాత్పర్యము:** అందువలన ఓ పార్థా! ప్రతియొక్క ప్రాణియందు ఉండు ఈ ఆత్మ చంపబడదు. కాబట్టి, ఏ ప్రాణికొరకు నీవు శోకింప అనర్హుడవు. కనుక విచారించవలదు.

**స్వధర్మమపి చావేక్ష్య న వికంపితు మర్హసి ।**
**ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే ॥ 31**

**తాత్పర్యము:** నీ స్వధర్మమేమిటో నీవు ఆలోచించియైనను నీవు చలించుట తగదు. నీవు క్షత్రియుడవు. క్షత్రియునకు ధర్మనిష్ఠమైన యుద్ధము చేయుట కర్తవ్యమేకదా.

**యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్ ।**
**సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధ మీదృశమ్ ॥ 32**

**తాత్పర్యము:** ఊహింపలేనిదైన ఈ సమరము నీ ధర్మము కనుక స్వర్గద్వారములు తెరువబడియుండును. ఇట్టి లాభము కలుగజేయుసమరము నీ బోటి అదృష్టవంతులకే లభించును.

**అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।**
**తతః స్వ ధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి ॥ 33**

**తాత్పర్యము:** అయినను ఒక వేళ ఇట్టి అవశ్యకర్తవ్యమైన యుద్ధావకాశమును విడిచి నట్లయిన స్వధర్మమును వీడి అపకీర్తి పాలగుదువు.

**అకీర్తిం చాపిభూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్ ।**
**సంభావితస్య చాకీర్తిః మరణాదతిరిచ్యతే ॥ 34**

**తాత్పర్యము:** అదియునుగాక, సమస్త ప్రజావాహిని, నీ యొక్క శాశ్వతమగు అపకీర్తిని గురించి చర్చించుకొందురు. గౌరవించినవారిచేత సన్మానించినవారిచేత నీవు చులకన చేయబడినచో అది మరణముకంటే ఎక్కువ కదా!



**భయాద్రణా దుపరతం మంస్యంతే త్వాం మహారథాః ।**
**యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥ 35**

**తాత్పర్యము:** నిన్ను ఇంతవరకు భావించిన మహారథికులు, యుద్ధవీరులు, నీవు ఈ సమరమునకు పిరికితనము, భయాదులతో విరమించినట్లు తలంతురు.

**అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః ।**
**నిందంతస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥ 36**

**తాత్పర్యము:** ఓ అర్జునా! నీవు ఇంకొక సత్యమును గ్రహించవలెను. నీ శత్రువులు నీవు యుద్ధము చేయుటకు అసమర్థుడవని నిన్ను అపనిందలకు పాలుచేయుదురు. దీనికి మించిన అవమానము దుఃఖము మరేదియు లేదు.

**హతోవా ప్రాప్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।**
**తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥ 37**

**తాత్పర్యము:** ఒకవేళ నీవు సమరములో మరణించిననూ నీవు వీరస్వర్గప్రాప్తి నిశ్చయము. జయించినచో పృథివిని భోగింతువు. అందుచేత, నీవు దృఢ నిశ్చయముతో యుద్ధమునకు సంసిద్ధుడవుకమ్ము.

**సుఖ దుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయా జయౌ ।**
**తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి ॥ 38**

**తాత్పర్యము:** మానవుడు సుఖదుఃఖములయందు సమాన దృష్టితో ఉండవలెను. కష్టనష్టములయందు కూడ అట్లే ఉండవలెను. అపుడు నీకు పాపభీతి ఉండదు, పాపములంటవు. కనుక, సమరమునకు ఉద్యుక్తుడవుకమ్ము.

**ఏషాతేఽభి హితాసాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాంశృణు ।**
**బుద్ధ్యాయుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి ॥ 39**

**తాత్పర్యము:** అర్జునా! ఇంతవరకు నీకు ఆత్మతత్త్వమును, బుద్ధిని జ్ఞానదృష్టితో వివరించి చెప్పితిని. ఇపుడు బుద్ధిని యోగ, శాస్త్ర, కర్మల దృష్టితో ఎట్లు కర్మబంధమునుండి విముక్తుడవుదువో వివరించెదను. శ్రద్ధగా వినుము.

**నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।**
**స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥ 40**

**తాత్పర్యము:** కర్మ యోగప్రక్రియకు విపరీత పరిణామములుండవు. బీజనాశనములేదు. ఈ కర్మ యోగమును స్వల్పముగా అనుష్టించినను జన్మమృత్యురూపములనుండే కాక సంసార బంధమునుండి కూడా విముక్తుడగుదువు.

**వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన ।**
**బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥ 41**

**తాత్పర్యము:** ఓ అర్జునా! నేను చెప్పిన ఈ కర్మయోగమునందు నిశ్చయమైనట్టి, నిర్మలమైనట్టిదైన బుద్ధి ఉండును. కావున, చంచలమైన బుద్ధిలేక, అంతులేని కోరికలు కలవారు వివేకహీనులై ఉందురు.

**యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్య విపశ్చితః ।**
**వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతి వాదినః ॥ 42**

**కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।**
**అయావిశేషబహులాం భోగైశ్వర్యగతింప్రతి ॥ 43**

**భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్ ।**
**వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ॥ 44**

**తాత్పర్యము:** అర్జునా! అవివేకులు భౌతిక సుఖభోగాదులందు ఏకాగ్రతకలవారై ఉందురు. వేదములలోని బాహ్యార్థములనే ఆశ్రయించుదురు. కానివారు, అంతర్లీనమైన అర్థములయందు ప్రీతివహించరు. వేదములయందు నిర్ణయింపబడిన కర్మలను ఉపేక్ష చేయుదురు. అట్టివి



నీవు విసర్జింపవలెను. భోగైశ్వర్యాదులచేత ఆవహించబడిన హృదయముతో వారు అచంచలమైన, నిశ్చలమైన బుద్ధిని కలిగి ఉండరు. (వేదాలు అంటే కేవలము అక్షరములుకావు. విరాట్పురుషుని శరీరమునుంచి ఆవిర్భవించిన బీజాక్షరాల సమూహము.)

**త్రై గుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।**
**నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ 45**

**తాత్పర్యము:** అర్జునా! వేదములు త్రిగుణములను ప్రతిపాదించును, అయినా నీవు హర్షము, శోకము మొదలగు ద్వంద్వములులేని వాడవై ఉండవలెను. యోగక్షేమములను మాత్రమే కోరకుండా ఆవిరాట్పురుషుడైన పరమాత్మయందే మనస్సును నిలిపి ఆత్మను స్వాధీనపరచుకుని జ్ఞానివికమ్ము, ఆత్మజ్ఞుడవుకమ్ము.

**యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే ।**
**తావాన్ సర్వేషు వేదేషు బ్రహ్మణస్య విజానతః ॥ 46**

**తాత్పర్యము:** జలాశయముల పూర్తిగా నిండియుండగా చిన్న చిన్న గుంటలతో ఏమి ప్రయోజనము? అటులనే బ్రహ్మ జ్ఞానమును జీర్ణించుకుని బ్రహ్మ తత్త్వమును తెలిసికొనిన బ్రాహ్మణునకు వేదములతో ప్రయోజనమేమి? ఆశింపనవసరములేదు.

**కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన ।**
**మా కర్మఫలహేతుర్భూః మాతే సంగోఽస్త్వకర్మణి ॥ 47**

**తాత్పర్యము:** అర్జునా! నీకు కర్మను చేయుటయందే అధికారము కలదు. కాని కర్మ ఆచరించు ఫలమునందు నీ కధికారములేదు. కర్మఫలాపేక్ష యుండరాదు. మరియు కర్మలను మానివేయుటయందు ఆసక్తి యుండరాదు.

**యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ ।**
**సిద్ధ్యసిద్ధ్యోః నమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥ 48**

**తాత్పర్యము:** నీవు యోగమునందు సమత్వస్థితుడవై ఉండి కర్మలను ఆచరించవలెను. నీ కర్తవ్యమేమిటో, అట్టి కర్మలనే చేయుచూ సమబుద్ధి కలిగి యుండుము. అదియే యోగమని తెలిసికొనుము. సిద్ధి, అసిద్ధి యందు సమభావమును వహించుము.

**దూరేణ హ్యవరం, కర్మ బుద్ధియోగాద్ధనంజయ ।**
**బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥ 49**

**తాత్పర్యము:** బుద్ధికంటెను ఆశలచేజేయు కర్మ ఉత్కృష్టమైనదికాదు. అందువలన, ఓ అర్జునా! సమత్వబుద్ధితో తరణోపాయము కొరకు ప్రయత్నించుము. ఎందువలనంటే ఫలముకొరకు చేయు కర్మ శ్రేష్ఠమైనది కాదు. అటువంటివారు అత్యంత దీనులు, నికృష్టులు, హీనులు.

**బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే ।**
**తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥ 50**

**తాత్పర్యము:** సమబుద్ధి కలిగిన పురుషుడు పుణ్యము పాపము అను బేధము లేకుండా ఈ లోకమునందే విసర్జించును. అట్టికారణముచేత కర్మలయందు కుశలత్వయోగము ఉత్తమమైనది. దాని కొరకు నీవు ప్రయత్నించుము. అందువలన నీవు కర్మలకు బందీకాకుండా సమబుద్ధితో ఉండిన నీవు ముక్తుడగుట తథ్యము. యోగమనగా కర్మయందు కౌశలము అని చెప్పబడినది.

**కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః ।**
**జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్ ॥ 51**

**తాత్పర్యము:** ఎందువలననగా సమమైన బుద్ధి నైపుణ్యముతో జ్ఞానులు కర్మలను చేయుచున్నారు. వాటివలన ఏర్పడు ఫలములను త్యజించెదరు. వారు జన్మ జన్మ పరంపరంపరల నుండి విముక్తులయి పరమపదమును పొందుదురు.



**యదా తే మోహ కలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।**
**తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥ 52**

**తాత్పర్యము:** అర్జునా! నీ బుద్ధి మోహమనెడి కాలుష్యమునుండి ఎప్పుడు బయటపడునో, అప్పుడు నీవు వినినటువంటి, వినబోవునటువంటి భౌతికలోక సర్వభోగములు మొదలగు వాటినుండి వైరాగ్యము పొంది బంధ విముక్తుడగుట నిశ్చయము.

**శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।**
**సమాధా వచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి ॥ 53**

**తాత్పర్యము:** నానావిధ వచనములను, వార్తలను విని విని నీ బుద్ధి అయోమయముతో నిండి మలినమగును. అట్లుకాక స్థిరముగా నుండవలెను. అట్టి పరిస్థితులలో నీవు యోగార్హుడవై పరమాత్మతో శాశ్వతముగా సంయోగము పొందగలవు.

**అర్జున ఉవాచ**

**స్థిత ప్రజ్ఞస్య కా భాషా సమాధి స్థస్య కేశవ ।**
**స్థిత ధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్ ॥ 54**

**తాత్పర్యము:** అర్జునుడు అనుచున్నాడు. కేశవా! సమాధియందు పూర్తిగా స్థితుడైనవాడు పరమాత్మ ఆశీస్సులతో స్థితప్రజ్ఞునియొక్క లక్షణములను తెలియగోరుచున్నాను. అతడెట్లు మాట్లాడును? స్థిమితవడును? ఎట్లు సంచరించును? నీవు నాకు వివరించుము.

**శ్రీభగవాన్ ఉవాచ**

**ప్రజహాతి యదాకామాన్ సర్వాన్ పార్థమనోగతాన్ ।**
**ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థిత ప్రజ్ఞస్తదోచ్యతే ॥ 55**

**తాత్పర్యము:** శ్రీకృష్ణ పరమాత్మ చెప్పుచున్నాడు. ఓ పార్థా! మనుజుడు తన మనస్సును బంధించిన కోరికలన్నింటిని తొలగించుకొనుచూ, ఆత్మచేత,

ఆత్మయందేలీనమై పరమాత్మ సంయోగమును పొందును. అట్లు సంతుష్టి పొందును. అట్టివాడు స్థితప్రజ్ఞుడని గుర్తింపబడును.

**దుఃఖేష్వనుద్విగ్న మనాః, సుఖేషు విగతస్పృహః ।**
**వీతరాగభయక్రోధః, స్థితధీర్మునిరుచ్యతే ॥ 56**

**తాత్పర్యము:** అర్జునా! దుఃఖములు ప్రాప్తించినపుడు ఉద్వేగమును పొంది వ్యథచెందనివాడును, సుఖములు వచ్చినపుడు ఆనందంపట్టలేక పొంగిపోవువాడును, ఆశలను వీడినవాడును, అనురాగ, భయక్రోధములను సమానముగ భావించువాడును అగు మానవుడు ఉత్తమమైన శీలముగలవాడును, అచంచలమైన బుద్ధి కలవాడని స్థితప్రజ్ఞుడని ప్రశంసింపబడును.

**యః సర్వత్రా నభిస్నేహః తత్తత్ ప్రాప్య శుభాశుభమ్ ।**
**నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 57**

**తాత్పర్యము:** ఏ విషయమునందును అభిమానము, మమత, ఆసక్తి లేనివాడును, తనకు హర్షము, లాభమును కలిగించువాటి యందు సంతోషము పొందనివాడును, ప్రతికూల విషయములందు కృంగిపోవనివాడును, ద్వేషాదులను వీడినవాడును అగుమానవుని స్థితప్రజ్ఞుడు, బుద్ధిమంతుడు అని అందురు.

**యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ, సర్వశః ।**
**ఇంద్రియాణీంద్రి యార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 58**

**తాత్పర్యము:** కూర్మము తన అంగములన్నింటిని ముడుచుకొనును. అట్లే మానవుడు తన ఇంద్రియములను ఉపసంహరించుకొనవలెను. అప్పుడు అతడు అంతర్ముఖుడై బుద్ధిని స్థిరపరచుకొనినట్లయిన స్థితప్రజ్ఞుడని అనబడును.

**విషయా, వినివర్తంతే నిరాహారస్య దేహినః ।**
**రసవర్జం, రసోఽప్యస్యపర దృష్ట్వానివర్తతే ॥ 59**



**తాత్పర్యము:** ఇంద్రియాది విషయములు దూరము మాత్రమే అగును. విషయవాంఛలు పూర్తిగాపోవు. అందువలన, అట్టి మానవుడు పరమాత్మను గుర్తించవలెను. అపుడన్ని ఆకర్షణలయందు, అనురాగములందు చిత్తము నివృత్తమగును.

**యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।**
**ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥ 60**

**తాత్పర్యము:** ఓ అర్జునా! మానవుడు వివేకముతో ప్రయత్నించినప్పటికి బలమగు ఇంద్రియములు వివేకియగు మానవునైనప్పటికి, మనస్సును బలవంతముగా హరింపచేయును, ఆకర్షించి వికృతముచేయును.

**తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।**
**వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా ॥ 61**

**తాత్పర్యము:** అర్జునా! తన ఇంద్రియములన్నింటిని తన ఆధీనములో నుంచుకొని, నిగ్రహముతో పరమాత్మయందే దృష్టిని ఉంచి దృఢచిత్తుడై నుండవలెను. ఆ విధముగా నిగ్రహముతో ఇంద్రియములన్నింటిని స్వాధీనములో నుంచుకొన్న మానవుడే స్థిరమైన బుద్ధి కలవాడని ఎరుంగుము.

**ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తే షూపజాయతే ।**
**సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥ 62**

**తాత్పర్యము:** మానవుడు తన ఇంద్రియములందే దృష్టిని కేంద్రీకరించుకొని ఉన్నప్పుడు వాటియందు సంగత్వము కలిగి ఆశలుపెరుగును. ఆశలు కోరికలతో మునిగియున్న మానవునకు క్రోధము తప్పక ఏర్పడును.

**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।**
**స్మృతి భ్రంశాద్బుద్ధి నాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥ 63**

**తాత్పర్యము:** క్రోధమువలన మోహము కలిగి, దానివలన జ్ఞాపకశక్తి నశించి, దానివలన భ్రమ తప్పక ఏర్పడి, తనకు తానే పతనమయ్యే పరిస్థితి ఏర్పడును.

**రాగద్వేషనియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।**
**ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥ 64**

**తాత్పర్యము:** అంతర్గతముగా తన ఇంద్రియములన్నింటిని అదుపులో నుంచుకొని, రాగద్వేషరహితుడై ఉండవలెను. అట్లు స్వాధీనములో నుంచుకొన్న మానవుడు ప్రశాంతతను, మనశ్శాంతిని పొంది యోగయుక్తుడగును.

**ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే ।**
**ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥ 65**

**తాత్పర్యము:** మనస్సును నిర్మలముగా నుంచుకొన్న మానవునకు ప్రశాంతత కలుగును. ఎందువలననగా మనస్సును శుద్ధముగా నుంచుకొన్నట్లయిన, అట్టి మానవుని బుద్ధి బ్రహ్మస్వరూపమున నిశ్చలమగును.

**నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా ।**
**న చాభావయతః శాంతిః అశాంతస్య కుతః సుఖమ్ ॥ 66**

**తాత్పర్యము:** ఇంద్రియములను జయించనివానికి వివేకముకలుగదు. మనస్సును ఏకాగ్రతలో నుంచుకొనని వానికి పరమార్థ విషయాదులందు ఏకాగ్రత కలగదు. పరమాత్మభావనలో నిష్ఠలేనివానికి శాంతి, సుఖము లభింపదు.

**ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే ।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి ॥ 67**

**తాత్పర్యము:** ప్రతికూల వాయువునందు ప్రయాణము చేయుచున్న నౌక వక్రమార్గమున బట్టి నెట్టి వేయబడును. అటులనే ఇంద్రియములు అనుకూల



మార్గమునుకాక ప్రతికూల మార్గమునకు త్రిప్పును. అప్పుడు మానవునకు వివేకము నశించి విషయవాంఛ కలిగించును.

**తస్మాద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః ।**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా ॥ 68**

**తాత్పర్యము:** ఓ అర్జునా! కనుక ఎవని ఇంద్రియములు విషయములనుండి పూర్తిగా నిగ్రహించబడినవో అతని బుద్ధి నిశ్చలముగా నుండును. ఇది తథ్యము అని నీవు గ్రహించవలెను.

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥ 69**

**తాత్పర్యము:** సర్వప్రాణులకు ఏది అంధకారమయమో, పరమాత్మ విషయమునందు ఇంద్రియములను జయించువాడు ఎల్లపుడును మేల్కొని యుండి దర్శనము ఒనర్చుచుండును. ఏ ప్రాణులు అజ్ఞానాంధకారమున కూడ మేల్కొని యుండి అనిత్యమగు సంసారసుఖములో మునిగియుందురో వారు తత్త్వదర్శనము చేయలేక శాంతిని పొందలేరు.

**ఆపూర్యమాణమచలప్రతిష్ఠం**
**సముద్రమాపః ప్రవిశంతి యద్వత్ ।**
**తద్వత్ కామా యం ప్రవిశంతి సర్వే**
**స శాంతి మాప్నోతి న కామకామీ ॥ 70**

**తాత్పర్యము:** అన్ని నదులు, అన్ని దిక్కుల నుండి సముద్రమున ప్రవేశించుచున్నను, సాగరము ఏ విధముగానూ కలత చెందదు. అటులనే స్థిత ప్రజ్ఞునియందు, సర్వవిషయములు, వాంఛలు తనలో లీనమగుచున్నను కలతజెందక, శాంతిని పొందును విషయాసక్తిగలవాడు శాంతిని పొందదు.

**విహాయ కామాన్ యః సర్వాన్ పుమాంశ్చరతి నిఃస్పృహః ।**
**నిర్మమో నిరహంకారః స శాంతిమధి గచ్ఛతి ॥ 71**

**తాత్పర్యము:** మానవుడు సర్వవిధములైన కోర్కెలను త్యజించి, మమత్వమును, విడిచి, అహంకారమును పారద్రోలి, కాంక్షారహితుడై నడుచుకొనునో అతడు సర్వదుఃఖములకు దూరుడై మోక్షమును పొందును. దీనిని నీవు గ్రహించవలెను.

**ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి ।**
**స్థిత్వా స్యామంతకాలేఽ పి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి ॥ 72**

**తాత్పర్యము:** ఓ అర్జునా! ఏ మానవుడు బ్రహ్మస్వరూపమును పొందునో అతడు ఏ స్థితిలోనున్నా, మోక్షమును పొందితీరును.

***ఇట్లు ఉపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును "శ్రీకృష్ణార్జున" సంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందలి "సాంఖ్యయోగ" మనెడి రెండవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

## మూడవ అధ్యాయము

## కర్మయోగము

ఈ అధ్యాయములో శ్రీకృష్ణపరమాత్మ కర్మయోగముయొక్క విశిష్టతను గురించి వివరించెను. ఆసక్తిలేకుండా, ఆశలకు బానిసకాకుండా మానవుడు కర్మలను ఆచరించడము శ్రేయస్కరమని బోధించెను. లోక సంరక్షణకు కర్మలను ఆచరించవలెనని అరిషడ్వర్గమైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను వీడవలెనని, ఆత్మతత్త్వ విచారణకు సవ్యమైన మార్గములు జ్ఞాన, కర్మయోగములని, పరమాత్మ అర్జునునకు బోధించెను అది విని అర్జునుడు ఈ రెండింటిలో ఉత్తమమైన మార్గమేదియో వివరించమని పరమాత్మను ప్రార్థించెను. రాగద్వేష రహితముగా కర్మలను ఆచరించవలెనని, కర్మసన్యాసము వీడవలెనని, అందువల్ల, కర్మయోగమే శ్రేష్ఠమని భగవానుడు విశదపరచెను. అంతేకాక, కామరూపాది శత్రువులను జయించవలెనని, కర్మలను ఆచరించుటకు వెనుకాడిన అర్జునునకు బోధించెను.

జ్ఞానుల, అజ్ఞానుల లక్షణములను కృష్ణభగవానుడు విపులముగా తెలియపరచెను.

**అర్జున ఉవాచ**

**జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన ।**
**తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ॥ 1**

**తాత్పర్యము:** అర్జునుడు భగవానుని అడుగుచున్నాడు. కర్మముకంటె జ్ఞానమే ఉత్తమమని నీ అభిప్రాయమైనచో ఈ హింసాత్మకమైన కర్మమైన సమరమును చేయుమని నీవెందులకు నన్ను ఆజ్ఞాపించుచున్నావు?

**వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।**
**తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽ హమాప్నుయామ్ ॥ 2**

**తాత్పర్యము:** నీ మాటలు (సందేహ కారణమువలె) నన్ను కలవరపరచుచున్నవి. అందువలన నా మనస్సు సందిగ్ధావస్థలోపడుచున్నది. నాకు ఉత్కృష్టమైన మార్గమేమిటో వివరించమని భగవానుని కోరెను.

**శ్రీభగవాన్ ఉవాచ**

**లోకేఽ స్మిన్ ద్వివిధా నిష్ఠా పురాప్రోక్తా మయానఘ ।**
**జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥ 3**

**తాత్పర్యము:** కృష్ణభగవానుడు అర్జునునితో చెప్పుచున్నాడు. ఓ పాపరహితుడా! ఈ లోకమునందు పూర్వము వేదరూపముగల నా చేత రెండు విధములగు నిష్ఠలు చెప్పబడెను. అవి సాంఖ్యులకు (అనగా జ్ఞానులకు) కర్మయోగము, నిష్కామకర్మయోగులకు కర్మములద్వారా నిష్ఠకలుగును.

**న కర్మణామనా రంభాత్ నైష్కర్మ్యం పురుషోఽ శ్నుతే ।**
**న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ 4**

**తాత్పర్యము:** కర్మలనొనర్చని మనుజుడు ఆత్మస్వరూపమును పొందడు. అంతేకాక, కర్మలను త్యజించినంత మాత్రముచేత సమమైన బుద్ధిని పొందజాలడు. అనగా నైష్కర్మ్యమును పొందలేడు.

**న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।**
**కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥ 5**

**తాత్పర్యము:** కర్మలను చేయడమనేది మనుజుని ప్రకృతి. కర్మలను చేయకుండా ఏ మానవుడు ఉండలేడు. అది అతని నైజము. ప్రకృతి స్వాధీనుడైన ప్రతిమనుజుడు కర్మలను ఆచరించుచునే ఉండును. ప్రకృతిని నిర్ణయించిన త్రిగుణయుక్త కర్మలకు అతనే బాధ్యుడు.



**కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసాస్మరన్ ।**
**ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే ॥ 6**

**తాత్పర్యము:** ఇంద్రియములు వాటికి విధింపబడిన వ్యాపారములను నిర్వర్తించును. అయినపుడు వాటిని ఎవడు స్మరించుచుండునో వాడిని జనులు మూఢునిగా, “కపటాచరణము కలవాడు” అని అందురు.

**య స్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽ ర్జున ।**
**కర్మేంద్రియైః కర్మయోగ మసక్తః స విశిష్యతే ॥ 7**

**తాత్పర్యము:** జ్ఞానేంద్రియములను దృఢమైన మనస్సుతో అదుపులో నుంచుకొని, వశపరచుకుని, ఆసక్తులను విసర్జించి మెలగు మానవుడు కర్మలను ఆచరించుచున్నట్లయిన అతనిని శ్రేష్ఠుడు అని అందురు.

**నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।**
**శరీరయాత్రాపి చ తేన ప్రసిద్ధ్యే దకర్మణః ॥ 8**

**తాత్పర్యము:** అర్జునా! నీవు శాస్త్ర సమ్మతమైన కర్మలను మాత్రమే చేయుము. ఎందువలన అనగా, కర్మలను చేయకుండుటకంటె కర్మలను చేయుచుండుటే శ్రేయస్కరము. కర్మహీనుడవైనట్లయిన దినచర్యలు చేయని జీవనము అసంభవము.

**యజ్ఞార్థాత్కర్మణోఽ న్యత్రలోకోఽ యం కర్మబంధనః ।**
**తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర ॥ 9**

**సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।**
**అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽ స్త్విష్టకామధుక్ ॥ 10**

**తాత్పర్యము:** ఓ అర్జునా! పరంధాముని కొరకు ఆచరింపబడు కర్మలకంటె భిన్నముగా చేయుకర్మల మూలముగా మనుజు డకర్మముచే బంధింపబడు చుండును. ఆసక్తి లేనివాడవై కర్మలను సవ్యముగా నిర్వర్తించుము.

బ్రహ్మదేవుడు సృష్టికిముందు యజ్ఞముల సహితముగా, వాటి ద్వారా ప్రజలను సృష్టించెను. ఈ యజ్ఞములద్వారానే దేవతలు కూడా సంతృప్తి నొందుదురు. ఈ యజ్ఞములద్వారా ఇష్టమైన కోరికలను అభీష్టసిద్ధులను నెరవేర్చు కొందురుగాక అని ప్రకటించెను.

**దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః ।**
**పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ ॥ 11**

**ఇష్టాన్ భోగాన్ హి వోదేవా దాస్యంతే యజ్ఞ భావితాః ।**
**తైర్దత్తా న ప్రదాయై భ్యో యో భుంక్తే స్తేన ఏవ సః ॥ 12**

**తాత్పర్యము:** ప్రజలను యజ్ఞములద్వారా బ్రహ్మదేవుడు సృష్టించి, మీరు దేవతలను సంతృప్తి పరచండి అని ఆజ్ఞాపించాడు. దేవతలు మిమ్ములను అనుగ్రహించి కాపాడెదరు అని బోధించెను. మీరూ దేవతలు ఒకరినొకరు ప్రేమించుకొనుచూ ఉండిన అత్యున్నతమైన శ్రేయస్సును అనుభవించగలరు.

యజ్ఞములద్వారా దేవతలు సంతృప్తి పొంది మీరు కోరిన ఇష్టమైన వాంఛలను, భోగములను ప్రసాదించెదరు. వీటిని దేవతలకు తప్పక నివేదించవలెను.

**యజ్ఞశిష్టాశినః సంతోముచ్యంతే సర్వకిల్బిషైః ।**
**భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మ కారణాత్ ॥ 13**

**తాత్పర్యము:** యజ్ఞము మూలముగా ఉత్పన్నమైన, విశిష్టమైన ఆహారమును ఆరగించి సత్పురుషులు పాపవిముక్తులయ్యెదరు. ఆ విధముగా కాకుండా ఎవరు తమస్వార్థము, సంతుష్టికొరకు మాత్రమే భుజించి అనుభవింతురో అట్టివారు పాపులు దోషులు అగుదురు.

**అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్న సంభవః ।**
**యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥ 14**



**కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।**
**తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ 15**

**తాత్పర్యము:** అన్నము మూలముగానే సర్వప్రాణులు జన్మించును, జీవించును. అన్నము మేఘములద్వారా, వర్షమునుండి సృజింపబడుచున్నది. యజ్ఞములద్వారా మేఘములు ఉద్భవించుచున్నవి. మానవునకు విధింపబడి ఆచరించుబడుచున్న విశిష్టమైన కర్మఫలము. హోమాదిక్రియలనుండి ఏర్పడుచున్నది. విధింపబడిన కర్మలకు వేదములే ఆధారములు. మూలములు. వేదములు సాక్షాత్ విరాట్పురుషుని నుండే సంభవించుచున్నవి. ఆకారణముచేత ఆ పరమాత్మ సర్వగతమై బ్రహ్మయై ఎల్లప్పుడును యజ్ఞములయందే ప్రతిష్ఠింపబడియుండెను.

**ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।**
**అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥ 16**

**తాత్పర్యము:** అర్జునా! పరంపరగా సనాతనంగా ఏర్పడిన సృష్టి చక్రమునకు అనుకూలముగా ప్రతియొక్క మానవుడు ప్రయత్నించవలెను. అట్లుగాక, వ్యతిరేకంగా, సుఖములకే బానిస అయిన మానవుని జీవితము పాపములకులోనై, వాడు పాపి అని ఏవగించబడును.

**యస్త్వాత్మరతిరేవ స్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః ।**
**ఆత్మన్యేవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే ॥ 17**

**తాత్పర్యము:** ప్రతియొక్క మానవుడు ఆత్మయందే లీనమై ఆత్మయందే నిత్యము తృప్తి , సంతుష్టి పొందుచుండవలెను. అట్టివాడు జ్ఞాని అని ప్రశంసింప బడుచూ, ఏ కార్యము నందు లీనముగాక, ఏ కర్తవ్యమూ లేనివాడై ఉండును.

**నైవ తస్యకృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।**
**న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ॥ 18**

**తాత్పర్యము:** అటువంటి ఆత్మ నిష్ఠుడైన మహానుభావునికి లోకమునందు కర్మలాచరించుట వలన ఫలితములేదు. కర్మలు ఆచరించకపోవుటవలన ఏవిధమైన దోషము ఉండదు. ఇట్టి మనుజునికి సర్వప్రాణులయందు ఏ విధమైన సంబంధము ఉండదు.

**తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర ।**
**అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః ॥ 19**

**తాత్పర్యము:** ఆ కారణముచేత నీవు ఫలితములయందు ఆసక్తిలేక నీకు విధింపబడిన కర్మలను ఎల్లప్పుడూ నిర్వర్తించుచూ, ఫలాపేక్షను వీడి నీ విధులను నిర్వర్తించుచుండిన మోక్షమును పొంది నీవు పరమాత్మచే ప్రశంసింపబడుదువు.

**కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।**
**లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥ 20**

**తాత్పర్యము:** జనకమహారాజు మొదలైనవారు నిష్కామమగు కర్మలచేత మోక్షమును పొందిరి. నీవును ప్రజల ప్రయోజనార్థము కర్మలను ఆచరించవలెను.

**యద్యదా చరతి శ్రేష్ఠస్తత్త దేవేతరో జనః ।**
**సయత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే ॥ 21**

**తాత్పర్యము:** శ్రేష్ఠుడగు పురుషుడు ఏ విధముగా ప్రవర్తించి ఆచరించునో అదియే ప్రమాణముగా ఎంచి ప్రజలు ఆ విధముగానే ఆచరించుచుందురు.

**నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన ।**
**నా నవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ 22**

**తాత్పర్యము:** అర్జునా! నాకు ఈ మూడులోకములయందు చేయదగిన కార్యము కాని కర్తవ్యముకాని ఏదియును లేదు. మరియు పొందవలసినది



కూడా ఏదిలేదు. అయిననూ నేను కర్మములను, కర్తవ్యములనూ చేయుచూ వాటియందే లీనమై ఉన్నాను.

**యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్య తంద్రితః ।**
**మమ వర్త్మాను వర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥ 23**

**తాత్పర్యము:** అర్జునా! నేను జాగరూకుడనై కర్మలను చేయకుందునేని ప్రజలుకూడ నా మార్గమునే అనుసరించి వారికర్మలను నిర్లక్ష్యము చేయుదురు.

**ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ।**
**సంకరస్య చ కర్తాస్యా ముపహన్యా మిమాః ప్రజాః ॥ 24**

**తాత్పర్యము:** నేను కర్మలను చేయనిచో, నా కర్తవ్యమును నిర్వహింపనిచో లోకములన్నియూ నామరూపములు లేక నశించును. అందులకు నేను వర్ణసంకరమునకు బాధ్యుడనగుదును. ప్రజలకు నష్టములు కలిగించిన వాడనగుదును. వారిని చెఱిపిన వాడనగుదును.

**సక్తాః కర్మణ్య విద్వాంసో యథా కుర్వన్తి భారత ।**
**కుర్యాద్విద్వాం స్తథాఽ సక్తశ్చికీర్షుర్లోక సంగ్రహమ్ ॥ 25**

**తాత్పర్యము:** అర్జునా! ఏవిధముగా అజ్ఞానులుకూడా కర్మలయందు ఆశలుకలవారై వాటిని ఆచరింతురో అటులనే విద్యావంతులు, వివేకులు, జ్ఞానులు స్వార్థరహితులై, విశ్వశ్రేయస్సునుకోరి కర్మలను, నిర్వహించవలెను.

**న బుద్ధి భేధం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్ ।**
**జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్ ॥ 26**

**తాత్పర్యము:** పరమాత్మయందు లీనమైనట్టి జ్ఞాని, తనకు విధింపబడిన కర్మలన్నింటిని చేయుచూ, భ్రమను కలిగించకుండా, తాను యోగాసక్తుడై,

అజ్ఞానుల మనస్సులను కలవర పరచకుండా వారిచే కూడా ఆచరించునట్లు చేయవలెను.

**ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।**
**అహంకార విమూఢాత్మా కర్తాఽ హమితి మన్యతే ॥ 27**

**తాత్పర్యము:** కర్మలన్నియూ చేయుటకు ప్రకృతే కారణము. అయినను అహంకారముతో ఆవరించబడిన అజ్ఞాని, ఆత్మజ్ఞానము లేక నేనే కర్తయని అహంకారముతో విర్రవీగును.

**తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః ।**
**గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే ॥ 28**

**తాత్పర్యము:** పార్థా! గుణములయొక్క కర్మలయొక్క తేడాను. వాస్తవికతను, తత్త్వమును జ్ఞాని తెలుసుకొనును. అటువంటి జ్ఞాని, ఇంద్రియములు తమ తమ గుణములయందు విలీనమై ప్రవర్తించుచున్నవని తెలిసికొని, అట్లేనడచుకొనుచూ ఆసక్తిహీనుడై ఉండును.

**ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జంతే గుణకర్మసు ।**
**తానకృత్స్నవిదో మందాన్ కృత్స్న విన్న విచాలయేత్ ॥ 29**

**తాత్పర్యము:** కొందరు పరిపూర్ణముగాని జ్ఞానముతో ఉండి కర్మలయందు ఫలాపేక్ష కలిగి, మోహముతో ఆకర్షితులై ఉన్నవారిని చలింపజేయకూడదు. భ్రమలలో ముంచరాదు. ఆత్మజ్ఞుడగు జ్ఞాని ఆ విధముగా చేయడు.

**మయి సర్వాణి కర్మాణి సన్న్య స్యాధ్యాత్మ చేతసా ।**
**నిరాశీర్నిర్మమో భూత్వా యుద్ధ్యస్వ విగతజ్వరః ॥ 30**

**తాత్పర్యము:** ఓ అర్జునా! నేను అంతర్యామిని. చేయబడు సర్వకర్మలను ధ్యానముతో నిమగ్నమైన మనస్సుతో నాకే సమర్పించవలెను. ఆశలను విచారమును, మమతా మోహములను విసర్జించి నువు సంసిద్ధుడవై వచ్చి ఈ సంగ్రామమును చేయుము.



**యే మే మత మిదం నిత్యమను తిష్ఠంతి మానవాః ।**
**శ్రద్ధావన్తోఽ నసూయంతో ముచ్యన్తే తేఽ పి కర్మభిః ॥ 31**

**తాత్పర్యము:** ఏకాగ్రత, శ్రద్ధ కలవారును, అసూయలేనివారును, నా యీ సూక్తులను, బోధనలను, అభిప్రాయములను జీర్ణము చేసుకొని పాటింతురో, ఆచరణలోకి తెచ్చుదురో, వారు సర్వకర్మలనుండి విడువబడి ముక్తులగుట తథ్యము.

**యే త్వేత దభ్యసూయన్తో నాను తిష్ఠంతి మే మతమ్ ।**
**సర్వజ్ఞాన విమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః ॥ 32**

**తాత్పర్యము:** కొందరు మూర్ఖులు నా యీ ఉపదేశములను, అభిప్రాయములను పాటింపక జ్ఞానహీనులగుదురు. అంతియేగాక, వారు భ్రష్టులగుట తథ్యము అని గ్రహించుము.

**సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞా న వానపి ।**
**ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥ 33**

**తాత్పర్యము:** జ్ఞానముకలవారుకూడా వారి వారి ప్రకృతిప్రకారమే కర్మలు చేయుచుందురు. అలాగే క్రియలనుకూడా ఆచరించుదురు. అందువల్ల నిగ్రహము ఉండిననూ ఏమియు చేయజాలదు.

**ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।**
**తయోర్న వశమాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపన్థినౌ ॥ 34**

**తాత్పర్యము:** రాగద్వేషములనునవి మనుజుని ప్రతి ఇంద్రియమునందు అంతర్లీనముగా పైకి కనబడకుండా లోపల దాగియుండును. మానవుడు రాగద్వేషములకు వశముకాకుండా మెలకువగా ప్రవర్తించవలెను. ఎందువలననగా, ఈ రెండునుకూడా అంతర్గతశత్రువులు. జ్ఞానముతో మెలగవలెను.

**శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।**
**స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ 35**

**తాత్పర్యము:** సవ్యముగా ఆచరించబడినను ఇతరుల ధర్మముకంటె గుణహీనమైనదైనను తన ధర్మమే ఉత్తమమైనది. స్వధర్మము మూలముగా మృత్యువు కబళించిననూ, స్వధర్మమే ఉత్తమమైనది, మేలొన గూర్చునది. పరధర్మము భయదాయకము.

**అర్జున ఉవాచ**

**అథకేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః ।**
**అనిచ్ఛన్నపి వార్ష్ణేయబలాదివ నియోజితః ॥ 36**

**తాత్పర్యము:** అర్జునుడు భగవానుని అడుగుచున్నాడు. ఓ కృష్ణా! మనుజులు పాపములు చేయుచున్నారు. వారు స్వయంగా ఇష్టపడకపోయినా బలవంతముగా ఇతరులచేత చెడుమార్గముల ద్వారా ప్రేరేపింపబడిన వారివలె ఈ పాపములను చేయుచున్నారు. ఇట్లే వారిని ప్రేరేపించున్నది ఏది?

**శ్రీభగవాన్ ఉవాచ**

**కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహవైరిణమ్ ॥ 37**

**తాత్పర్యము:** కృష్ణుడీ విధముగా విశదీకరించెను. రజోగుణము మహాప్రమాదమైనది. దానినుండి కామక్రోధములు పుట్టును. ఇది నాశనమునకు దారితీయును. పాపకూపములోనికి పడద్రోయును. అందువలన ఈ కామక్రోధములు పాపములు చేయుటకు ప్రేరకములు. అవి మానవునకు శత్రువులు.

**ధూమే నావ్రియతే, వహ్నిః యథాదర్శో మలే నచ ।**
**యథోల్బే నావృతో గర్భః తథా తేనేదమావృతమ్ ॥ 38**



**తాత్పర్యము:** పొగతో అగ్ని, దుమ్ము, మురికితో అద్దము, మావిచే గర్భము కప్పబడియుండును. ఆ విధముగానే కామక్రోధాదులచేత జ్ఞానము కప్పబడి మనుజుని నాశనము చేయును.

**ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।**
**కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ ॥ 39**

**తాత్పర్యము:** ఓ అర్జునా! అంతమాత్రమే కాదు. ఈ కామము అగ్నివంటిది. జయింప సాధ్యముకానిది. ఇది జ్ఞానికి నిత్య శత్రువు. కామముచే జ్ఞానము కప్పబడియున్నది.

**ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే ।**
**ఏ తైర్వి మోహ యత్యేష జ్ఞాన మావృత్య దేహినమ్ ॥ 40**

**తాత్పర్యము:** ఈ కామము సర్వఇంద్రియములను, ఆశ్రయించి వాటికి దాసులైనట్లుజేయును. అది బుద్ధియును, మనస్సులను కూడ ఆవరించి, జ్ఞానిని వశము చేసుకొని, మోహమునకు బానిసగా జేయును.

**తస్మా త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనమ్ ॥ 41**

**తాత్పర్యము:** ఓ అర్జునా! నేను వివరించిన ప్రకారము, నీవు సర్వఇంద్రియములను నిగ్రహించుకుని మెలకువతో నుండవలెను. కామము, జ్ఞానమును, విజ్ఞానమును నశింపజేసి పాపమునకు హేతువగును. అందువలన, కామమును నీవు పూర్తిగా వశమందుంచుకొనుచూ, క్రమముగా పారద్రోలుము.

**ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః ।**
**మనసస్తు పరాబుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః ॥ 42**

**తాత్పర్యము:** అర్జునా! శరీరము అనిత్యము. స్థూలమైనది. ఇంద్రియములు బలమైనవి. వశపరచుకొను శక్తిగలవి. ఇంద్రియములకంటె మనస్సు

ఉన్నతమైనది. మనస్సుకంటె బుద్ధి ఉత్తమమైనది. బుద్ధికంటె సూక్ష్మమైనది ఆత్మ. అత్యుత్తమమైనది ఏదియో అది కలిగియున్న మానవుడే ఆత్మజ్ఞుడు అని చెప్పుదురు.

**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మా న మాత్మనా ।**
**జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥ 43**

**తాత్పర్యము:** అర్జునా! ఈ కారణములచేత బుద్ధికంటెను ఆత్మశ్రేష్ఠమైనదని తెలిసికొని, ఆత్మచేతనే ఇంద్రియములను అదుపులో నుంచుకొని, మనస్సును నిగ్రహింపజేసుకొని, అజేయముగు శత్రువయిన కామమును స్వాధీనము చేసుకొనుము. తద్వారా ఈ దుర్జయమగు కామములు జయించి వినాశన మొనర్చుము.

*ఇట్లు ఉపనిషత్తులును బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును*
*"శ్రీకృష్ణార్జున" సంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన*
*భగవద్గీతయందలి కర్మయోగమను మూడవ అధ్యాయము.*

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

## నాల్గవ అధ్యాయము

## జ్ఞాన యోగము

భగవానుడు మూడవ అధ్యాయములో కర్మయోగము గురించి విశదీకరించెను. నారాయణుడు సర్వాంతర్యామి. ఆయనకు భక్తులందరూ సమానమే. అతడు ద్వంద్వాతీతుడు. విశ్వములో జీవులందరినీ. సత్త్వ రజ స్తమోగుణాలు బంధించి ఉంటాయి. భగవంతుడు వీటికి అతీతుడు. మనుజుడు వీటికి లొంగినట్లయిన ఆసురప్రవృత్తి విజృంభిస్తుంది.

కామమును విసర్జించి, జ్ఞానమును పొందినట్లయిన మంచుగడ్డ సూర్యకిరణ ప్రభావముచే, కరిగినీరయినట్లు, మనుజుడు జ్ఞానరహిత కర్మబంధములనుండి స్వేచ్ఛపొందును. జ్ఞానముకంటెను పవిత్రమైనది, అమోఘమైనది ఏదియునులేదు.

ఈ జ్ఞానమహిమను భగవానుడు మొదట సూర్యునకు ఉపదేశించెను. ఎంతటి పాపముచేసిన వాడైననూ, జ్ఞానమహిమచే దుఃఖ సంసార విషయసాగరమును అవలీలగా దాటవచ్చు.

ఇదియే "జ్ఞానయోగము"లోని ముఖ్యాంశము!

**శ్రీభగవానువాచ**

**ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్ ।**
**వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ 1**

**తాత్పర్యము:** శ్రీకృష్ణభగవానుడిట్లు పలికెను. అవ్యయమగు ఈ యోగమును సూర్యునకు ఉపదేశించితిని. సూర్యుడు మనువుకు చెప్పెను. మనువు ఇక్ష్వాకువునకు చెప్పెను.

**ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః ।**
**స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప ॥ 2**

**స ఏవాయం మయాతేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।**
**భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥ 3**

**తాత్పర్యము:** ఓ అర్జునా! పరంపరగా లభించిన ఈ యోగమును రాజర్షులు తెలుసుకొని యుండిరి. ఈ యోగము కాలక్రమేణా లుప్తమైపోయినది. నీవు నా చెలికాడవు. ఈ ప్రాచీన యోగము శ్రేష్ఠమైనది. రహస్యమైనది. నా చేత చెప్పబడినది. కావున గ్రహించుము.

**అర్జున ఉవాచ**

**అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।**
**కథమేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవానితి ॥ 4**

**శ్రీ భగవానువాచ**

**బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।**
**తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥ 5**

**తాత్పర్యము:** అర్జునుడు పలికెను. నీవు సూర్యుని తరువాత జన్మించినావు. సూర్యుని జన్మ తత్పూర్వమే ఉన్నది. అటువంటి సందర్భములో సృష్టి ప్రారంభముననే ఉన్న సూర్యునికి నీవు ఉపదేశించినట్లు నన్ను ఎట్లు గ్రహింపవలెనందువు?

శ్రీ భగవానుడిట్లు పలికెను. అర్జునా! నీకునూ, నాకునూ అనేక జన్మలు గడచినవి. ఆ విషయము నీ వెరుంగవు. కాని, నేను వాటినన్నిటిని ఎరుగుదును.

**అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్ ।**
**ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా ॥ 6**



**యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।**
**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ 7**

**తాత్పర్యము:** అర్జునా! నేను ఎల్లప్పుడును లోపించని జ్ఞాన శక్తులతో కలిగియుండు స్వభావము కలవాడిని. నేను అవ్యయుడను. సర్వభూతములకు నాథుడనైనను, స్వకీయమగు ప్రకృతిని వశమొనర్చుకొని, నామాయాశక్తిచేత ఈ శరీరముతో అవతరించుచున్నాను.

అర్జునా! ఎపుడెపుడు ధర్మమునకు పీడ, అధర్మమునకు అభివృద్ధి కలుగునో అపుడు నా అంతట నేనే అవతరిస్తాను.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ 8**

**తాత్పర్యము:** సాధుపురుషుల రక్షణార్థము, దుష్టుల వినాశనార్థము, ధర్మమును స్థాపించుటకొరకు నేను ప్రతియుగమునందు అవతరింతును.

**జన్మకర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః ।**
**త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ॥ 9**

**వీతరాగ భయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః ।**
**బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥ 10**

**తాత్పర్యము:** అర్జునా! ఎవరు అప్రాకృతమును అలౌకికమునగు నా జన్మను సాధురక్షణాదిలీలలను యథార్థముగా తెలుసుకొనునో అతడు పునర్జన్మ పొందడు. నన్నే పొందును.

ఆసక్తి, భయము, కోపమును లేనివారును, నన్నే భావించువారును, ఆశ్రయించిన వారును, అగు చాలామంది పరమాత్మ, జ్ఞానమును తపస్సుచేత, శుద్ధులై నా స్వరూపమును పొందిరి.

**యే యథామాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్ ।**
**మమవర్త్మాను వర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥ 11**

**కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహదేవతాః ।**
**క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥ 12**

**తాత్పర్యము:** ఎవరు ఏ భావముతో నన్ను ఉపాసింతురో నేను వారిని అట్లే అనుగ్రహించుచున్నాను. అర్జునా! మనుజులు సర్వవిధముల నా మార్గమునే అనుసరించుచున్నారు. అనగా ఇంద్రాది దేవతల నుపాసించుచున్నవారు కూడా ఆయారూపములద్వారా నన్నే ఉపాసించున్నారు. ఆయా రూపములను నేను అనుగ్రహించుచున్నాను. కనుక కర్మలయొక్క ఫలసిద్ధిని కాంక్షించు జనులకు మర్త్యలోకమున శీఘ్రముగా కర్మజనితమగు ఫలము కలుగును.

**చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః ।**
**తస్యకర్తార మపి మాం విద్ధ్య కర్తార మవ్యయమ్ ॥ 13**

**తాత్పర్యము:** సత్త్వాది గుణములు, శమాదికర్మల విభజన చొప్పున, నా చేత బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను వర్ణములు సృష్టింపబడినవి. దానికి నేను కర్తనైనను అవ్యయమైనవానిగను, కర్తనుకాని వానిగను తెలిసికొనుము.

**నమాంకర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా ।**
**ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥ 14**

**ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।**
**ఏవం కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతం ॥ 15**

**తాత్పర్యము:** కర్మలు అహంకారములేనందువల్ల నన్ను స్పృశింపవు. నాకు కర్మలయందు ఆసక్తి లేదు. ఇట్లు ఎవరునన్ను ఆ విధముగా, ఆత్మరూపునిగా తెలిసికొందురో, అట్టివారు కర్మలచే బంధింపబడరు.

ఈ విధముగా గ్రహించి పూర్వులైన మోక్షార్థులు కూడా కర్మలను ఆచరించిరి. నీవు కూడా పూర్వమే, ప్రాచీనులచేత ఒనర్పబడిన కర్మలనే ఆచరించుము.



**కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।**
**తత్తే కర్మ ప్రవక్ష్యామి యత్జ్ఞాత్వామోక్ష్యసేఽశుభాత్ ॥ 16**

**కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।**
**అకర్మణ శ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ 17**

**తాత్పర్యము:** ఆచరింపదగిన కర్మ ఎట్టిది? ఆచరింపదగని కర్మ ఎటువంటిది? ఈ విషయములో మేధావులు కూడా భ్రాంతులగుచున్నారు. నిషిద్ధమైన కర్మలను గురించి కూడా తెలియవలయును. కనుక, సంసార అశుభము నుండి విముక్తుడవగుదువో ఆ కర్మతత్త్వమును నీవు తెలుసుకొనవలెను. దానినే నేను చెప్పుచుంటిని.

శాస్త్రము విధించు కర్మలను, శాస్త్రము విధించు అకర్మలను, కర్మల తత్త్వమును నీవు గ్రహించుట తప్పనిసరి.

**కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణి చ కర్మ యః ।**
**స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥ 18**

**యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః ।**
**జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం త మాహుః పండితం బుధాః ॥ 19**

**తాత్పర్యము:** ఎవడు కర్మమునందు కర్మాభావమును, బ్రహ్మసాక్షాత్కారసిద్ధిని వీక్షించునో, అతడు మనుజులలో జ్ఞాని, యోగి, అంతేకాక, అతడు సర్వకర్మలను ఆచరించువాడు, కృతకృత్యుడు.

మరియు ఎవడు సర్వకర్మములను, ఫలాపేక్షలేక, కర్తృత్వాభిమాన రహితముగా, సదా సంతృప్తి చెందునో, జ్ఞానమనెడి అగ్నిచే దహింపబడిన కర్మలు కలిగియుండునో అట్టి పురుషుని పండితుడని అందురు.

**త్యక్త్వా కర్మఫలాసంగం నిత్య తృప్తో నిరాశ్రయః ।**
**కర్మణ్యభి ప్రవృత్తోఽపినైవ కించిత్కరోతి సః ॥ 20**

**నిరాశీర్యత చిత్తాత్మాత్యక్త సర్వ పరిగ్రహః ।**
**శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ ॥ 21**

**తాత్పర్యము:** ఎవని కర్మాచరణము ఫలాసక్తిని వీడి, ఎట్టిదానిని ఆశ్రయింపక కర్మములను ఆచరించునోవాడు ఏమియును ఒనర్పనివాడే అగును.

నిష్కాముడును, అంతఃకరణములను దేహేంద్రియములను వశపరుచుకొనినవాడును, ఏ వస్తువును ఇతరులు దానంగా యిచ్చినా గ్రహింపనివాడును, శరీరధారణ నిమిత్తము కర్మలను ఆచరించినను అనిష్టమును, పుణ్యపాపములను పొందదు.

**యదృచ్ఛాలాభసంతుష్టో ద్వందాతీతో విమత్సరః ।**
**సమః సిద్ధావ సిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥ 22**

**గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః ।**
**యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ 23**

**తాత్పర్యము:** తనకు లభించిన దానితో సంతృప్తి పొందినవాడును, సుఖదుఃఖములయందు, లాభనష్టములయందు సమబుద్ధి కలిగియుండువాడును, అసూయారహితుడును అగుపురుషుడు, తనకు విధింపబడిన, స్వాభావికమగు శరీర రక్షణాదికములగు కర్మములను ఆచరించినను బద్ధుడుకాడు.

ఆసక్తి రహితుడును, విముక్తుడును, జ్ఞానమున వెలయు మనస్సుగలవాడును, ఈశ్వరారాధన నిమిత్తము కాని, లోకసంగ్రహార్థము కాని, కర్మములను ఆచరించినను, ఫలములనొసంగి బంధమును కల్పించదు. కర్మము లేకుండా, కర్మసంస్కారమూ లేకుండా నశించును.

**బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్ ।**
**బ్రహ్మైవతేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥ 24**



**తాత్పర్యము:** హోమసాధనములు, హవిస్సు, హోమాగ్ని, హోమము చేయుహోత, హోమము చేయబడినది, యజ్ఞములనాచరించువాడు పొందెడి ఫలముకూడా బ్రహ్మయే అగును.

**దైవ మేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।**
**బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి ॥ 25**

**శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।**
**శబ్దాదీ న్విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి ॥ 26**

**తాత్పర్యము:** కొందరు యోగులు దేవతలను ఉపాసించునట్టి యజ్ఞమునే అనుష్ఠించుచున్నారు. మరికొందరు యోగులు, బ్రహ్మమును అగ్నియందు జీవాత్మ చేతనే జీవాత్మను ఆహుతి నొసగుచున్నారు. అనగా జీవాత్మను నిరుపమాధికమగు పరమాత్మగనే దర్శించుచున్నారు.

మరికొందరు, కర్ణాదులగు ఇంద్రియములను నిగ్రహము అను అగ్నియందు ఆహుతి నొసగుచున్నారు. ఇంకనూ మరికొందరు విషయ సమూహములైన ఇంద్రియ రూపమైన అగ్నియందు ఆహుతి నొసగుచున్నారు.

**సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।**
**ఆత్మ సంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞాన దీపితే ॥ 27**

**ద్రవ్య యజ్ఞా స్తపోయజ్ఞా యోగ యజ్ఞాస్తథాపరే ।**
**స్వాధ్యాయజ్ఞాన యజ్ఞాశ్చ యతయః సంశిత వ్రతాః ॥ 28**

**తాత్పర్యము:** మరికొందరు జ్ఞానప్రదీప్తమగు, ఆత్మ నిగ్రహమను యోగాగ్నియందు, సమస్త ఇంద్రియకర్మలను, ప్రాణాది సమస్త ఇంద్రియ కర్మములను, ప్రాణాదివాయువుల కర్మలను ఆహుతి నొసగుచున్నారు.

ఇంకనూ మరికొందరు యోగులు ద్రవ్యయజ్ఞమును, కొందరు యోగయజ్ఞమును, మరికొందరు తపో యజ్ఞమును, స్వాధ్యాయ యజ్ఞమును

ఒనర్చుచున్నారు. కొందరు యతులు దృఢవ్రతులై వేదాభ్యాస యజ్ఞమును, వేదాభ్యాస, వేదార్థ నిశ్చయమగు జ్ఞాన యజ్ఞములను దృఢదీక్షకలవారై చేయుచున్నారు.

**అపానే జుహ్వతి ప్రాణంప్రాణేఽపానం తథాపరే ।**
**ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః ॥ 29**

**తాత్పర్యము:** మరికొందరు యోగులు అపానవాయువున, ప్రాణావాయువును, ప్రాణావాయువున అపానవాయువును హోమమొనర్చుచున్నారు. ప్రాణాపానవాయువులగతిని నిరోధించి, ప్రాణాయామమును ఒనరించుచుండిరి.

**అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషుజుహ్వతి ।**
**సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత కల్మషాః ॥ 30**

**యజ్ఞశిష్టా మృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।**
**నాయంలోకోఽస్త్య యజ్ఞస్యకుతోఽన్యః కురుసత్తమ ॥ 31**

**తాత్పర్యము:** మరికొందరు నియతమగు ఆహారముకలవారై, వాయుసమూహములను వాయువులయందు హోమమొనర్చుచున్నారు. అనగా ఏ ఏ వాయువును జయించుచున్నారో ఆ యా ఆ యా వాయువును ఇతర వాయువులలో హోమమొనర్చుచున్నారన్నది అర్థము. ఇట్లు యజ్ఞములను తెలుసుకొన్నవారును, ఆచరణలోపెట్టువారును పాపములనుండి విముక్తులగుచున్నారు.

యజ్ఞము తరువాత మిగిలిన అమృతమును భుజించువారు శాశ్వతమగు బ్రహ్మమును పొందెదరు. ఓ అర్జునా! యజ్ఞమొనర్పని వానికి ఈ లోకమేలేదు. అట్టిచో పరలోకమెక్కడిది!

**ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।**
**కర్మజా న్విద్ధి తాన్సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ 32**



**శ్రేయాన్ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప ।**
**సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే ॥ 33**

**తాత్పర్యము:** వేదమున ఈ విధముగా అనేక విధములగు బ్రహ్మముఖము నుండి వ్యాఖ్యాతములై ఉన్నవి. ఇవన్నియు మనోవాక్కాయ కర్మలకు సంబంధించినవే. అవి ఆత్మనుండి కలుగలేదు, కాబట్టి, అర్జునా! అది గ్రహించి జ్ఞాన నిష్టుడవై మోక్షమును పొందగలవు.

అర్జునా! ద్రవ్యముద్వారా సాధింపబడు యజ్ఞముకంటె జ్ఞానరూప యజ్ఞము శ్రేష్టమైనది. సమస్త కర్మములన్నియు, ఆత్మజ్ఞానమందే అంతర్గతములై పరిసమాప్తములగుచున్నది.

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్వదర్శినః ॥ 34**

**యద్ జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ ।**
**యేన భూతా న్యశేషాణి ద్రక్ష్యస్యాత్మ న్యథోమయి ॥ 35**

**తాత్పర్యము:** సాష్టాంగ ప్రణామమొనర్చుచు, ప్రశ్నించుట చేతను, శుశ్రూషచేతను, బ్రహ్మజ్ఞానులైనటువంటి జ్ఞానుల ద్వారా జ్ఞానమును తెలిసికొనుము.

అర్జునా! బ్రహ్మజ్ఞానమును పొందిన తర్వాత నీకిటువంటి మోహముకలుగదు. ఆ జ్ఞానముచేత బ్రహ్మాది స్థావర పర్యంతము సర్వభూతములను, నీ యందునూ నాయందునూ చూడగలవు.

**అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥ 36**

**యథై ధాంసిసమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున ।**
**జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 37**

**తాత్పర్యము:** పాపులందరికంటెను పాపిష్ఠుడ వైనను సమస్త పాపములను, ధర్మాధర్మములను బ్రహ్మజ్ఞానమను తెప్ప చేత దాటింపబడి, ఉత్తీర్ణుడుకాగలవు.

అర్జునా! ప్రజ్వలింపబడిన అగ్ని కట్టెలను ఏ విధముగా దహింపజేయునో, అట్లే జ్ఞానమను అగ్ని సమస్త కర్మలను భస్మము గావించుచున్నది.

**న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే ।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి ॥ 38**

**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః ।**
**జ్ఞానం లబ్ధ్వా పరాంశాంతి మచిరేణాధిగచ్ఛతి ॥ 39**

**తాత్పర్యము:** ఈ విశ్వములో జ్ఞానముతో సమానమైనది పరిశుద్ధమైనదేదియు లేదు. కాలక్రమమున కర్మయోగ్యతను పొందిన, శుద్ధచిత్తుడైన ముముక్షువు తన యందు ఆ బ్రహ్మమును పొందును.

శ్రద్ధకలిగినవాడును, గురుసేవయందు ఆతురత కలిగియున్నవాడును, జితేంద్రియుడును, అయిన మనుజుడు ఆత్మజ్ఞానమునుపొంది, వెంటనే మోక్షమును పొందును.

**అజ్ఞశ్చా శ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।**
**నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥ 40**

**యోగసన్న్యస్త కర్మాణం జ్ఞానసంఛిన్న సంశయమ్ ।**
**ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ ॥ 41**

**తాత్పర్యము:** జ్ఞానములేనివాడును, శ్రద్ధలేనివాడును, ఇది సిద్ధించునో లేక సిద్ధించదో అనెడు సందేహముతో మనసుకలవాడును భ్రష్టులయ్యెదరు. అట్లు సందేహముతో చిత్తముగలవానికి, ఈ లోకమేకాక, ధర్మము లోపించుటచేత పరలోకము గూడ ఉండదు. సుఖము లేదు.



ఓ అర్జునా! బ్రహ్మజ్ఞానముచేత, ధర్మాధర్మములను విడిచినవాడు, సంశయములన్నియు తొలగినవాడును, పరమేశ్వర ఆరాధన అను యోగమును భగవంతునకు అర్పించినవాడును అగు అప్రమత్త మానవుని కర్మలు బంధించవు.

**తస్మా దజ్ఞాన సంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః ।**
**ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత ॥ 42**

**తాత్పర్యము:** పార్థా! అజ్ఞానము వలన కలిగిన, లోన ఉన్న సంశయమును, ఆత్మవిషయకమును అగు ఇట్టి సంశయమును, జ్ఞానమనే ఖడ్గముచే ఛేదించుము. నిష్కామకర్మ యోగమును ఆశ్రయించుము. అందువల్ల యుద్ధమునకు సంసిద్ధుడవుకమ్ము. లెమ్ము.

***ఇట్లు ఉపనిషత్తులును బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రము "శ్రీకృష్ణార్జున" సంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందలి జ్ఞానయోగ మనెడు నాల్గవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

# ఐదవ అధ్యాయము

# కర్మసన్న్యాస యోగము

సాధన చేయువాడు కర్మయోగమునందు స్థిరపడిన తర్వాతనే సన్యాసమంటే తెలుస్తుంది. సన్యాసి ఇంద్రియములను వశపరచుకొని, ఆత్మ తప్ప మరొకటి లేదని ఎరుక గలిగి ఉండాలి. ఈ జగత్తు అంతా అశాశ్వతము, అసత్యము, మాయామయము అని అన్నివేళలయందు జ్ఞాపకముంచుకొనవలెను. పరిసరాలవలన ప్రేరేపింపబడకుండా ఉండాలి. భయపడరాదు. భయము కలిగింపరాదు. సకల జీవులయందు ఆ పరమాత్మ ఉన్నాడని మరువరాదు. సన్న్యాసి ఆత్మజ్ఞానము కలిగేంతవరకు గురువును ఆశ్రయించవలెను. సన్న్యాసాశ్రమంలోనికి ప్రవేశించేముందు సంపూర్ణ వైరాగ్యం అవసరం.

జీవాత్మ, పరమాత్మ అనునవి రెండూ వృక్షముపై గూడుకట్టుకొన్న రెండుపక్షులూ, సుఖదుఃఖములనునవి చెట్టుపైన ఉన్న ఫలములు. ఈ మాయామయమైన విశ్వములో గృహస్థుడు. ఈ రెండింటినీ అనుభవించును. ఈ అసత్య భౌతికవస్తు ప్రపంచమును లెక్కచేయక బంధవిమోచనముతో సన్యాసులు జ్ఞానులు నిత్యమూ సుఖఫలములను అనుభవింతురు.

ఈ ఐదవ అధ్యాయములో శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునకు సంపూర్ణముగా వివరించి, సందేహ నివృత్తిని గావించును. సమ్యక్ దర్శనములోనే దృశ్యముందని గ్రహించి, దర్శించే ప్రయత్నమును విస్మరించ గలిగితేనే అది కర్మ సన్న్యాసయోగమవుతుంది.

**అర్జున ఉవాచ**

**సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి ।**
**యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥ 1**



**తాత్పర్యము:** అర్జునుడు కృష్ణుని అడుగుతున్నాడు. కృష్ణా! శాస్త్ర విహితములగు కర్మల త్యాగమును ఒకవైపు, మరల కర్మయోగము గురించి చెప్పుచుంటివి. ఈ రెండింటిలో ఏది శ్రేయస్కరమో, వివరముగా చెప్పి నాకు తెలియపరచుము.

**శ్రీ భగవానువాచ**

**సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ ।**
**త యోస్తు కర్మసన్యాసా త్కర్మయోగో విశిష్యతే ॥ 2**

**జ్ఞేయః సనిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి ।**
**నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధాత్ప్రముచ్యతే ॥ 3**

**తాత్పర్యము:** శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు. కర్మసన్న్యాసము, నిష్కామ కర్మయోగము రెండునూ కూడ ముక్తినిచ్చునవే. కాని, కర్మత్యాగముకంటె నిష్కామకర్మానుష్ఠానము ఉత్కృష్టమైనది.

అర్జునా! ఎవడు ద్వేషములేనివాడో, కోరికలులేనివాడో అట్టి మనుజుడు కర్మలను ఆచరించుచున్నను సన్న్యాసియే అని తెలిసికొనుము. ఎందువలన అనగా సంసార దుఃఖములనెడు రెండింటియందు ఆసక్తిలేనివాడు కర్మములను చేయుచున్నను సన్న్యాసియే అనబడును. ఆ సుఖదుఃఖముల నుండి విముక్తిని పొందును.

**సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః ।**
**ఏకమప్యాస్థితః సమ్య గుభయోర్విందతే ఫలమ్ ॥ 4**

**యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపి గమ్యతే ।**
**ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి సపశ్యతి ॥ 5**

**తాత్పర్యము:** అవివేకులైనవారే జ్ఞానయోగము కర్మయోగము వేర్వేరుగా చెబుతారు కాని, పండితులు ఆ విధముగా చెప్పరు. ఈ రెండింటిలో దేనినైనను సవ్యముగా అనుష్ఠింపబడినచో రెండింటి ఫలమును పొందెదరు.

జ్ఞాన నిష్ఠులైనటువంటి సన్న్యాసులచేత ఏ స్థానము పొందబడుచున్నదో, ఆస్థానము నిష్కామకర్మ యోగులచేత పొందబడును. జ్ఞానయోగ ఫలమును, కర్మయోగఫలమును. ఒక్క మోక్షమునకే కారణముగా ఏ మనుజుడైతో గుర్తించునో అతడే యథార్థమును గుర్తించు తత్త్వదర్శి.

**సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః ।**
**యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి ॥ 6**

**తాత్పర్యము:** అర్జునా! నిష్కామ కర్మయోగానుష్ఠాన విహిత జ్ఞాననిష్ఠా రూప కర్మసన్న్యాస యోగము సంభవముకాదు. నిష్కామకర్మ నిష్ఠుడగు మననశీలుడు సన్న్యాసి అగును. అప్పుడు అతడు అతిత్వరలో సర్వసంగ పరిత్యాగియై పరబ్రహ్మమును పొందగలడు.

**యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః ।**
**సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥ 7**

**నైవకించిత్కరో మీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।**
**పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ॥ 8**

**ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్నపి ।**
**ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్ ॥ 9**

**తాత్పర్యము:** తన చిత్తమును వశమునందుంచుకొన్నవాడును, అంతఃకరణ శుద్ధికలవాడును, అన్ని ప్రాణుల ఆత్మయు తన ఆత్మయు ఒక్కటే అని గుర్తించినవాడును, కర్మములను చేయచున్నను, నేనేమియు చేయుట లేదని తలచువాడును మానవుడు వాటిచేత అంటబడడు.

తత్త్వమెరిగిన కర్మయోగి చూచుచు, వినుచు, స్పృశించుచు, వాసన చూచుచు, భుజించుచు, నడచుచు, నిద్రించుచు, శ్వాసప్రక్రియను



జరుపుచు, పలుకుచు, కనులను తెరచుచు, మూయుచు, ఆయావిషయము లందు వాటి విధులప్రకారం అవి ప్రవర్తించుచున్నవే కాని నేను కర్తనుకాదు అని తలంచును.

**బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।**
**లిప్యతే న న పాపేన పద్మపత్ర మివాంభసా ॥ 10**

**తాత్పర్యము:** ఏ మనుజుడు తాను చేయుచున్న కర్మలను పరమేశ్వరునకు సమర్పించి, ఫలాసక్తిని విడనాడి కర్మములను ఆచరించునో అతడు తామరాకుపై గల నీటిబొట్టు దానిని అంటకుండా ఎలా ప్రవర్తిస్తుందో ఆ విధంగా పాపముల చేత అంటబడడు. కర్మయోగి నీటిబొట్టులో లోకమనే తామరాకుపై తటస్థంగా ఉండి జీవిస్తాడు.

**కాయేన మనసా బుధ్యా కేవలై రింద్రియై రపి ।**
**యోగినః కర్మకుర్వంతి సంగం త్యక్త్వాత్మ శుద్ధయే ॥ 11**

**యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్ ।**
**అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥ 12**

**తాత్పర్యము:** నిష్కామకర్మయోగులు మమతాసక్తిని విడిచిపెట్టి, మమతాభిశూన్యులై, స్నానము శరీరమును, ధ్యానము ద్వారా మనస్సును, తత్త్వముద్వారా బుద్ధిని, అంతఃకరణ శుద్ధులై శ్రవణము కీర్తనము మొదలైనవాటిని సహాయము చేసుకొని కర్మలను ఆచరించుచున్నారు.

నిష్కామకర్మయోగి, కర్మలవలన వచ్చు ఫలమును విడిచి, నిష్ఠా ప్రభవమగు శాంతిని ముక్తిని పొందును. కర్మఫలములయందు ఆసక్తుడైనవాడు బద్ధుడగును.

**సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ ।**
**నవ ద్వారే పురే దేహీనైవ కుర్వ న్న కారయన్ ॥ 13**

**తాత్పర్యము:** అంతఃకరణమును తన అదుపులో నుంచుకొని, కర్మములన్నింటిని మానసికముగా విడిచిపెట్టి, బాహ్య విషయములందు ప్రయోజనము లేనివాడై, నవద్వారములు గల దేహమునందు, సమస్తకర్మలను త్యజించి, కర్తృత్వరహితుడై ఆనందమును పురుషుడు అనుభవించును.

సంధ్యావందనము మొదలగు కర్మములు నిత్యము చేయవలసినవి. అప్పుడప్పుడు ఆచరించబడే కర్మములు నైమిత్తికములు. ఫలము నాశించునవి కామ్యములు.

**న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।**
**న కర్మఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥ 14**

**తాత్పర్యము:** పరంధాముడు మనుజులయొక్క కర్తృత్వమునుగాని, కర్మలనుగాని, వాటి ఫలసంబంధమునుకాని, సృజింపక అన్నింటిని ప్రకృతియే ప్రవర్తించునట్లు చేయును.

**నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।**
**అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః ॥ 15**

**తాత్పర్యము:** పరమేశ్వరుడు ఏ ఒక్కనియొక్క పాపపుణ్యకర్మములను గ్రహింపడు. అజ్ఞానముచేత జ్ఞానము నశింపబడి, జీవులు మోహింపబడుదురు.

**జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।**
**తేషామాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥ 16**

**తాత్పర్యము:** ఆత్మవలన ప్రసాదింపబడు జ్ఞానముచేత అజ్ఞానము నశింపబడినట్టి జ్ఞానము ఆదిత్యునిచేత ప్రకాశింపబడి సచ్చిదానంద పరమాత్మను దర్శింపజేయును.

**తద్బుద్ధయస్తదాత్మానః తన్నిష్ఠాస్తత్పరాయణాః ।**
**గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాన నిర్ధూతకల్మషాః ॥ 17**



**తాత్పర్యము:** బ్రహ్మనిష్ఠులును, తద్రూపమును పొందిన మనస్సు బుద్ధికలవారును, జ్ఞానకారణముగా నశింపబడిన పాపములను పొందిన జనులు జన్మరహితమైన పరమగతిని అనగా మోక్షమును పొందుదురు.

**విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।**
**శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥ 18**

**తాత్పర్యము:** విద్యావంతుడును, వినయస్వభావమును గలిగినట్టి బ్రాహ్మణునియందును, గోవులు, ఏనుగులు, శునకాదులయందును, శునక మాంసమును భక్షించు చండాలుని యందును, భేదదృష్టిలేక, జ్ఞానులు సమదృష్టినే కలిగియుందురు.

**ఇహైవ తైర్జితః సర్గోయేషాం సామ్యేస్థితం మనః ।**
**నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్ బ్రహ్మణితే స్థితాః ॥ 19**

**తాత్పర్యము:** ఎవరి మనస్సు సమమైన భావమునందు స్థిరముగానుండునో, అట్టివారిచేత ఈ విశ్వమంతయూ జయింపబడి, వారే త్రిగుణాతీతులు, జీవన్ముక్తులుగా అగుదురు.

**న ప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య నోద్విజేత్ ప్రాప్య చా ప్రియమ్ ।**
**స్థిర బుద్ధి రసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥ 20**

**తాత్పర్యము:** ప్రియమైన పొగడ్తలకు పొంగిపోవనివాడును, అప్రియ వాక్కులకు క్రుంగని వాడును, నిశ్చలము, స్థిరమైన బుద్ధికలవాడును అయినటువంటివాడు బ్రహ్మవేత్త అయి, బ్రహ్మము నందున్నవాడగును. సుఖము కల్గినప్పుడు పొంగిపోక, దుఃఖము కల్గినప్పుడు కుంగిపోక ఏకీభావస్థితి యందుండును.

**బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్ ।**
**స బ్రహ్మయోగ యుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥ 21**

**తాత్పర్యము:** ప్రాపంచిక విషయములందు అపేక్షలేని మనుజుడు సాత్త్వికుడు, అంతరాత్మ సుఖము ననుభవించెడి యోగి, నాశనములేని బ్రహ్మానందమును అనుభవించును.

**యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।**
**ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః ॥ 22**

**తాత్పర్యము:** ఓ అర్జునా! ఇంద్రియ సుఖభోగములవలన పొందినవన్నియు దుఃఖహేతువులు. ఇవన్నియు నిత్యములుకావు. వివేకమును కలిగిన పురుషుడు వాటియందు ప్రీతినొందడు.

**శక్నోతీహైవయః సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్ ।**
**కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీనరః ॥ 23**

**తాత్పర్యము:** మనుజుడు శరీర నిర్యాణముకంటె ముందుగానే కామక్రోధాదుల కారణముగా కలిగిన సంక్షోభమును అరికట్టగలవాడే నిజమైన యోగి అనబడును. అతడే నిజమైన సుఖి.

**యోఽన్తః సుఖోంతరారామః తథాంతర్జ్యోతిరేవ యః ।**
**స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ 24**

**తాత్పర్యము:** ఏమనుజుడు ఆత్మయందే సుఖమును పొందువాడును. ఆత్మయందే రమించువాడును, అగుచున్నాడో అతడు ప్రకాశవంతుడైన యోగి. అతడే బ్రహ్మానందమును, ముక్తిని పొందగలడు.

**లభంతే బ్రహ్మనిర్వాణం ఋషయః క్షీణకల్మషాః ।**
**ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూత హితేరతాః ॥ 25**

**తాత్పర్యము:** పాపములు క్షీణించినవారును, జ్ఞానముయొక్క ప్రభావమువలన సంశయములను ఛేదించినవారును, సర్వప్రాణులయందు హితమును కలిగియున్నవారును, సర్వప్రాణులయందు, నిశ్చలమైన మనస్సుతో పరంధామునియందు ఏకాగ్రతతో లగ్నము చేసినవారును మోక్షమును పొందెదరు.



**కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।**
**అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥ 26**

**తాత్పర్యము:** కామక్రోధములను విడిచినవారును, ఆత్మజ్ఞానులు, మనస్సును జయించినవారును, అగు సన్న్యాసులు దేహత్యాగపూర్వము, అనంతరము కూడ బ్రహ్మానందము, మోక్షములను పొందుదురు.

**స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాన్ చక్షుశ్చైవాంతరే భ్రువోః ।**
**ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతర చారిణౌ ॥ 27**

**యతేంద్రియమనోబుద్ధిః మునిర్మోక్షపరాయణః ।**
**విగతేచ్ఛా భయక్రోధో యః సదా ముక్త ఏవ సః ॥ 28**

**తాత్పర్యము:** బాహ్య విషయ సమూహములందు మనస్సునుండి వెలుపలకు పారద్రోలి, తమ దృష్టిని, నాసికా రంధ్రము ద్వారా వెలువడుచున్న ప్రాణాపాన వాయువులను సమానముగా చేసుకుని బుద్ధిని మనస్సును నియమించి, ఇచ్ఛా, భయ, క్రోధములను జయించినవాడగునో అతడు ముముక్షువై ముక్తిని సంశయరహితముగా పొందును. బంధములు లేనివాడగును.

**భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్ ।**
**సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి ॥ 29**

**తాత్పర్యము:** యజ్ఞములకు, తపస్సులకు, నన్ను భోక్తగాను, సమస్తలోకములకు, సర్వలోకేశ్వరులకు సార్వభౌమునిగాను, మిత్రునిగాను, ఆత్మీయునిగాను జ్ఞానముతో గ్రహించిన యోగులు పరమశాంతిని ముక్తిని పొందుచున్నారు.

***ఇట్లు ఉపనిషత్తులును బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును "శ్రీకృష్ణార్జున" సంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందలి సన్న్యాస యోగము అను ఐదవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

## ఆరవ అధ్యాయము

## ఆత్మ సంయమ యోగము - (ధ్యాన యోగము)

ఈ అధ్యాయములో నిష్కామకర్మయోగ వివరములు, యోగారూఢుని గుణములు, ఆత్మోద్ధరణము కొరకుప్రేరణ, భగవంతుని ప్రాప్తిని పొందినవారి లక్షణములు, మనస్సును నిగ్రహించుటకొరకు ప్రయత్నింపవలసిన వివరములు, ధ్యానయోగియొక్క మహిమ, యోగభ్రష్టునిగతి మొదలగు వాటిని కృష్ణపరమాత్మ అర్జునునికి బోధించెను.

భగవంతుడు సర్వాంతర్యామి. భగవద్భక్తికి ముఖ్యముగా కావలసినవి ప్రేరణ, ధ్యానము, భగవంతుని ధ్యానంలోవున్న మనుజునికి ప్రాపంచిక స్పృహ ఒక అవరోధం. కోపం, పగ, ద్వేషం, అసూయ, విషయవాంఛలు మనస్సును పీడించును. జీవాత్మ పరమాత్మను చేరుటకు సాధనం ధ్యానం. భగవంతునియందు లీనమైపోవాలి. అప్పుడు ధ్యేయము, ధ్యాత, ధ్యానము అనే త్రిపుటి ఒక్కటే అవుతాయి. ధ్యానముతో భక్తుడు భగవంతునొక్కనినే చూచును. దేనినీ అపేక్షింపడు. జీవుడు మాయాజాలమునుండి బయటపడగలడు. బ్రహ్మసాక్షాత్కారం కలిగినవారు తమ ఆత్మయే సర్వప్రాణులలోను చూతురు. సర్వప్రాణులను తమ ఆత్మలోకూడ దర్శించెదరు. ఆధ్యాత్మిక మంటే మనలోని ఆత్మతో అనుసంధానించుకొనుట. ధ్యానంద్వారా ఆధ్యాత్మిక చైతన్యం ఆత్మజ్ఞానం లభిస్తుంది. ఆత్మపరమాత్మగా పరిణతిచెందవలెనంటే ధ్యాన సరస్సులో మునిగి తేలాలి. ఇదే కైలాసంలోని మానస సరోవరం. ఆ సరోవరంలో విహరించే హంసయే సోऽహం అనబడే ఆత్మ.

**శ్రీ భగవాన్ ఉవాచ**

**అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।**
**స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః ॥ 1**



**తాత్పర్యము:** భగవానుడు అర్జునుని కిట్లు చెప్పెను. ఏ మనుజుడు కర్మఫలమును ఆశింపక, తనకు నియమించిన కర్మలను చేయునో అతడే నిజమైన సన్న్యాసి మరియు యోగి. అగ్నిహోత్రకార్యములను త్యజించిన మాత్రమున, తపోదానాది క్రియలను త్యజించిన మాత్రమున సన్న్యాసి, యోగికాడు. కాలేడు.

**యం సన్న్యాసమితి ప్రాహుః యోగం తం విద్ధి పాండవ ।**
**న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన ॥ 2**

**తాత్పర్యము:** అర్జునా! దేనిని సన్న్యాసమని చెప్పుదురో దానిని యోగమని గ్రహించుము. ఎందువలననగా, తన సంకల్పమును త్యాగము చేయని మనుజుడు ఎంతమాత్రము యోగి కాలేడు.

**ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే ।**
**యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే ॥ 3**

**తాత్పర్యము:** ధ్యానయోగమును పొందగోరు మునికి కర్మము సాధనమని చెప్పబడుచున్నది. ఎందువలననగా, జ్ఞానమును పొందిన ఆ ధ్యాననిష్ఠునకు సర్వసంకల్ప రాహిత్యమే సాధనమని చెప్పబడుచున్నది.

**యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే ।**
**సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢస్త దోచ్యతే ॥ 4**

**తాత్పర్యము:** ఏ పురుషుడు ఎల్లవేళలయందు భోగభాగ్యములయందు ఆకర్షింపబడడో నిర్లిప్తుడో, మరియు నిత్యకర్మలయందు ఆసక్తుడుకాడో, సర్వసంకల్పములను త్యజించినవాడో అట్టి పురుషుడు యోగారూఢుడని చెప్పబడును.

**ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।**
**ఆత్మైవహ్యాత్మనో బంధుః ఆత్మైవ రిపురాత్మనః ॥ 5**

**తాత్పర్యము:** మనుజుడు తనచేత స్వయముగా సంసారసాగరమును మునిగిపోక ఉద్ధరించుకొనవలెను. విషయాసక్తిని పొందరాదు. తనకు తానే బంధువు అయి అధోగతిలోపడకుండా సంరక్షించుకొనవలెను. మనస్సే తనకు హితము బోధించు స్నేహితుడు. ప్రాపంచిక విషయములందు ఆసక్తిని పెంచు మనస్సే తనకు శత్రువు.

**బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనాజితః ।**
**అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥ 6**

**తాత్పర్యము:** ఏ జీవాత్మమూలముగా, మనస్సు ద్వారా, దేహేంద్రియముల సహితమైన ఈ దేహము జయింపబడినదో, అట్టి జీవాత్మకు తానే మిత్రుడు. అయినను ఈ దేహేంద్రియములతో కూడి యున్న ఈ దేహమును జయింపలేని మనిషికి తనకు శత్రువుగా ప్రవర్తించి లక్ష్యసాధనను నాశనము చేయును.

**జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః ।**
**శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః ॥ 7**

**తాత్పర్యము:** శీతోష్ణ, సుఖదుఃఖ, మానావమానముల యందు ప్రశాంతమైన మనస్సు కలిగి, ఆత్మను స్వాధీనము నందుంచుకొన్న మనుజుడు జ్ఞానియై ఆత్మానుభవము చెదరక సచ్చిదానందస్థితుడైయుండును.

**జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః ।**
**యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః ॥ 8**

**తాత్పర్యము:** జ్ఞానము, విజ్ఞానములు కలిగియుండి, తృప్తినొందినవాడును, వికార రహితుడును, ఇంద్రియములను జయించినవాడును, మట్టిని, బంగారమును సమానముగా జూచువాడును అయినటువంటి పురుషుడు 'యుక్తుడు' అనబడును. (యుక్తుడంటే యోగయుక్తుడు)

**సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థ ద్వేష్యబంధుషు ।**
**సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥ 9**



**తాత్పర్యము:** స్వచ్ఛమైన హృదయము కలిగియున్నవారు, మిత్రులు శత్రువులు, ఉదాసీనులు, మధ్యస్థులు, బంధువులు, సత్పురుషులు, పాపులయందు – వీరి అందరియందు, సమబుద్ధి కలిగిన వానిని శ్రేష్ఠుడు అని అందురు.

**యోగీ యుంజీత సతతం ఆత్మానం రహసి స్థితః ।**
**ఏకాకీ యత చిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥ 10**

**తాత్పర్యము:** యోగి నిరంతరము ఏకాకిగా జనప్రవాహములేని స్థానమున స్థిరపడి, వశీకృతమైన దేహేంద్రియములుకలవాడై ఆశారహితుడై, నిశ్చింతుడై ఆత్మను పరమాత్మయందు ఏకాగ్రతతో లగ్నము చేయవలెను.

**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।**
**నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్ ॥ 11**

**తాత్పర్యము:** పరిశుభ్రమగు ప్రదేశమున, నేలపై దర్భలు పరచి దానిపై జింక చర్మము దానిపై వస్త్రాన్ని కప్పి ఇలా ఒకదానిపై మరియొకటి పరచి, ఎక్కువగా ఎత్తుపల్లములు లేనటువంటి ఆసనము ఏర్పరచుకొనవలెను.

**తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః ।**
**ఉపవిశ్యాసనే యుంజ్యాత్ యోగమాత్మ విశుద్ధయే ॥ 12**

**తాత్పర్యము:** అట్టి ఆసనముపై కూర్చుండి అంతరింద్రియ, బహిరింద్రియములను వశములో ఉంచుకొని ఏకాగ్ర చిత్తముతో అంతఃకరణ శుద్ధికోసము యోగమును అభ్యసించవలెను.

**సమంకాయ శిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।**
**సంపేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥ 13**

**ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః ।**
**మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥ 14**

**తాత్పర్యము:** శరీరమును, మెడను, శిరస్సును సమానముగా, నిశ్చలముగా స్థిరపరచుకొని, కదలికలులేకుండా నిలిపి, తన నాసికాగ్రముపై దృష్టిని కేంద్రీకరించి చూస్తూ బ్రహ్మచర్య వ్రతముననుండి, భయములేనివాడై స్థిరపడవలెను. అట్లు స్థిరపడి మనస్సును వశపరచుకొని నా యందే నిలిపి, నన్నొక్కడినే భావమందుంచుకొని సమాహితుడై ఉండి స్థిరపడవలెను.

**యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః ।**
**శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥ 15**

**నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః ।**
**న చాతిస్వప్నశీలస్య జాగ్రతోనైవ చార్జున ॥ 16**

**తాత్పర్యము:** ఇట్లు మనోనిగ్రహమగు యోగి నిరంతరము, ఆత్మను పరమేశ్వరుడైన నాపై కేంద్రీకరించి పరమానందమునకు నిర్వాణరూపమగు శాంతిని పొందును.

అర్జునా! అంతియేకాక అమిత ఆహారమును భుజించువానికి ధ్యానయోగము కలుగదు. అంతేకాక, అతిగా నిద్రించువానికి, అతిగా మేల్కొన్నవానికి కూడ ఉండదు.

**యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।**
**యుక్తస్వప్నావబోధస్య యోగోభవతి దుఃఖహా ॥ 17**

**యదావినియతం చిత్త మాత్మన్యే వావతిష్ఠతే ।**
**నిస్స్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥ 18**

**తాత్పర్యము:** మితమైనట్టి ఆహారవిహారాదులు అనుసరించుచు, కర్మలు మితముగా ఆచరించుచు, జాగ్రత్ స్వప్నములు మితముగా కల్గిన మనుజునికి సంసార దుఃఖనాశకమగు ఈ ధ్యానముకుదురును.

చిత్తమును ఎల్లప్పుడును వశపరచుకొని పరమాత్మయందే స్థిరముగా ఏకాగ్రతతో కేంద్రీకరించు పురుషుడు, వాంఛలు, కామముల నుండి



విముక్తుడై ఐహిక బంధములనుండి విడివడినవాడై యోగయుక్తుడని ప్రసిద్ధిపొందును.

**యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా ।**
**యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః ॥ 19**

**తాత్పర్యము:** వాయు ప్రభావములేని ప్రదేశమునందు వెలుగు దీపము చలనములేక స్థిరముగానుండును. అటులనే యోగాభ్యాసునియొక్క మనస్సు ఆత్మను వీక్షించుచూ, పరమాత్ముని ధ్యానమునందు నిమగ్నమై వికార రహితముగా, చలన రహితముగా నుండును.

**యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగ సేవయా ।**
**యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥ 20**

**తాత్పర్యము:** యోగాభ్యాసము ద్వారా నియమింపబడిన మనస్సు శాంతిని పొంది, ఎల్లప్పుడును పరిశుద్ధమైన ఆత్మను దర్శించుచు ఆనందానుభవమును పొందును.

**సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్ ।**
**వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥ 21**

**యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।**
**యస్మిన్స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥ 22**

**తాత్పర్యము:** ఇటువంటి యోగి ఇంద్రియములకు అతీతమై, పవిత్రమైనటువంటి సూక్ష్మమైనటువంటి బుద్ధిద్వారా బ్రహ్మానందమునను భవించుచు, దానియందే స్థిరముకలవాడై ఏ మాత్రమూ, ఎన్నడునూ విచలితుడుకాదు.

ఎటువంటి ప్రయోజనము పొంది, దానికంటె అధికమగు దానిని ఆశించడో అట్టి యోగి బ్రహ్మానంద స్థితిని పొందును. అటువంటి యోగిని సుఖదుఃఖాదులు చలింపజేయలేవు.

**తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।**
**స నిశ్చయేన యోక్తవ్యోయోగోఽ నిర్విణ్ణచేతసా ॥ 23**

**తాత్పర్యము:** సంసారమనెడు దుఃఖకరమైన శృంఖలములనుండి మనుజుని స్వతంత్రునిగా జేయుదానిని యోగమని తెలుసుకొనవలెను. అట్టి యోగమును విసుగులేక పట్టుదలతో చేయబడవలెను.

**సంకల్ప ప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వానశేషతః ।**
**మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః ॥ 24**

**తాత్పర్యము:** సంకల్పములమూలముగా ఉత్పత్తి అగు అన్ని కోరికలను పూర్తిగా త్యజించి, చిత్తముద్వారా, సర్వేంద్రియములను అన్ని కోణములనుండి సంపూర్ణముగా నిగ్రహించవలెను.

**శనైః శనైరుపరమేద్ బుద్ధ్యా ధృతిగ్రహీతయా ।**
**ఆత్మ సంస్థంమనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥ 25**

**యతో యతో నిశ్చలతి మనశ్చంచల మస్థిరమ్ ।**
**తత స్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్ ॥ 26**

**తాత్పర్యము:** అట్లు నిగ్రహించి బుద్ధి ద్వారా క్రమ క్రమముగా, మనస్సును ఆత్మయందు లీనమగునట్లు స్థిరమొనర్చి మెలమెల్లగా బాహ్య విషయముల నుండి విముక్తి చేయవలెను.

మనస్సు చంచలమైనది. స్థిరములేనిది. అట్టి మనస్సు ఏ ఏ విషయవాంఛలవెంట సంచరించునో వాటినుండి మరల్చి ఆత్మయందే ఉండునట్లు స్థిరముగా నిల్పవలెను.

**ప్రశాంత మనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।**
**ఉపైతి శాంత రజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥ 27**

**తాత్పర్యము:** ప్రశాంతమైన చిత్తము కలవాడును, రజోగుణరహితుడై శాంతమును పొందినవాడును, ప్రాపంచిక విషయసుఖములయందు ఆసక్తి లేనివాడును, బ్రహ్మభావమును పొందినవాడును అగు యోగి బ్రహ్మానందమును తప్పక పొందును.



**యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః ।**
**సుఖేన బ్రహ్మ సంస్పర్శం అత్యంతం సుఖమశ్నుతే ॥ 28**

**తాత్పర్యము:** ఈ విధముగా పాపములనుండి విముక్తుడైన యోగి సులభముగా బ్రహ్మసాక్షాత్కారము పొందుచు అనంతమగు సుఖమును ఆనందమును అనుభవించును.

**సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**ఈక్షతే యోగ యుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ 29**

**యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।**
**తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥ 30**

**తాత్పర్యము:** సర్వప్రాణులలో సమానముగా బ్రహ్మమును దర్శించు మానవుడు తన ఆత్మను వాటియందు స్థితమైయున్నట్లుగాను, ప్రాణులన్నింటిని తన ఆత్మయందే వీక్షించును.

ఏ మనుజుడు సర్వజీవ రాసులను ఆత్మ రూపమున నన్ను (కృష్ణపరమాత్ముని) చూచునో, నేను అట్టి జీవునికి అదృశ్యుడనుగాను. అట్లే అతడుకూడ అదృశ్యుడుకాడు.

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।**
**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥ 31**

**తాత్పర్యము:** ఎవడు, సర్వభూతములయందు సచ్చిదానంద రూపుడైనన్ను, ఆత్మ స్వరూపముగా స్థితుడైననన్ను, సమస్త విషయములయందునూ మునిగియున్నను నా యందే ప్రవర్తించుచుండును.

**ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।**
**సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమోమతః ॥ 32**

**తాత్పర్యము:** అర్జునా! ఏ యోగి సర్వప్రాణులను తనతో సమానముగా చూచుకొనుచూ, పోల్చుకొనుచూ, సుఖదుఃఖములను సమానముగా భావించునో, అట్టి యోగి అత్యంత శ్రేష్ఠునిగాను ప్రసిద్ధి పొందును. అతను సమదర్శి, ఆత్మజ్ఞాని.

**యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన ।**
**ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥ 33**

**చంచలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవద్దృఢమ్ ।**
**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥ 34**

**తాత్పర్యము:** అర్జునుడు ఇట్లు భగవానుని అడిగెను. ఓ కృష్ణా! సమత్వ భావనతోకూడిన యోగము నీచేత బోధింపబడినది. కాని, నా మనస్సుయొక్క చంచల స్వభావమువలన నేను ఆ యోగముయొక్క అచలితమగు శాశ్వతస్థితిని తెలుసుకొనజాలకయున్నాను.

కృష్ణా! మనస్సు స్థిరమైనదికాదు. చంచలమైనది. దృఢమైనదియేకాక బలమైనది. విషయవాంఛలచేత బంధింపబడునది. అటువంటి మనస్సు వాయువును నిగ్రహింపలేని విధముగా నుండును కాబట్టి, దానిని నిగ్రహించుట సాధ్యముకాదని నేను తలంచుచున్నాను.

**శ్రీభగవానుడు పలికెను**

**అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।**
**అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥ 35**

**తాత్పర్యము:** అర్జునా! అది సత్యమే. మనస్సును నిగ్రహించుటకష్టమే. కాని, ధ్యాన, అభ్యాస, వైరాగ్యముల చేతను, అనగా భోగాదులయందు తృష్ణ లేకుండుటచేతను, ఆ మనస్సు నిగ్రహింపబడుట సాధ్యమే.

**అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥ 36**



**తాత్పర్యము:** మనస్సును తన స్వాధీనములో నుంచుకొనలేని పురుషునకు యోగార్హతలేదు. అది దుష్కరము. అయినా కాని, దృఢమైన ప్రయత్నం ద్వారా దానిని పొందుట సాధ్యమే.

**అర్జున ఉవాచ**

**అయతిః శ్రద్ధ యోపేతో యోగాచ్చలిత మానసః ।**
**అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥ 37**

**తాత్పర్యము:** అర్జునుడు భగవాను నీవిధంగా అడుగుచున్నాడు. ఓ కృష్ణా! యోగాదులయందు శ్రద్ధాయుక్తుడైనను, నియమములేనివాడును, ప్రయత్నము చేయనివాడును, చలించిన మనస్సు కలవాడును అగు పురుషుడు యోగస్థితిని పొందలేడు. అట్టివాని గతి ఏమిటి?

**కచ్చిన్నోభయవిభ్రష్టః ఛిన్నాభ్రమివ నశ్యతి ।**
**అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి ॥ 38**

**ఏతన్మే సంశయం కృష్ణ! ఛేత్తు మర్హస్యశేషతః ।**
**త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥ 39**

**తాత్పర్యము:** ఓ కృష్ణా! భగవత్ప్రాప్తి పథమున బ్రహ్మజ్ఞానమూలముగా వ్యధచెందుతూ, మూఢునిగను, ఆధారరహితునినిగాను అగుచు, ఛిన్నాభిన్నమైన మేఘమువలె రెండింటికిని చెడి ఉభయభ్రష్టుడై చెడిపోవడు కదా!

కృష్ణా! నాకు కలిగిన ఈ సందేహమును పూర్తిగా నివారించుటకు యోగ్యుడగు నీవే అర్హుడవు. ఎందువలన అనగా, నీకంటె వేరగు ఋషిలేదు. ఇట్టి సంశయ నిర్మూలన వేరొకడు చేయలేడు, లభింపడు. వేరు ఋషులకుగాని, దేవతలకుగాని దీనికి నైపుణ్యము లేదు.

**శ్రీభగవాన్ ఉవాచ**

**పార్థ! నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।**
**నహి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి ॥ 40**

**ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీః సమాః ।**
**శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥ 41**

**తాత్పర్యము:** అర్జునా! అట్టివానికి ఇహలోకమున నింద, వినాశముకలుగదు. మరియును పరలోకమునందు కూడ నరకప్రాప్తికలుగదు. ఎందువలన అనగా భగవంతుని ప్రీతికొరకు తన కర్తవ్యములను, మంచికర్మలను చేయువాడు అధోగతిని పొందడు.

మరియు యోగభ్రష్టుడు పుణ్యాత్ములకు చెందు లోకములను పొంది, అనగా స్వర్గాది ఉత్తమలోకములను చేరి, అనేక సంవత్సరములుండి, పిమ్మట అచటనుండి సదాచార సంపన్నుల గృహములయందు జన్మించి సుఖించును.

**అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్ ।**
**ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥ 42**

**తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికమ్ ।**
**యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన ॥ 43**

**తాత్పర్యము:** అయినా కాని, అతడు జ్ఞానులైనటువంటి యోగులయొక్క వంశమునందే జన్మించును. ఈ విధమైన జన్మ, లోకమునందు లభించుట మిక్కిలి దుర్లభము.

అర్జునా! ఈ విధముగా యోగుల కులమందు జన్మించి, గత శరీరమునకు సంబంధించిన బుద్ధితో, ఆ జన్మలసంస్కారముచేత ప్రేరేపింపబడి, పరమాత్మ ప్రాప్తికై అత్యంత అధికముగా శ్రమించును.

**పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।**
**జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥ 44**

**ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః ।**
**అనేకజన్మ సంసిద్ధః తతో యాతి పరాంగతిమ్ ॥ 45**



**తాత్పర్యము:** అతడు తన అధీన మందు లేకపోయినా, పూర్వజన్మములో సంపాదించిన అభ్యాస ప్రభావముచేత పరమాత్ముని వైపు ఆకర్షింపబడును. అటుల వేదోక్త కర్మలఫలమును పొందినవాడై, వాటిని అనుష్ఠింప అధిగమించును.

అయితే అనేక జన్మల యందు చేసిన ప్రయత్నపూర్వక అభ్యాసము వలన యోగి పాపరహితుడై పరలోకప్రాప్తిని మోక్షమును పొంది, బ్రహ్మసాక్షాత్కారమును పొందుచున్నాడు.

**తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।**
**కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥ 46**

**యోగినామపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా ।**
**శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః ॥ 47**

**తాత్పర్యము:** యోగి తపస్సుచేయు వారికంటెను, జ్ఞానులకంటెను, శాస్త్రములను సంపూర్తిగా గ్రహించిన వారికంటెను, సకామకర్మములను అనుసరించి ఆచరించువానికంటె మిక్కిలి శ్రేష్ఠుడుగా ప్రసిద్ధిపొందును. అందువలన నీవు తత్త్వజ్ఞానివి కమ్ము.

ఏ యోగి నాయందు అంతరాత్మ శుద్ధితో, సర్వకాలములయందు, శ్రద్ధతో, భక్తితో భజించునో అట్టివాడు యోగులందరికంటెను ఉత్తముడై నాకభిమతుడగును.

***ఇట్లు ఉపనిషత్తులును బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును "శ్రీకృష్ణార్జున" సంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందలి ఆత్మసంయమ యోగము (ధ్యాన యోగమనెడి) ఆరవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

# ఏడవ అధ్యాయము

# విజ్ఞాన యోగము

భగవంతుడు సర్వాంతర్యామి. తనయందు భక్తి, జ్ఞానము కలిగియున్న మనుజులలో ఉంటాడు. కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యములను త్యజించి, భగవంతుని యందు మనస్సులగ్నము చేయడమే జ్ఞానము.

కృష్ణపరమాత్మ ఈ విధముగా ఉద్ధవునకు బోధించాడు. వారివారికి యుక్తమైన విధముగా, వివిధ మార్గములు నాచేత నిర్ణయింపబడినవి. అవి కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము ఈ మూడును కూడ శ్రేయస్కరములైన మార్గములే. శాస్త్రానుసారము కర్మలను ఆచరిస్తూ, ఇహలోక, స్వర్గలోకములయందు ఆసక్తిలేకుండా, ఇంద్రియములు, మనస్సు, బుద్ధులతో సహా విశ్వమంతా నశించునట్టిదే అని గ్రహించి, నిత్యము సత్యము అయిన ఆత్మను పొందగోరువారికి జ్ఞానయోగము వర్తింపబడును. నా యందు భక్తితో, నా అనుగ్రహముకొరకు, నా యొక్క లీలలు, వైభవములతో కూడిన నా గాధలను వినకాంక్షించువారికి, నా నామము స్మరించువారికి, నా పాదములను ఆశ్రయించే ఆకాంక్షగలవారికి భక్తియోగము వర్తించును.

శ్రీకృష్ణభగవానుడు అంటాడు. "అర్జునా! దేనిని తెలిసికొన్న తర్వాత, మరి ఏ ఇతరములు తెలిసికొన అవసరముండదో. అట్టి ఆత్మానుభవజ్ఞానమును బోధించుచున్నాను" అని.

"జ్ఞానికి నేను అత్యంతప్రియమైనవాడను" - అని ఈ జ్ఞాన విజ్ఞాన యోగ అధ్యాయములో కృష్ణపరమాత్మ విశదీకరించుచున్నాడు. ఆ ప్రయత్నముకలిగి యుండటమే విజ్ఞానము.



**శ్రీభగవాన్ ఉవాచ**

**మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్ మదాశ్రయః ।**
**అసంశయం సమగ్రం మాం యథాజ్ఞాస్యసి తచ్ఛృణు ॥ 1**

**తాత్పర్యము:** శ్రీకృష్ణభగవానుడు అంటున్నాడు. ఓ! పార్థా! నా యందే నీ మనస్సును నిలుపుము. నాకు శరణాగతుడవుకమ్ము. అటుల యోగాభ్యాసము చేయుచూ సంపూర్ణ విభూతి, బల, ఐశ్వర్యాది గుణాదులు కలిగియున్నవానిని, సమస్త ప్రాణులకు ఆత్మస్వరూపుడనైన నన్ను ఏ విధముగా తెలుసుకొనగలవో వినుము.

**జ్ఞానం తేఽహం సవిజ్ఞానమ్ ఇదం వక్ష్యామ్యశేషతః ।**
**యద్జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే ॥ 2**

**తాత్పర్యము:** నీవు ఏ ఏ విషయములను శ్రేయోమార్గములద్వారా గ్రహించిన తదుపరి, మరి ఏ ఇతర విషయములను తెలిసికొనుట మిగిలియుండవో, అట్టి విజ్ఞాన సహిత జ్ఞానమును, నీకు నేను సంపూర్ణముగా బోధించెదను.

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥ 3**

**తాత్పర్యము:** వేయిమంది మనుజులలో కేవలం ఒక్కడు మాత్రమే, భగవత్ప్రాప్తి సిద్ధించు ఆత్మజ్ఞానము కొరకు శ్రమపడును. అట్టి ముముక్షువులలోకూడ, ఒక్కడు మాత్రమే నన్ను నిజముగా తెలుసుకొంటున్నాడు.

**భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥ 4**

**అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం ।**
**జీవభూతాంమహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥ 5**

**ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।**
**అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా ॥ 6**

**తాత్పర్యము:** భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అనునట్టి ఈ ఎనిమిది విధములు నా ప్రకృతి అని గ్రహింపుము.

అర్జునా! వీటిని నికృష్టమైన 'జడ' ప్రకృతి అని చెప్పుదురు. దేని వలన ఈ విశ్వమంతయు ధరింపబడుచున్నదో అది నా ప్రకృతి. దీనినే నా చైతన్యవంతమైన ప్రకృతిగా గ్రహించుము.

చైతన్యవంతమైనవి, చైతన్యములేనివి, అయినటువంటి సర్వభూతములు, ప్రకృతినుండి ఉద్భవించినవి అని తెలిసికొనుము. నేను విశ్వమంతకును జన్మవిలీన స్థానమును. అందువలన నేనే జగత్తునకు ప్రధానమైన మూలకారణమును.

**మత్తః పరతరం నాన్యత్ కించదస్తి ధనంజయ ।**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ 7**

**తాత్పర్యము:** ధనంజయా! నాకంటె శ్రేష్టమైనది, వేరైనది, మరియొకటి ఏదియును లేదు. ఈ సర్వవిశ్వము దారమునందు గ్రుచ్చబడినమణుల సమూహములవలె నాయందు ఇమిడిపోయి ఆశ్రయించుకొనియున్నవి అని తెలిసికొనుము.

**రసోఽహమప్సు కౌంతేయ ప్రభాస్మి శశి సూర్యయోః ।**
**ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥ 8**

**తాత్పర్యము:** అర్జునా! నేను నీటియందు ద్రవపదార్థమైన సారమును. చంద్రసూర్యులయందు ప్రకాశమును వేదములయందుండు 'ఓం' కారమును, ఆకాశమునందుండు శబ్దమును, మనుజులలోనుండు పౌరుషమును అయి ఉన్నాను.



('ఓం' కార విశదీకరణ : ఋగ్వేదంలోని **"అగ్నిమీళే పురోహితమ్"** అనే మంత్రములోని "అ"ను, రెండవ వేదమైన యజుర్వేదములోని **"యోనిస్సముద్రోబంధుః** అనే మంత్రములోని 'ఉ' ను, ఇంక మూడవవేదమైన సామవేదములోని చివర ఉన్న **"అసమానాంతరమ్"** అనే మంత్రములోని 'మ్' ను– ఈ విధముగా మూడువేదాలలోనిది 'అ, ఉ, మ్' అయింది. ఈ మూడక్షరాలు గుణసంధి ప్రకారము "ఓం" కారమును, హృదయపూర్వకము గాను, విశ్వాసము, భక్తి శ్రద్ధలతోనూ జపించునట్లయిన, ఈ మూడువేదాలను ఒకేకాలంలో గానం చేసినట్లవుతుంది. అందువలననే శ్రీకృష్ణ భగవానుడు వేదములన్నిటియందును నేను 'ఓం' కారమునై ఉన్నాను అని పార్థునకు బోధించాడు.)

**పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।**
**జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥ 9**

**తాత్పర్యము:** జగత్తునందు పవిత్రమైన సువాసనను, అగ్నియందు తేజస్సును, సమస్త జీవులయందుండు ఆయువును, ప్రాణమును, తాపసులలోని 'తపస్సు'ను, శీతోష్ణాదిగుణములును నేనే అయి ఉన్నాను.

**బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।**
**బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్ ॥ 10**

**బలం బలవతాం చాహం కామరాగ వివర్జితమ్ ।**
**ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ॥ 11**

**తాత్పర్యము:** అర్జునా! నన్ను సర్వజీవులకు బీజస్థానమును నేనే అని ఎరుంగుము. బుద్ధిమంతులయందు నిబిడీకృతమైన 'బుద్ధి', ధీరులలో అంతర్లీనమై ఉండు ధైర్యమును నేనే అని గ్రహింపుము.

బలవంతులయందుండు బలోత్కర్ష అయి కామ, క్రోధములులేని, ధర్మవిరుద్ధముకాని, గృహస్థాశ్రమంలో సంతానం కోసం ఏర్పడే కామభావాన్ని నేనే అని తెలుసుకొనుము.

**యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చయే ।**
**మత్త ఏవేతి తాన్ విద్ధి న త్వహం తేషు తే మయి ॥ 12**

**తాత్పర్యము:** అంతేగాక, ఏ ఏ సత్త్వ, రాజస, తామస భావములు, గుణములు కలవో, అవన్నియు నా నుండే ఏర్పడుచున్నవని ఎరుంగుము. కాని, నేను వాటి ఆధీనములోలేను. అవన్నియు నా ఆధీనములో ఉన్నవి.

**త్రిభిర్గుణమయైర్భావైః ఏభిః సర్వమిదంజగత్ ।**
**మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥ 13**

**తాత్పర్యము:** ఈ సాత్త్విక, రాజస, తామస రాగద్వేష మోహాది గుణప్రభావము చేత ఈ విశ్వమంతయు మోహింపబడుచున్నది. ఈ మూడు గుణములకంటెను నేను విలక్షణుడను, శ్రేష్ఠుడను. నేను శాశ్వతుడను. నన్ను ఈ ప్రాణిసమూహము తెలుసుకోలేకపోతున్నది.

**దైవీహ్యేషా గుణమయీ, మమమాయా దురత్యయా ।**
**మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥ 14**

**తాత్పర్యము:** ఈ అనుభవ సిద్ధమగు త్రిగుణములు అలౌకికమైనవి. నా మాయను అతిక్రమించడం ఎవ్వరికీ సాధ్యంకాదు. ఏ మానవుడు దీనిని గ్రహించి, సంపూర్తిగా కేవలం నన్నే ఆశ్రయించి శరణుపొందుచున్నాడో, అట్టి మానవుడు నా మాయనుండి విముక్తి పొందుచున్నాడు.

**న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః ।**
**మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః ॥ 15**

**చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున ।**
**ఆర్తో, జిజ్ఞాసు, రర్థార్థీ, జ్ఞానీ చ భరతర్షభ ॥ 16**

**తాత్పర్యము:** మూఢులు, పాపులు, వివేకహీనులును, ఆసురీ స్వభావము కలవారు, దుష్టకార్యములను చేయువారును నన్ను ఆశ్రయింపరు, భజింపరు.



వారు నన్ను ఎప్పటికీ చేరరు. ఓ అర్జునా! దంభము, దర్పము, అభిమానము, క్రోధము, పారుష్యము- ఇవి ఆసురీస్వభావము కలవారి లక్షణములు. కష్టాలలో చిక్కుకొన్న దుఃఖితులును, తత్త్వజ్ఞానార్థులును, శుభకర్మలను చేయుచు సంపదలను కాంక్షించువారు, పరమాత్మునియొక్క ప్రాప్తిని పొందిన జ్ఞానులును - అగు ఈ నాలుగు విధముల భక్తజనులు నన్ను ఆశ్రయించి భజించుచున్నారు.

**తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।**
**ప్రియో హి జ్ఞానినోత్యర్థం అహం స చ మమప్రియః ॥ 17**

**తాత్పర్యము:** ఆ నలుగురిలో నాయందే ఎల్లపుడును స్థిరమగు భక్తిభావముతో, పరమాత్మ జ్ఞానమును కలిగియున్నవాడును, నా యందే మనస్సు నిల్పినవాడు శ్రేష్ఠుడు నాకు ప్రియుడు. అంతేకాక, నేను అతనికి మిక్కిలి ఇష్టుడను.

**ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।**
**ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥ 18**

**తాత్పర్యము:** ఈ చతుర్విధభక్తులందరూకూడ గొప్పవారే. కాని, తత్త్వజ్ఞుడు మాత్రమే నా ఆత్మ స్వరూపుడు. ఎందువలననగా, ఏకాగ్రతగల మనస్సు కలవాడు, నాయందే లీనమై, నన్నే ఆశ్రయించుకొని, స్థిరుడై ఉన్నాడు.

**బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।**
**వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥ 19**

**తాత్పర్యము:** అనేక జన్మల అనంతరము, తత్త్వజ్ఞాని, అనగా పరమాత్మ తత్త్వమును గ్రహించిన జ్ఞాని, ఈ చరాచర విశ్వమంతయు వాసుదేవుడే అని భజించును. కాని, అట్టి మహాత్ములు చాలా అరుదుగానుందురు.

**కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్య దేవతాః ।**
**తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా ॥ 20**

**తాత్పర్యము:** భార్యా, పుత్ర, పశు, స్వర్గాది భోగవాంఛలచేత మునిగిపోయిన వారి జ్ఞానము నశింపబడును. అట్టి స్వభావముతో ప్రేరేపింపబడినవారై, వాసుదేవునికంటె ఇతర దేవతలను ఆరాధించుచూ సేవింతురు.

**యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి ।**
**తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥ 21**

**స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధనమీహతే ।**
**లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్ ॥ 22**

**తాత్పర్యము:** ఏ ఏ భక్తుడు ఏ ఏ దేవతామూర్తిని శ్రద్ధతో, భక్తితో ఆరాధనను చేయుటకు ఇచ్ఛగించునో, ఆ యా దేవతామూర్తియందే, అతనికి చలనము లేని భక్తిని నేను కలగజేయుదును. ఆ భక్తుడు అటువంటి శ్రద్ధతో కూడినవాడై ఆ దేవతను ఇష్టముతో ఆరాధన చేయును. అపుడు నా అనుగ్రహముచేతనే, విధింపబడిన భోగములను సందేహములేకుండా ఆ దేవతనుండే పొందుచున్నాడు.

**అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్ ।**
**దేవాన్ దేవయజో యాంతి మద్భక్తాయాంతి మామపి ॥ 23**

**అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మామ బుద్ధయః ।**
**పరం భావమజానంతో మమావ్యయ మనుత్తమమ్ ॥ 24**

**తాత్పర్యము:** అల్పబుద్ధులకు లభించిన ఫలము శాశ్వతముకాదు. ఏ దేవతలను పూజించు మనుజులు ఆ దేవతలనే పొందుదురు. కాని నన్ను పూజించు భక్తులు తప్పక నన్నే పొందుచున్నారు. ఇందు సందేహములేదు.

వివేకహీనులు నా యొక్క ఉత్తమము, ఉన్నతము, శాశ్వతమైనట్టి, శ్రేష్టమైనట్టి నా స్వరూపమును, భావమును గ్రహించలేక, ఎరుంగక, రూపరహితుడనైన, ఇంద్రియములకు, మనస్సు గోచరించక అతీతుడనైన,



పరమాత్ముడనైన నన్ను, రూపమున్నవానిగను, సామాన్యునిగను తలంచుచున్నారు.

**నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః ।**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మామజ మవ్యయమ్ ॥ 25**

**తాత్పర్యము:** నేను యోగమాయచేత కప్పబడియున్నాను. అందువలన నేను గోచరుడను. ఏ వ్యక్తికిని కనబడనివాడను. మూఢలోకము, అజ్ఞానముతో, జన్మరహితుడను, క్షయములేని వాడనైన నన్ను గ్రహించలేకున్నది.

**వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।**
**భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ 26**

**ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వంద్వమోహేన భారత ।**
**సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప ॥ 27**

**తాత్పర్యము:** అర్జునా! భూతకాలమున ఉన్నవి, వర్తమానకాలమున జన్మించినవి, భవిష్యత్కాలమున పుట్టు ప్రాణులన్నింటిని నేను ఎరుగుదును, నాకు తెలియును. కాని, నన్ను ఏ జీవుడు ఎరుగడు.

పార్థా! పుట్టుకతోడనే, ఇష్టానిష్ట రాగద్వేషాదులవలన కలిగిన, సుఖదుఃఖద్వయములకారణముగా, సమస్త జీవరాసులు అంతులేని వ్యామోహమును పొందుచున్నారు.

**యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।**
**తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః ॥ 28**

**తాత్పర్యము:** కాని, ఏ పుణ్యపురుషుల పాపములు నశించినవో అటువంటివారు, సుఖదుఃఖాది ద్వంద్వమోహములనుండి విముక్తులై నన్ను భజించుచున్నారు.

**జరామరణమోక్షాయ మా మాశ్రిత్యయతంతి యే ।**
**తే బ్రహ్మ తద్విదుః కృత్స్నం అధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥ 29**

**తాత్పర్యము:** జరామరణములనుండి విముక్తులగుటకు నన్నే ఆశ్రయించి, ప్రయత్నించు పురుషులు, ఆ బ్రహ్మమును సమగ్రముగను, సంపూర్ణమైన ఆ ధ్యానమును, అట్టిసాధన పూర్ణమగు కర్మమును గ్రహించగలరు.

**సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।**
**ã ǂ ¶} Hê.ఽ పిచమాం తే విదుర్యుక్త చేతసః॥ 30**

**తాత్పర్యము:** మరియు ఏ పుణ్యపురుషులు, అధిభూత, అధిదైవముల, అధియజ్ఞములతో కూడియున్న ఆత్మస్వరూపుడైన నన్ను తెలిసికొందురో, అటువంటి పురుషులు, సమాహితమైన, నిశ్చలమైన బుద్ధి కలిగియున్నవారై నన్ను గ్రహించగలరు. నన్ను వారి వారి మృత్యుకాలమునందు గూడవ్యాకుల చిత్తములేనివారై విస్మరింపరు. నన్నే తలంతురు. అట్టి నా భక్తులు భ్రష్టగతిని పొందరు.

***ఇట్లు ఉపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జునసంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందు, విజ్ఞానయోగము అనే ఏడవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి
## ఎనిమిదవ అధ్యాయము
## అక్షరపరబ్రహ్మయోగము

గత ఏడు అధ్యాయములలోను, ప్రాణులయొక్క జీవన సంబంధమైన నిర్ణయము, కర్మము, జ్ఞానముల తత్త్వములు, ధ్యానము ఇత్యాది ప్రక్రియలు, అధి భూతము, అధి దైవము, అధి బ్రహ్మము, ఆధ్యాత్మము, అధి యజ్ఞము, ఇత్యాది క్రియలను కృష్ణభగవానుడు ప్రవేశపెట్టెను. ఆత్మయే బ్రహ్మము, పరమాత్మ నిరతిశయము.

ఈశ్వరుడే సృష్టికర్త. కర్మఫలములను ప్రసాదించు దాత. జీవుడు కర్మాధికారి. ఆ పరమాత్మయే జీవన మరణములను నిర్ణయించువాడు. ప్రతి జీవి ముక్తుడయేందుకు ప్రయత్నించును. అది సంభవమా? మరణించేలోపుగా తరించుట సంభవమా? మరణము అనివార్యము. అయితే పునర్జన్మ అంటూ ఉన్నదా. మరణానంతరము జీవి ఏమౌతున్నాడు. జీవికి మరణానంతరము మోక్షము అనేది లభించునా. లభించినట్లయిన ఎట్టిజీవికి ఏ విధముగా లభించును. ఒక్క హైందవ సిద్ధాంతమునకే "పునర్జన్మ" సిద్ధాంతము ఉన్నట్లు తోచుచున్నది. (ఇతర మతాల్లో కూడ ఉన్నాయి.)

అక్షరము అనగా "క్షరము" కానిది. నాశనములేనిది. స్థిరమైనది. అవ్యక్తమైనది. పరబ్రహ్మము ప్రణవస్వరూపము. శ్రీకృష్ణపరమాత్మ సర్వదేవతామయుడు. అక్షరమైన, వ్యక్తరహిత సుగుణాలకు కూడ అతీతమయినది పరబ్రహ్మము. శ్రీకృష్ణునికంటె మరియొక పరతత్త్వములేదు. "ఓం"కారము మూడు వేదములసారము. అట్టి 'ఓం'కారము కూడ ఈ 8వ అధ్యాయమున పరిశీలింపబడి, విశదీకరించబడినది.

**ఓం అర్జున ఉవాచ**

**కిం తద్బ్రహ్మ? కిమధ్యాత్మం? కిం కర్మ? పురుషోత్తమ ।**
**అదిభూతం చ కిం ప్రోక్తం? అధిదైవం కిముచ్యతే? ॥ 1**

**తాత్పర్యము:** అర్జునుడు అడుగుచున్నాడు. ఓ పురుషోత్తమా! బ్రహ్మము అనగా ఏమిటి? కర్మ అనగా ఏమిటి. అధ్యాత్మము, అది భూతము, అది దైవము వీటిని విపులీకరించుము.

**అధి యజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన ।**
**ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥ 2**

**తాత్పర్యము:** ఓ కృష్ణపరమాత్మా! అధి యజ్ఞమనగా ఏమిటో వివరించు. అది ఈ శరీరమందు ఏ విధముగా ఉండును. మరియు మరణమాసన్నమైన సమయమున, నీయందే వారి బుద్ధిని కేంద్రీకరించు యోగులచే నీవు ఎట్లు గ్రహించబడగలవు.

**శ్రీ భగవాన్ ఉవాచ**

**అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే ।**
**భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥ 3**

**తాత్పర్యము:** పరమైనది, క్షయముకానిది, సర్వశ్రేష్ఠమైనది, శాశ్వతమైనది. నాశరహితమైనది. అదియే బ్రహ్మము. అధ్యాత్మము అని తెలియబడుచున్నది. పరమాత్మయందు లీనమగు సర్వప్రాణులను బహిరంగపరచి, వాటి ఉత్పత్తి, తదనంతరము, అభ్యుదయమునకు కారణభూతమైనదానిని కర్మ అని అందురు.

**అధి భూతం క్షరో భావః పురుషశ్చాధి దైవతమ్ ।**
**అధి యజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర ॥ 4**

**తాత్పర్యము:** శరీరధారులందరిలో ప్రముఖుడవు, ఉన్నతుడవు అగు అర్జునా! ఉత్పత్తి అగుచు, తరువాత నశించుచూ యుండు పదార్థములు, పదార్థతతి అధి భూతములని అందురు. ఇది ప్రతిజీవిని అనుసరించియే యుండును. హిరణ్యగర్భుడు అధి దైవతము. శరీరములలో అంతర్లీనముగా నున్నటువంటి నేనే అధి యజ్ఞమును. యజ్ఞముల ఫలములయొక్క దాతను నేనే.



**అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కలేబరమ్ ।**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥ 5**

**తాత్పర్యము:** మృత్యుకాలమునందు ఏ మనుజుడు కేవలం నన్నే మనస్ఫూర్తిగా స్మరించుచు తన దేహమును విడిచిపోవునో, అట్టి పురుషుడు, నిస్సందేహముగా నన్నే పొందును.

**యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కలేబరమ్ ।**
**తం తమేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః ॥ 6**

**తాత్పర్యము:** అర్జునా! ఏ మనుజుడు అంత్యకాలమునందు ఏ భావమును, ఏ దేవతా విశేషమును తలంచుచు, స్మరించుచూ వాని శరీరమును త్యజించుచున్నాడో ఆయా దేవతాస్వరూపము చేత తప్పక ప్రభావితమగుచు, ఆయా దేవతనే పొందును.

**తస్మాత్ సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ ।**
**మయ్యర్పిత మనోబుద్ధిః మా మేవైష్యస్య సంశయః ॥ 7**

**తాత్పర్యము:** కావున పార్థా! సర్వకాలములయందు, సర్వసమయముల యందు నన్నే స్మరించుచు సమరము చేయుము. నాయందే నీ మనోబుద్ధులను ఏకాగ్రతతో కేంద్రీకరించుము. అపుడు నిస్సందేహముగా నన్నే పొందుదువు.

**అభ్యాస యోగయుక్తేన చేతసా నాన్యగామినా ।**
**పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥ 8**

**తాత్పర్యము:** అర్జునా! అభ్యాసమున ధ్యానయోగమునందే నీ మనస్సు కూడియుండి తదితర విషయముల మీదకు చిత్తము పోకుండా ఏ మనుజుడు పరమశ్రేష్ఠుడైన, జ్యోతిర్మయుని స్మరించునో ఆ పురుషోత్తమునే నిస్సందేహముగా పొందును.

**కవిం పురాణ మనుశాసితారమ్**
**అణోరణీయాంసమనుస్మరేద్యః ।**
**సర్వస్య ధాతార మచింత్యరూపమ్**
**ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ 9**

**ప్రయాణకాలే మనసాచలేన**
**భక్త్యా యుక్తో యోగబలేన చైవ ।**
**భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్**
**స తం పరం పురుషముపైతి దివ్యమ్ ॥ 10**

**తాత్పర్యము:** పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. అనాది అయిన తాను యావత్ విశ్వజనులను శాసించు ప్రతిభాశాలి. అణువుకంటెను సూక్ష్మాతి సూక్ష్మ స్వరూపుడు. ఆదిత్యునివలె సర్వకాలములయందు ప్రకాశించువాడు. అజ్ఞానమును నశింపజేసి జ్ఞానమును నింపువాడు. మోహాంధకారమునకు దూరముగా నుండువాడు. అటువంటి పురుషోత్తముని, పరమాత్మను ఏ మనుజుడు సర్వకాలములయందు స్మరించుచుండునో, అటువంటి భక్తుడు మరణ సమయమునందు ప్రాణమును స్తంభింపచేసి, నిర్మలమైన ఏకాగ్రమైన చిత్తముతో స్మరించునో అట్టి భక్తుడు, శ్రేష్ఠుడును, జ్యోతిర్మయుడును అగు పరమాత్మనే పొందుననుటలో సందేహములేదు.

**యదక్షరం వేదవిదో వదంతి**
**విశంతి యద్యతయో వీతరాగాః ।**
**యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి**
**తత్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥ 11**

**తాత్పర్యము:** వేదజ్ఞులైన విద్యావేత్తలు ఏ వినాశనములేని సచ్చిదానంద పురుషోత్తముని, శాశ్వతునిగా తెలియచేయుచున్నారో, విషయాసక్తి రహితులు ఏ పరమపదమును ఆశ్రయించి, చేరుచున్నారో, ఏ ధ్యేయమును కోరి



బ్రహ్మచర్యమును పాటించుచున్నారో, అటువంటి బ్రహ్మపదమును గురించి సంక్షిప్తంగా చెబుతాను.

**సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్య చ ।**
**మూర్ధ్న్యా ధ్యాయాత్మనః ప్రాణం ఆస్థితో యోగధారణామ్ ॥12**

**ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాంగతిమ్ ॥ 13**

**తాత్పర్యము:** ఎవడు ఇంద్రియములన్నింటిని నియమించి, నిగ్రహించుకొని, మనస్సును హృదయములో నిలిపి, ఆ విధముగా ప్రాణమును నిలిపి ఉంచి, "ఓం" అను ఏకాక్షరమును స్మరిస్తూ, ఉచ్చరిస్తూ, నిర్గుణ బ్రహ్మ అయిన నన్ను ఏకాగ్రతతో తలంచుచున్నాడో, అట్లు దేహత్యాగమును చేయుచున్నాడో, అట్టి పురుషుడు మోక్షమును పొంది నన్నే చేరుచున్నాడు.

**అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।**
**తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥ 14**

**తాత్పర్యము:** అర్జునా! ఎవడు ఏకాగ్రమైన మనస్సుతో తన చిత్తమున సుదీర్ఘ జీవితకాలము పరమాత్ముడనైన నన్ను స్మరించుచుండునో, అటువంటి యోగికి నేను సులభుడను, సన్నిహితుడను.

**మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్ ।**
**నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ॥ 15**

**తాత్పర్యము:** సర్వవిధముల అత్యంత ఉత్తమమైన మోక్షమును పొందిన మహాత్ములు, నన్ను చేరిన తరువాత, అనిత్యము, దుఃఖభూయిష్ఠమైన, పునర్జన్మను పొందరు. ఇది సత్యము.

**ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।**
**మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ నవిద్యతే ॥ 16**

**తాత్పర్యము:** బ్రహ్మలోకమునుండి భూలోకములవరకు ఉన్నటువంటి అన్ని లోకములు పునర్జన్మతో కూడియున్నవే అని గ్రహింపుము. అయితే ఏ భక్తుడు నన్ను పొందునో అట్టి పరమభక్తునకు పునర్జన్మ అనేది ఉండనే ఉండదు అని గ్రహింపుము.

**సహస్రయుగ పర్యంతం అహర్యద్బ్రహ్మణో విదుః ।**
**రాత్రిం యుగ సహస్రాంతాం తేఽహోరాత్రవిదోజనాః ॥ 17**

**అవ్యక్తా ద్వ్యక్తయః సర్వాః ప్రభవంత్యహరాగమే ।**
**రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్త సంజ్ఞకే ॥ 18**

**తాత్పర్యము:** పగలు, రాత్రుల తత్త్వమును తెలుసుకొనిన, వేయిచతుర్యుగముల కాలము బ్రహ్మకు ఒక పగలు అనియు, అటువంటి వేయి యుగముల పరిమితియున్న కాలము బ్రహ్మకు రాత్రిగాను గ్రహించిన యోగపురుషులు కాలతత్త్వమును ఎరిగిన మహానుభావులు అని తెలిసికొనుము. బ్రహ్మకు పగలు ఆరంభమవగానే, అవ్యక్త రూపము అగు బ్రహ్మయొక్క సూక్ష్మమైన దేహమునందు ఈ చరాచర వస్తువులన్నియు తప్పక లీనమగును అనుటలో సందేహములేదు.

**భూత గ్రామః స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే ।**
**రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే ॥ 19**

**తాత్పర్యము :** ఓ అర్జునా! పూర్వమునుంచి ఉండిన ఈ ప్రాణి సమూహము, తిరిగి తిరిగి జన్మించి, ప్రకృతి వశమైన, బ్రహ్మయొక్క రాత్రి అయినపుడు లీనమగును. బ్రహ్మయొక్క పగటికాలము ఆరంభమైనపుడు తిరిగి పుట్టుచున్నవి.

**పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్ సనాతనః ।**
**యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ 20**

**తాత్పర్యము:** అయితే ఆ బ్రహ్మయొక్క సనాతనమైన, ఇంద్రియాలకు అగోచరమైన, విలక్షణమైనదైన మరియొక బ్రహ్మ స్వరూపముకలదో అది



సమస్త భూతములు, నశించి, వినష్టమైనను నశించిపోదనుటలో సందేహములేదు.

**అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః తమాహుః పరమాం గతిమ్ ।**
**యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥ 21**

**తాత్పర్యము:** అక్షరం అవ్యక్తము. వినాశముకానిది. దీనినే శ్రేష్ఠమగు పరమగతి అని అందురు. అవ్యక్త భావమనికూడ చెప్పుదురు. ఆ పరమగతిని పొందిన జీవులు తిరిగిరారు. అదియే శ్రేష్ఠమైనటువంటి నా స్వరూపము.

**పురుషః స పరః పార్థ! భక్త్యా లభ్యస్త్వనన్యయా ।**
**యస్యాంతఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥ 22**

**యత్రకాలే త్వనావృత్తిం అవృత్తిం చైవ యోగినః ।**
**ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥ 23**

**తాత్పర్యము:** అర్జునా! సర్వప్రాణులును ఏ సచ్చిదానంద పరమేశ్వరుని యందు అంతర్లీనములై యున్నవో, ఈ సమస్త విశ్వము వ్యాపించినదై యున్నదో, అట్టి పురుషోత్తముడు ఏకాగ్రత కలిగిన భక్తితో మాత్రమే లభ్యము అగును.

ఓ అర్జునా! ఏ సమయమున, ఏ మార్గమున దేహత్యాగమును చేసిన యోగులు తిరిగిరాని గతిని పొందెదరో, మరియు పునర్జన్మను పొందుదురో ఈ రెండు కాలముల గురించి విశదీకరించెదను.

**అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ ।**
**తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదోజనాః ॥ 24**

**తాత్పర్యము:** అగ్ని, జ్యోతి, శుక్లపక్షము, పగలు ఆరు మాసములుగల ఉత్తరాయణము ఈ మార్గము అభిమానదేవతలు కలవి. ఈ మార్గముద్వారా ప్రయాణముచేసిన బ్రహ్మవేత్తలగు మనుజులు, బ్రహ్మమునే పొందుచున్నారు.

**ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।**
**తత్ర చాంద్రమసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే ॥ 25**

**తాత్పర్యము:** ధూమము, రాత్రి, కృష్ణపక్షము, ఆరుమాసములు దక్షిణాయనము ఈ మార్గమునందు ప్రయాణించిన యోగి, కర్మపరుడు, చంద్రలోకమునకు వెడలి తిరిగి పునర్జన్మనుపొంది వచ్చుచున్నాడు.

**శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే ।**
**ఏకయా యాత్యనావృత్తిం అన్యయావర్తతే పునః ॥ 26**

**తాత్పర్యము:** ఈ విశ్వమునకు శుక్లము దేవయానము, కృష్ణము దక్షిణమార్గము. ఈ రెండు మార్గములు సనాతములైనవి. నిత్యములు, శాశ్వతములు, శుక్లమాన మార్గమున వెళ్ళువాడు మోక్షమును పొందును. కృష్ణమార్గమున వెళ్ళువాడు తిరిగివచ్చును.

**నైతే సృతీ పార్థ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన ।**
**తస్మాత్ సర్వేషు కాలేషు యోగ యుక్తో భవార్జున ॥ 27**

**తాత్పర్యము:** అర్జునా! ఈ పై రెండుమార్గములను తెలుసుకొన్నటువంటి, ఉపాసకుడు మోహాదులను పొందడు. అందువలన, నీవు ఎల్లప్పుడును నన్నే పొందుటకు మనస్ఫూర్తిగా ప్రయత్నించి ధన్యుడవుకమ్ము.

**వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ**
**దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।**
**అత్యేతి తత్సర్వమిదం విదిత్వా**
**యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ ॥ 28**

**తాత్పర్యము:** యోగి అయిన పుణ్యపురుషుడు, వేదములయందు, యజ్ఞములయందు, తపోదానాదులయందును కలుగుతున్న ఏ పుణ్యఫలములను శాస్త్రములు విశదీకరించినవో వాటిని గ్రహించి



అనుష్ఠానము చేయు యోగి తన ధ్యానాదులతో సర్వమును అతిక్రమించును. యోగైశ్వర్యమునుకూడా పొందుననుటలో సందేహములేదు. మరియు ఉత్కృష్టమైన బ్రహ్మపదమును పొందును.

***ఇట్లు ఉపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందలి అక్షర పరబ్రహ్మయోగమనెడి ఎనిమిదవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

## తొమ్మిదవ అధ్యాయము

## రాజవిద్యా రాజగుహ్య యోగము

మాతృదేవోభవ. పితృదేవోభవ. ఆచార్యదేవోభవ అన్నారు. తల్లి జననము నిచ్చును. తండ్రి జీవితాన్నిచ్చును. ఆచార్యుడు జ్ఞానమునిచ్చును. ఇచట ఆచార్యుడు శ్రీకృష్ణభగవానుడు. అర్జునుని ద్వారా విశ్వజనులకు విద్యలలో విద్యయై రాజవిద్య అయినది, తెలుసుకొనినను తెలియబడరానిది, రాజగుహ్యమై పేరొందినదైన దానిని బోధించెను.

విద్య నిగూఢ గుప్తమగు విత్తము. పూరుషాలికి రూపము. సంస్కృతమున "విద్" అను ధాతువునుండి "విద్య" అనుపదము పుట్టినది. అనగా ప్రతిమనుజుడు తెలిసికొనితీరవలసినదని అర్థము. ఎన్ని విద్యలను అవగతము చేసుకొన్నా ఏదో ఒక లోపముమనుజునకు కలుగుచున్నది. అన్ని విద్యలను నేర్చినవాడు అయినను తెలిసికొన్నట్టు భావించునేకాని, తన హృదయములో వాటిని మథించుకొనే నైపుణ్యముండుటలేదు. అట్టిదానిని మననము చేసుకొని హృదయాంతర్భాగములో పదిలపరచుకొన లేకున్నాము. అట్లు చేయుటయే విద్యలలోకెల్ల "విద్య" వేదాంతవిద్య, రాజ విద్య. బ్రహ్మమును అవగతము చేసుకొని, భ్రమలను నశింపజేయునదే "బ్రహ్మవిద్య, రాజవిద్య".

శ్రీకృష్ణభగవానుడు ఈ అధ్యాయములో మొదటి శ్లోకములోని **"జ్ఞానం విజ్ఞాన సహితం యద్‌జ్ఞాత్వా మోక్ష్యసేఽ శుభాత్"**తో ప్రారంభిస్తాడు. అంటే అర్జునునితో ఈ విధంగా అంటున్నాడు. "అనుభవముతో కూడుకొన్నట్టిది, విజ్ఞానసహితమైనది అయిన ఈ జ్ఞానమును, అసూయలేని నీకొరకు బోధించుచున్నాను. దేనిని తెలిసికొన్న తదనంతరము, మోక్షార్హుడో అటువంటి రహస్యములను నీకు విశదీకరించెదను" అని.



ఈ అధ్యాయము మనఃపూర్వకముగా పఠించి అర్థము చేసుకొన్నవారికి "స్ఫూర్తి"ని కలుగజేయును. శాంతిభిక్షను ప్రసాదించును. ఆత్మబోధ జేసుకొనవలెను. అపుడు ఇతరులకు ప్రబోధించుటకు అర్హతకలుగుతుంది. దానాలన్నింటిలోను అధ్యాత్మ విద్యాదానం శ్రేష్ఠమైనది. భగవంతుడు భక్తులను తండ్రివలె దండించి సన్మార్గములో పెట్టును. గురువు (ఇచట శ్రీకృష్ణభగవానుడు) బోధించిన అధ్యాత్మా విద్యను గ్రహించి, గుర్తుంచుకొనిన అదియే "మంత్రము".

**శ్రీభగవాన్ ఉవాచ**

**ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే ।**
**జ్ఞానం విజ్ఞానసహితం యద్‌జ్ఞాత్వా మోక్ష్యసేఽ శుభాత్ ॥ 1**

**తాత్పర్యము:** శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు. ఎటువంటి దానిని గ్రహించిన తర్వాత, ఈ భౌతిక సంసారబంధమునుండి విముక్తుడుకాగలవో, అట్టి ఈ పరమ రహస్యమైనదియు, విజ్ఞానముతో కూడినదియు, అనుభవయుక్తమగునవి అసూయలేని నీకు బోధించుచున్నాను.

**రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్ ।**
**ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్ ॥ 2**

**తాత్పర్యము:** విజ్ఞానముతో కూడిన ఈ బ్రహ్మవిద్య, సకలవిద్యలలోకెల్ల ఉత్కృష్టమైనది. (శిరోభూషణము. అంతియేకాక విశుద్ధమైనది) ప్రత్యక్ష ఫలము నొసంగునది. ధర్మసంగతము. అనుష్ఠించుటకు మిక్కిలి తేలిక అయినది. శాశ్వతమైనది.

**అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।**
**అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసార వర్త్మని ॥ 3**

**తాత్పర్యము:** అర్జునా! బ్రహ్మజ్ఞానమనబడే ఈ పై పేర్కొనబడిన ధర్మమున విశ్వాసము, శ్రద్ధలేనటువంటి మనుజులు, నన్నుపొందలేక మృత్యుసంకులమగు సంసారబంధ మార్గమున ప్రయాణించుచున్నారు.

**మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।**
**మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వతస్థితః ॥ 4**

**తాత్పర్యము:** అవ్యక్తమూర్తిని, నిరాకారమూర్తినైన నా చేత ఈ విశ్వమంతయు వ్యాపించి పరిపూర్ణమై ఉన్నది. ప్రాణులన్నియు నాయందే ఇమిడియున్నవి. కాని నేను వాటియందు ఆధారపడియుండిన వానినికాదు.

**న చ మత్థ్సాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్ ।**
**భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ॥ 5**

**తాత్పర్యము:** అసాధారణమగునట్టిది, ఈశ్వరీయమైనట్టిది అగు నా స్వరూపము వీక్షించుము. అది ప్రాణులన్నింటిని భరించునది, పోషించునది, వాటియందు నేను లేను. నా ఆత్మ వాటియందు ఉండుటలేదు.

**యథాకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగో మహాన్ ।**
**తథా సర్వాణి భూతాని మత్థ్సానీ త్యుపధారయ ॥ 6**

**తాత్పర్యము:** ఆకాశమునంతటిని వాయువు వ్యాపించి, ఎల్లప్పుడును అట్లే స్థిరమై వెలసియుండును. ఆ విధముగానే, సమస్త జీవులు నా సంకల్పమువలన నాయందే స్థిరముగా వెలసియున్నవని గ్రహించుము.

**సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్ ।**
**కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ॥ 7**

**తాత్పర్యము:** అర్జునా! సర్వభూతములు ప్రళయకాలమందు త్రిగుణాత్మకమగు నా మాయయందు లీనమగుచున్నవి. అంతేకాక, తిరిగి సృష్టి సమయమందు, ఆ ప్రాణులన్నింటిని నేను సృష్టించుచున్నాను.

**ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః ।**
**భూతగ్రామమిమం కృత్స్నం అవశం ప్రకృతేర్వశాత్ ॥ 8**

**తాత్పర్యము:** నేను స్వయముగా ప్రకృతిని మాయను వశమందుంచుకొని పరతంత్రమై యున్నటువంటి, ఆయా ప్రాణుల పూర్వసంస్కారముల



ప్రకారము, వాటి వాటి స్వభావముల కనుగుణ్యముగా, నేనే మరల మరల సృష్టించుచున్నాను.

**న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ ।**
**ఉదాసీనవదాసీనం అసక్తం తేషు కర్మసు ॥ 9**

**తాత్పర్యము:** అర్జునా! ఆ కర్మలయందు నేను ఆసక్తిలేనివాడను. ఉదాసీనుడను. ఆ కారణముచే ఆ కర్మములు నన్ను బంధించవు.

**మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।**
**హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే ॥ 10**

**తాత్పర్యము:** పార్థా! మాయకు నేను సాక్షిని. త్రిగుణమయమగు మాయ ఈ చరాచర విశ్వమును సృష్టించుచున్నది. ఈ కారణముచేత వ్యక్తావ్యక్తములగు జగత్తు వివిధ రూపములుగా పరిభ్రమించుచున్నది.

**అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్ ।**
**పరం భావమజానంతో మమ భూతమహేశ్వరమ్ ॥ 11**

**తాత్పర్యము:** సర్వప్రాణులకు పరమేశ్వరుడగు నా పరతత్త్వమును గ్రహించలేక జ్ఞానహీనులు ఈ మానవశరీరమును ధరించిన నన్ను సాధారణ మానవునిగా తలంచుతూ అవమానపరచుచున్నారు.

**మోఘాశా మోఘకర్మాణోమోఘజ్ఞానా విచేతసః ।**
**రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ 12**

**తాత్పర్యము:** వ్యర్థములైన ఆశలు, కర్మలుకలవారు, వివేకశూన్యులు, అజ్ఞానులు, రాజసము, మోహస్వభావమునే ఆశ్రయించుచున్నారు. ఆ విధముగా జ్ఞానవిహీనులై నన్ను అవమానించుచుండిరి.

**మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతిమాశ్రితాః ।**
**భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ ॥ 13**

**తాత్పర్యము:** అర్జునా! సాత్త్వికులు, మహాత్ములు అయినట్టి పురుషులు దైవీప్రకృతిని ఆశ్రయించి, సర్వభూతకారణుడు, వినాశనములేనివాడిని అగు నన్ను గ్రహించి చలనములేని మనస్సుతో నన్ను సర్వకాలములయందు భజించుచున్నారు.

**సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢ వ్రతాః ।**
**నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥ 14**

**తాత్పర్యము:** చెదరని భక్తితో ప్రీతితో దృఢమైన నిష్ఠకలవారు, అత్యంత ప్రేమతో, అనురాగంతో నా ధ్యానమునందే నిమగ్నులై, అన్ని వేళలయందు సమగ్రమైన మనస్సుతో నన్ను ఉపాసించుచున్నారు.

**జ్ఞాన యజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే ।**
**ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥ 15**

**తాత్పర్యము:** మరికొందరు భగవంతుని సంబంధించిన జ్ఞాన యజ్ఞముద్వారా విరాట్ స్వరూపుడనైన, విశ్వరూపుడు అయిన నన్ను బహురూపునిగా ఉపాసించుచున్నారు.

**అహం క్రతురహం యజ్ఞః స్వధాహమహమౌషధమ్ ।**
**మంత్రోఽహ మహమే వాజ్యం అహమగ్నిరహం హుతమ్ ॥16**

**తాత్పర్యము:** నేనే క్రతువును. నేనే యజ్ఞమును, నేనే పిండమును, నేనే మంత్రమును, నేనే హవిస్సును, అగ్నిహోత్రము నేనే, యజ్ఞకర్మమూ నేనే. సర్వమును నేనే అయివున్నాను.

**పితాహమస్యజగతో మాతా ధాతా పితామహః ।**
**వేద్యం పవిత్రమోంకార ఋక్సామ యజురేవ చ ॥ 17**

**తాత్పర్యము:** ఈ విశ్వము యావత్తునకు నేనే తండ్రిని, తల్లిని, కర్మఫలములను ఇచ్చుదాతను, తాతను, సంరక్షకుడను, గ్రహించవలసిన పవిత్రుడను.



అంతేకాక, ఋగ్వేదమును, సామవేదము మరియు యజుర్వేదమును గూడ నేనే.

**గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్ ।**
**ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్ ॥ 18**

**తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ ।**
**అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున ॥ 19**

**తాత్పర్యము:** ఈ విశ్వమునకు నేనే కర్మఫలమును, పోషించువాడను, ప్రభువును, ప్రాణుల శుభాశుభముల కర్తను, మిత్రుడను, సృష్టించువాడను, స్థితికర్తను, లయకారకుడును, అంతేగాక నాశనములేని మూలకారకుడను.

అర్జునా! నేనే ఆదిత్యుని ద్వారా వేడిని ప్రసాదించుచున్నాను. వర్షమును కురిపించుచున్నాను. మరియు దేవతల అమృతమును, ప్రాణుల మృత్యువును కూడా నేనే. దృశ్యమును, అదృశ్యమును నేనే అయి ఉన్నాను.

**త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా**
**యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే ।**
**తే పుణ్యమాసాద్య సురేంద్రలోకం**
**అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్ ॥ 20**

**తాత్పర్యము:** ఋగ్యజు సామవేదములద్వారా నన్ను పూజించి, యజ్ఞశేషమయిన సోమరసమును పానముచేసి పాపములనుండి విముక్తులై స్వర్గప్రాప్తికొరకు ప్రార్థించి ఇంద్రలోకమును పొంది స్వర్గమునందు మానవదేహము పొందజాలని, దివ్యములైన దేవభోగములను అనుభవించుచున్నారు.

**తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం**
**క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి ।**

**ఏవం త్రయీధర్మమను ప్రపన్నా**
**గతా గతం కామకామా లభంతే ॥ 21**

**తాత్పర్యము:** అటువంటివారు విశాలమైన స్వర్గలోకమును సమస్త భోగములను అనుభవించి, తద్ద్వారా పుణ్యము నశింపగా, తిరిగి మానవలోకమునందు ప్రవేశించుచున్నారు. ఈ విధముగా వేదత్రయ నిషేధములైన భోగకర్మలయందు ఆసక్తిగలవారు స్వర్గమర్త్యలోకముల మధ్య రాకపోకలను సాగించుచూ జననమరణములను పొందుచున్నారు.

**అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ 22**

**తాత్పర్యము:** మనుజులు ఏకాగ్ర చిత్తముతో, పరమాత్ముడనైన నన్ను భజించవలెను. నిష్కామమైన మనస్సుతో పూజించవలెను. ఎల్లవేళలయందు నన్నే సేవించవలయును. అటువంటివారు యోగక్షేమములు పొందనట్లయిన నేను వారికి పొందునట్లు చేయుదును. యోగక్షేమములు పొందినవారిని నేను రక్షించెదను.

**యేఽ ప్యన్య దేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః ।**
**తేఽ పి మామేవ కౌంతేయ యజంత్య విధి పూర్వకమ్ ॥ 23**

**తాత్పర్యము:** అర్జునా! అయినప్పటికి ఏ ఏ భక్తులు శ్రద్ధతో ఇతర దేవతలను పూజించుచున్నారో అటువంటి భక్తులు వారికి తెలియకుండా నన్నే భజించుచున్నారు. అది విధి లిఖితము.

**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ ।**
**న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే ॥ 24**

**తాత్పర్యము:** నేను అన్ని విధముల యజ్ఞములకు భోక్తను మరియు ఫలమునిచ్చువాడను. కాని, అన్యదేవతలను ఆరాధించువారు పరమాత్ముడనైన నన్ను నా తత్త్వమును గ్రహించలేక పతనమగుచు పునర్జన్మను పొందుచున్నారు.



**యాంతి దేవవ్రతాదేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః ।**
**భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యా జినోఽ పిమామ్ ॥25**

**తాత్పర్యము:** దేవతలను ఉపాసించువారు ఆయా దేవతలనే పొందుదురు. శ్రాద్ధాది క్రియలద్వారా పితరులను పూజించువారు పితృదేవతలనే పొందుదురు. భూతప్రేతాదులను పూజించువారు భూతప్రేతములనే పొందురు. శ్రద్ధతో నన్ను పూజించువారు పరమాత్మ స్వరూపుడు నగు నన్నే పొందెదరు.

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మ నః ॥ 26**

**తాత్పర్యము:** ఏ పురుషుడు అత్యంత భక్తితో ఫలముకాని, పత్రము (ఆకు)నుగాని, పుష్పమునుగాని, జలమునుగాని నాకు అర్పించుచూ ఏకాగ్ర చిత్తముతో నన్ను సేవించుచున్నారో వాటిని నేను ప్రీతితో ఆరగించుదును.

**యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।**
**యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥ 27**

**తాత్పర్యము:** అర్జునా! దేనిని ఆచరించుచున్నావో, ఏ పదార్థమును ఆరగించుచున్నావో, ఏ హవ్యమును హోమము చేయుచున్నావో, ఏ వస్తువులను దానము నొనర్చుచున్నావో, దేనిని గురించి తపము చేయుచున్నావో వాటినన్నింటిని నాకే అర్పించుము.

**శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః ।**
**సన్న్యాసయోగ యుక్తాత్మా విముక్తో మాముపైష్యసి ॥ 28**

**తాత్పర్యము:** ఈ విధముగా సమస్త కర్మలను నాకర్పించిన, కర్మలబంధముల నుండి నీవు విడుదలపొంది అటుపిమ్మట నన్నే పొందుటకు అర్హుడగుదువు.

**సమోఽ హం సర్వభూతేషు న మే ద్వేష్యోఽ స్తి న ప్రియః ।**
**యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥ 29**

**తాత్పర్యము:** నేను సర్వప్రాణులయందు సమానమైన భావముతోనుందును. నాకు ప్రియమైనకాని, అప్రియమైనకాని ప్రాణి ఉండదు. ఏ మనుజులు నన్ను అత్యంత భక్తితో సేవించుచున్నారో, భజించుచున్నారో, నాయందు స్థిరముగాయున్నారో వారి హృదయములయందు నేను నిశ్చయముగా నుందును.

**అపి చేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్ ।**
**సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥ 30**

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।**
**కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 31**

**తాత్పర్యము:** అందరు సన్మార్గులు కారు. అందరు దుర్మార్గులుకారు. ఎంతటి దుర్మార్గుడైనను, ఎంతటి దురాచారుడైనను, నన్ను ఏకాగ్రమైన, అత్యంత భక్తితో పూజించి నట్లయిన, వానిని సాధుపురుషుడనియు, నాకు ప్రీతికరమైన భక్తుడని నేను భావించెదను. ఎందువలననగా, నా సేవయందు వాడు స్థిరమైన భక్తి కలిగినటువంటి కృతార్థుడు. ఈ విషయము నీవు తప్పక గ్రహించుము.

ఓ అర్జునా! అటువంటి పుణ్యపురుషుడు శీఘ్రముగా ధర్మముతోకూడిన మనస్సుకలవాడై, నిత్యము, శాశ్వతము అయిన శాంతిని పొందుననుటలో సందేహములేదు. అటువంటి భక్తశిఖామణి ఎన్నటికి నాశనముకాడు, కృతార్థుడగునని గ్రహించి అట్లు ప్రతిజ్ఞజేయుము.

**మాం హి పార్థ వ్యపాశ్రిత్యయేఽపిస్యుః పాపయోనయః ।**
**స్త్రియోవైశ్యా స్తథా శూద్రాః తేఽపి యాంతి పరాంగతిమ్ ॥ 32**

**తాత్పర్యము:** అర్జునా! నన్ను శరణుపొంది, పాదాక్రాంతమైనట్టివారు పాపాత్ములైనను, స్త్రీలైనను, వైశ్యశూద్రాదులైనను, ఎటువంటివారైనను నన్ను సేవించుచుండిన ఎడల వారు పరమగతిని, ముక్తిని పొందుచున్నారు.



**కిం పునర్బ్రాహ్మణాః పుణ్యాభక్తా రాజర్షయ స్తథా ।**
**అనిత్యమసుఖం లోకం ఇమంప్రాప్య భజస్వ మామ్ ॥ 33**

**తాత్పర్యము:** సత్కులమందు జన్మించిన బ్రాహ్మణులను, అటులనే రాజర్షులును అయినట్లు వారిగురించి ఇక చెప్పవలసిన అవసరమేమున్నది. వారు నాకు పరమభక్తులైనచో వారు అనిత్యము, సుఖహీనమగు మానవలోకమును, మానవ శరీరమును విడిచి ముక్తిని పొందునట్లు, నీవు కూడ నన్ను శరణుపొంది, నన్ను భజించి మోక్షమును పొందుము.

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః ॥ 34**

**తాత్పర్యము:** అర్జునా! నాకు అనన్య భక్తుడవై నన్ను పూజించువాడగుము. నాకు శ్రద్ధతో, మనస్ఫూర్తిగా నమస్కరించుము. నీ మనస్సు నాయందే లగ్నముజేసి, ఆత్మను నాయందే నిలిపి, నాకు శరణాగతుడవైతే నన్ను తప్పక పొందగలవు.

***ఇట్లు ఉపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జునసంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన శ్రీమద్భగవద్గీతయందలి రాజవిద్యా రాజగుహ్యమను తొమ్మిదవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

# పదవ అధ్యాయము

# విభూతి యోగము

వ్యక్తీకరించబడిన భగవంతునియొక్క ఐశ్వర్యమే "విభూతి". **"మత్తః పరతరం నాన్యత్కించి దస్తి ధనంజయ".**

అర్జునా! నాకంటె మరియొకటి ఏదియును లేదు. నా వైభవము, తత్త్వము వాస్తవముగా తెలిసినవారు, నిశ్చయమగు, దృఢమగు యోగముతో కూడియున్న వారగుదురు. ఇందు ఏమియును సందేహములేదు. ఇది సత్యము.

కృష్ణపరమాత్మకు పరమభక్తుడు, మేనబావ అయిన ఉద్ధవుడు "నీవు పరబ్రహ్మవు. సృష్టి స్థితిలయములకు నీవేకారణభూతుడవు. నీకు (ఆది అంతములు, ఆవరణలును లేవు.) నీ భక్తులు పూజింపబడు వస్తువులను గురించి వివరించవలెను". అని శ్రీకృష్ణునికి సాష్టాంగప్రణామము చేసి ప్రార్థించెను.

"కురుక్షేత్రయుద్ధారంభమున అర్జునుడు, యుద్ధమునందు బంధు మిత్రాదులను సంహరించుట పాపమని పట్టుబట్టి యుద్ధము చేయనని మిన్నకుండెను. అపుడు అర్జుననకు నేను విశదీకరించిన వివరములే నీకిపుడు చెప్పెదను." అని ఉద్ధవునకు తన విభూతులను ఈ విధముగా వివరించెను. "ఈ విశ్వములో నున్న 84 లక్షల జీవరాసులలో ఉన్న జీవిని నేనే, నేనే ప్రభువును, బాధ్యుడను ఈ సృష్టికిముందు సత్వరజస్తమో గుణములు సమతత్త్వముగా నుండునట్లు చేసితిని. పరబ్రహ్మము ఈ ప్రకృతినుండి ఆవిర్భంచినది.

నేను సులభముగా జయింపబడలేని మనస్సును. వేదములను బోధించువారిలో బ్రహ్మదేవుడును. మంత్రములకెల్ల ప్రణవ మంత్రమును. అక్షరములలో నేను "అ" కారమును. ఛందస్సులలో గాయత్రిని. దేవతలలో ఇంద్రుడను. అని కొన్నింటిని ఉద్ధవునకు చెప్పుతూ "ఇసుక రేణువులను లెక్కించవచ్చునుగాని నావిభూతులను లెక్కపెట్టుటకు ఎవరికిని సాధ్యముకాదు. ఈ విభూతులన్నియు సహజమైనవి. వీటిని గురించి ఆలోచిస్తూ అర్థము చేసుకొనవలెనే కాని, కాలమును అన్యధా వృధాచేయకుము. అరిషడ్వర్గములను శత్రువులను నిగ్రహించు ప్రజ్ఞాసాహసములుండు చోటనే నెప్పుడునూ ఉండెదను. వీటిని నీ అధీనములోనికి తెచ్చుకొన్నట్లయిన, నీవు తిరిగి సంసార సముద్రములో పడవు. నన్ను ఆశ్రయించి మనస్ఫూర్తిగా కొలుచువారు, వారిజీవితమునే నాకు సమర్పించెదరు. అట్లు సమర్పించినవారు నాలో ఐక్యమగుదురు.

బహుశ అద్వైతానికి ఇక్కడే పునాది ఏర్పడినట్లున్నది.

**శ్రీ భగవాన్ ఉవాచ**

**భూయ ఏవ మహాబాహో శృణుమే పరమం వచః ।**
**యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥ 1**

**తాత్పర్యము:** అర్జునా! నాయందు పరమ ప్రేమాదరములు, భక్తిశ్రద్ధలు గల నీకు ప్రియమును, హితమును ఒనర్చు హితమైన శ్రేష్ఠములైన వాక్యములను బోధించుచున్నాను. వాటిని శ్రద్ధతో ఆలకించుము.

**న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః ।**
**అహమాదిర్హి దేవానాం మహర్షీణాంచ సర్వశః ॥ 2**

**యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।**
**అసమ్మూఢః స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥ 3**

**తాత్పర్యము:** నాయొక్క జన్మరహస్యమును, ఉత్పత్తిని దేవతలు మహర్షులు కూడ ఎరుగరు. ఎందువలన అనగా, వారి వారి మూలకారణము, ఆదికారణమును నేనే.

నేను జన్మరహితుడను, సర్వలోకములకు పరంధాముడను, అనాది అయిన వానిని. ఈ విషయములను ఏ జ్ఞాని గ్రహించునో, మోహము విసర్జించినవాడగునో అటువంటి మనుజుడు పుణ్యపురుషుడు. తెలిసీ తెలియకుండా చేసిన సర్వపాపములనుండి విముక్తుడగును.

**బుద్ధిః జ్ఞానసమ్మోహః క్షమా సత్యం దమః శమః ।**
**సుఖం దుఃఖం భవోஉభావో భయం చా భయమేవ చ ॥ 4**

**అహింసా సమతా తుష్టిః తపో దానం యశోஉయశః ।**
**భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥ 5**

**తాత్పర్యము:** నిశ్చయజ్ఞానముతో అతిసూక్ష్మమయిన విషయగ్రహణము, మోహరాహిత్యము, సత్యమునే అంటే ఉన్నది ఉన్నట్లు, చూచినది చూచినట్లు చెప్పుట, బాహ్యేంద్రియములను నిగ్రహించుట, భయములేకపోవుట, అహింస, తపస్సు, దానము, తృప్తి, కీర్తి, అపకీర్తి మొదలగునవి ప్రాణులకు నా వలననే ఉత్పన్నములగుచున్నవి. అవి వారి వారి కర్మానుసారముగా మాత్రమే జరుగుచున్నవి.

**మహర్షయః సప్త పూర్వే చత్వారో మనవస్తథా ।**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥ 6**

**తాత్పర్యము:** సప్త మహర్షులును, నలుగురు మహర్షులైన సనకసనందాదులును, మరియు పదునాలుగు మనువులును, నాయందు పరమభక్తిభావము కలవారై, నా సంకల్పము వలనే జన్మించిరి. ఈ విశ్వమునందుండు ప్రజాసంతతి అంతయు కలిగినది.

**ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః ।**
**సోஉవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥ 7**

**తాత్పర్యము:** ఎవరు నా విభూతిని యథార్థ రూపమును, గ్రహించునో ఆ మనుజుడు వివేకమైన యోగి, నిశ్చయమైన తత్త్వముతో, భక్తియోగముచే నా సమగ్ర దర్శనముచేత యుక్తుడగునను విషయములో సందేహములేదు.



**అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ।**
**ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః ॥ 8**

**తాత్పర్యము:** విశ్వములోని సమస్త సృష్టి నానుండే ఉద్భవించుచున్నది. నడచుచున్నది. ఇది గ్రహించిన జ్ఞానులు నన్నే భక్తి తత్త్వముతో ఆరాధించుచున్నారు. ఎల్లవేళలయందు నన్నే ఆశ్రయించి సేవించుచున్నారనుటలో సందేహములేదు.

**మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరం ।**
**కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥ 9**

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥ 10**

**తాత్పర్యము:** ఎల్లవేళల నాయందే మనస్సును కేంద్రీకరించినవారును, తమ జీవితమును నాకే సమర్పించినవారును, జ్ఞానము, బలము, వీర్యము మొదలగువాటియందు ప్రభావము గలవానినైన నన్ను స్మరిస్తూ, నాగురించి నా మహిమల గురించి చర్చించుకొనుచున్నవారు ఆనందపరవశులగు చున్నారు.

నాయందే నిత్యము మనస్సు కలవారై, యోగయుక్తులై నన్ను సతతము సేవించుచుండే భక్తులకు, నా అనుగ్రహముకొరకే వారి మనస్సును కేంద్రీకరించువారికి బుద్ధియోగమును అనుగ్రహించుతూ, వారి వారి మోహాంధకారమును నిర్మూలించుచున్నాను.

**తేషామేవానుకంపార్థం అహమజ్ఞానజం తమః ।**
**నాశయామ్యాత్మ భావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ 11**

**తాత్పర్యము:** అట్టివారిని అనుగ్రహించుటకొరకు, వారి ఆత్మభావమునందు స్థితుడై వారి అజ్ఞానంవలన కలిగిన మోహాంధకారమును నశింపజేయుచు తత్త్వజ్ఞానమును ప్రసాదించుచున్నాను.

**అర్జున ఉవాచ**

**పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్ ।**
**పురుషం శాశ్వతం దివ్యం ఆదిదేవమజం విభుమ్ ॥ 12**

**ఆహుస్త్వాం ఋషయః సర్వే దేవర్షిర్నారదస్తథా ।**
**అసితో దేవలో వ్యాసః స్వయంచైవ బ్రవీషి మే ॥ 13**

**తాత్పర్యము:** అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మను అడుగుచున్నాడు. నీవు పూజ్యుడవు. పరబ్రహ్మవు, సంపూర్ణమైన పవిత్రుడవు. పరమపావనుడవు. దివ్యపురుషుడవని మనసస్ఫూర్తిగా కీర్తించుచున్నారు. అటులనే దేవర్షినారదుడును, అసితుడును, దేవలుడును, వ్యాసుడును నిన్ను సర్వవ్యాపివని, సనాతనుడవని, జన్మలేనివాడవని పొగడి తెలియ జేయుచున్నారు. నీవు కూడ అటులనే వివరించుచున్నావు.

**సర్వం ఏతద్ ఋతం మన్యే యన్మాం వదసి కేశవ ।**
**న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥ 14**

**తాత్పర్యము:** కృష్ణా! ఏ విషయములను నీవు నాకు నా గురించి చెప్పుచున్నావో అవన్నియు సత్యమనియే తలంతును. ప్రభూ! ఎందువలన అనగా నీ లీలామయ స్వరూపమును, ఆవిర్భావమును దేవతలు కాని, దానవులు కాని ఎఱుంగరు, తెలుసుకొనలేరు.

**స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।**
**భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ 15**

**తాత్పర్యము:** విశ్వముయొక్క ఉత్పత్తికి కారణభూతుడా! ఓ దేవదేవా! జగత్పితా! సర్వభూతములను నీవే సృష్టించినవాడవు. అందువలన నిన్ను నీవే తెలుసుకొనినవాడవు. నిన్ను నీవే ఎఱుగుదువు.

**వక్తుమర్హసి అశేషేణ దివ్యాః ఆత్మవిభూతయః ।**
**యాభిర్విభూతిభిర్లోకాన్ ఇమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16**



**తాత్పర్యము:** నీవు ఏ ఏ విభూతులద్వారా ఈ విశ్వము ఈ లోకములను వ్యాపించి ఉన్నావో ఆ విభూతులన్నింటిని నాకు విశదీకరించి చెప్పకోరుచున్నాను. ఎందువలన అనగా అవి అన్నియు దివ్యములైనవి.

"విభూతి" అనగా వ్యక్తీకరింపబడిన భగవంతునియొక్క ఐశ్వర్యము.

**కథం విద్యా మహం యోగిం స్త్వాం సదా పరిచింతయన్ ।**
**కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవన్మయా ॥ 17**

**విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన ।**
**భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥ 18**

**తాత్పర్యము:** యోగీశ్వరా! నేను ఎల్లప్పుడును చింతించుచున్నవాడను. ఆ కారణంగా నిన్ను నేను ఎటుల ఎఱుగగలను. అమృతమగు నీ ఏ వస్తువులద్వారా నిన్ను తెలుసుకొనుటకు వీలగును, ధ్యానించబడగలవు. కృష్ణా! నీవు పరమాత్ముడవు. నీయొక్క యోగశక్తిని గురించి, విభూతులను గురించి, వివరించుము. ఆ విభూతులద్వారా నీవు సమస్తలోకములను వ్యాపించి ఉన్నావు. ఆ నీ విభూతులన్నింటిని నేను వినుటవలన నేను సంతృప్తి చెందుదును. అవి అమృతధారలు కదా!

**శ్రీ భగవాన్ ఉవాచ**

**హంత తే కథయిష్యామి దివ్యాః ఆత్మ విభూతయః ।**
**ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్తిః అంతో విస్తరస్య మే ॥ 19**

**అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।**
**అహమాదిశ్చ మధ్యం చ భూతానాం అంత ఏవ చ ॥ 20**

**తాత్పర్యము:** శ్రీ కృష్ణభగవానుడు చెప్పుచున్నాడు. అర్జునా! అలౌకికములగునట్టివి, ధ్యానము చేయుటకు యుక్తములైన, విభూతులను తెల్పెదను. అయినా నా విభూతులు అనంతములు. దివ్యములగు

విభూతులను కొన్నింటిని వివరించెదను. అర్జునా! నేను సర్వప్రాణుల యందున్న ఆత్మను, చైతన్యమును. అంతేకాదు నేను సర్వప్రాణులయొక్క ఉత్పత్తి స్థితిలయములను.

**ఆదిత్యానా మహం విష్ణుః జ్యోతిషాం రవిరంశుమాన్ ।**
**మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥ 21**

**వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।**
**ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥ 22**

**తాత్పర్యము:** నేను ద్వాదశాదిత్యులలో విష్ణువును, ప్రకాశమునిచ్చు కిరణములుగల సూర్యుడను, వాయుదేవతలలో మరీచిని తేజమును, నక్షత్రములలో నేను చంద్రుడను, వేదములలో సామవేదమును, దేవతలలో ఇంద్రుడను, పదకొండు ఇంద్రియములలో, సంకల్పవికల్పాత్మకమగు మనస్సును, ప్రాణులయందు జ్ఞాపకశక్తిని, చైతన్యశక్తిని నేనే.

**రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।**
**వసూనాం పావకశ్చాస్మి మేరుః శిఖరిణామహమ్ ॥ 23**

**తాత్పర్యము:** ఏకాదశ రుద్రులలో శంకరుడను, యక్షరాక్షసులలో ధనమునకు ప్రభువైన కుబేరుడను, అష్టవసువులలో అగ్నిహోత్రుడిని, శిఖరములుగల కొండలలో నేను మేరు పర్వతమును.

**పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ! బృహస్పతిమ్ ।**
**సేనానీనామహం స్కందః సరసామస్మి సాగరః ॥ 24**

**తాత్పర్యము:** అర్జునా! నేను పురోహితులలో బృహస్పతిని. సేనాపతులలో కుమారస్వామిని, సరస్సులలో నేను సముద్రుడనని తెలిసికొనుము.

**మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్ ।**
**యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥ 25**



**తాత్పర్యము:** మహర్షులలో భృగుమహర్షిని. శబ్దములలో ఏకాక్షరమగు ప్రణవమును. 'ఓం'కారమును నేనే. శ్రౌతస్మార్తములగు యజ్ఞము లన్నింటిలోను జపయజ్ఞమును. స్థావరములలో హిమాలయపర్వతము నేను.

**అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।**
**గన్ధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥ 26**

**తాత్పర్యము:** సర్వవృక్షములలో రావిచెట్టును. దేవర్షులలో నారదుడను. గంధర్వులలో చిత్రరథుడను, సిద్ధులలో కపిలుడను మునిని.

**ఉచ్చైఃశ్రవ సమశ్వానాం, విద్ధి మా మమృతోద్భవమ్ ।**
**ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥ 27**

**తాత్పర్యము:** అశ్వములలో అమృతముతో పాటు పుట్టిన "ఉచ్చైశ్రవ"మును, శ్రేష్ఠమైనది అగు ఐరావతమును, మానవులలో రాజుగాను నన్ను తెలిసికొనుము.

**ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।**
**ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః ॥ 28**

**తాత్పర్యము:** ఆయుధములలో వజ్రాయుధమును నేనే, గోవులలో కామధేనువును, నేనే. సంతానోత్పత్తికి కారణభూతుడగు మన్మథుని నేనే. సర్పములలో వాసుకిని నేనే అని గ్రహింపుము.

**అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।**
**పితౄణామర్యమా చాస్మి యమః సంయమతామహమ్ ॥ 29**

**తాత్పర్యము:** నాగులలో నేను అనంతుడను. జలదేవతలకు రాజగు వరుణుడను, పితృదేవతలలో అర్యముడను, శాసించు వారలలో యముడను నేనే అని ఎఱుంగుము.

**ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।**
**మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ ॥ 30**

**తాత్పర్యము:** దైత్యులలో ప్రహ్లాదుడను. గణితములలో కాలమును, మృగములలో సింహమును మరియు పక్షులలో గరుత్మంతుడను నేనే.

**పవనః పవతామస్మి రామః శస్త్రభృతామహమ్ ।**
**ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ॥ 31**

**తాత్పర్యము:** వేగవంతమయి పవిత్రమొనర్చు వానిలో వాయువును నేను, శ్రీరాముడనునేను. మత్స్యాదులలో నేను మొసలిని. అంతేగాక నదులలో గంగానదిని నేనే అని తెలిసికొనుము.

**సర్గాణామాదిరంతశ్చ మధ్యం చైవాహమర్జున ।**
**ఆధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ ॥ 32**

**తాత్పర్యము:** ఓ అర్జునా! ఈ అనంతమైన సృష్టికి ఆది, స్థితి, అంతమును నేనే. విద్యలలో మోక్షమొసంగు ఆత్మవిద్యను నేనే. తాత్త్వికులయొక్క వివాదాస్పద వితండవాదములలో న్యాయనిర్ణయము చేయువాదమును నేనే.

**అక్షరాణామకారోఽస్మి ద్వంద్వః సామాసికస్య చ ।**
**అహమేవాక్షయః కాలో ధాతాహంవిశ్వతోముఖః ॥ 33**

**తాత్పర్యము:** అక్షరములలో 'అ' కారమును నేను. సమాసములలో ద్వంద్వ సమాసము నేను. క్షయము కానట్టి త్వరగా పరుగెత్తెడు మహాకాలము నేను. సర్వతోముఖుడను, ధరించి పోషించు విరాట్ పురుషుడను, కర్మఫలదాతను నేనే.

**మృత్యుః సర్వహరశ్చాహమ్ ఉద్భవశ్చ భవిష్యతామ్ ।**
**కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥ 34**

**తాత్పర్యము:** సర్వప్రాణులను సంహరించు మరణమును నేనే. అభ్యుదయమును గాంచువారి అభ్యుదయమును నేను. సర్వభూతముల ఉత్పత్తికి కారణము నేనే. స్త్రీలలోని కీర్తిని, సిరిని, మేధను, వాక్కును, స్మృతిని, ఓర్పును నేను అని గ్రహింపుము.



**బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్ ।**
**మాసానాం మార్గశీర్షోఽహం ఋతూనాం కుసుమాకరః ॥ 35**

**తాత్పర్యము:** అటులనే ఇంద్రుని సర్వేశ్వరునిగ కీర్తించు సామగీతములలో బృహత్సామమును నేను. ఛందస్సులలో గాయత్రీ ఛందస్సును నేనే. మాసములలో మార్గశిరమాసమును, ఋతువులలో వసంత ఋతువును నేనే.

**ద్యూతం ఛలయ తామస్మి తేజస్తేజస్వి నామహమ్ ।**
**జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్ ॥ 36**

**తాత్పర్యము:** మోసగించువారిలో నేను ద్యూతమును. తేజశ్శాలురలోనుండు ప్రతిభాపాటవాలు నేను. ఉద్యమకారులలో జయమును నేను. విజేతలలో నేను విజయమును. నిశ్చయమునకు వచ్చు పురుషులలో నేను నిశ్చయమును. వివేకముగల మనుజులలో సాత్త్వికమగు కవిని, సాత్త్వికభావమును నేనే అని గ్రహింపుము.

**వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః ।**
**మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః ॥ 37**

**తాత్పర్యము:** యాదవులలో వాసుదేవుడను నేను. పాండవులలో అర్జునుడను, మునులలో వేదవ్యాసుడను, కవులలో శుక్రాచార్యుని నేనే.

**దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్ ।**
**మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్ ॥ 38**

**తాత్పర్యము:** దండించువారిలో శిక్షించు శక్తిని నేను. జయించు కోరిక గలవారిలో రాజనీతిని. రహస్యములలో మౌనమును. జ్ఞానవంతులలో తత్త్వశక్తిని జ్ఞానమును నేనే అయి ఉన్నాను.

**యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।**
**న తదస్తి వినాయత్ స్యాత్ మయాభూతం చరాచరమ్ ॥ 39**

**తాత్పర్యము:** సకలప్రాణులకు ఏ ఉత్పత్తి కారణమో, అదియును నేనే. మరియు అర్జునా! సమస్తభూతములలో నేను లేనిది ఏదియును లేదు.

**నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప ।**
**ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥ 40**

**తాత్పర్యము:** ఓ అర్జునా! అనంతములైన దివ్యములైన విభూతులకు అంతములేదు. అయినను విశేషమగు విభూతులను కొన్నింటిని మాత్రమే నీకు బోధించితిని.

**యద్యద్విభూతిమత్ సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంఽశసంభవమ్ ॥ 41**

**తాత్పర్యము:** ఐశ్వర్యయుక్తము, కాంతియుతము, శక్తిమంతము అయిన ఏ ప్రాణికలదో దానిలోని తేజము అంతయు నా అంశమువలన ఉద్భవించినదే అని గ్రహించుము.

**అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ।**
**విష్టభ్యాహమిదం కృత్స్నమ్ ఏకాంశేన స్థితో జగత్ ॥ 42**

**తాత్పర్యము:** అర్జునా! ఈ విధముగా ఎక్కువగా తెలిసికొనుటవలన ఏమి లాభము! ఏమి ప్రయోజనము. నేను ఈ యావత్తు విశ్వములోను నేను ఏకభాగముచేత వ్యాపించియున్నాను. ఈ జగత్తు అంతయు నాయొక్క అంశమువలననే వ్యాపించి వెలయుచున్నదని గ్రహింపుము.

***ఇట్లు ఉపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జున సంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన శ్రీమద్భగవద్గీత యందలి విభూతియోగమనెడి పదియవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

# పదకొండవ అధ్యాయము

# విశ్వరూప సందర్శనయోగము

పదవ అధ్యాయములో వ్యక్తీకరింపబడిన తన ఐశ్వర్యమే “విభూతి” అని, నాకంటె మరియొకటి ఏదియునులేదని చెప్పుచూ తనయొక్క విభూతులను క్లుప్తముగా కొన్నింటిని విభూతి యోగములో పేర్కొనెను. నా విభూతులు అనంతములని స్పష్టము చేసెను. కృష్ణభగవానుని అనంత ప్రభావమునకు ముగ్ధుడై ఆయనను స్తుతించెను. “నీ తేజముచే ఈ చరాచర విశ్వమంతయు సచేతనమై ప్రవర్తించుచున్నది. నీవు మోహములో పడకుండా జగములను మోహింపజేయగల నేర్పుకలవాడివి. ఈ అవతారములోనే విశ్వమంతయును నీ తల్లికి నోటిలోనే ప్రదర్శించితివి. నీనుండియే విశ్వసృష్టి అంతయు ఉద్భవిస్తుంది. యజ్ఞములలోని హవిస్సును ఆరగించే యుగపురుషుడు. వస్తురహిత చైతన్యమునైన నిన్ను దర్శించడము అనగా అన్ని వస్తువులను చైతన్యములోనే తత్త్వస్ఫూర్తితో చూడడమే. అదియేకదా దివ్యస్వరూపము!” విశ్వరూప దర్శనమనేది పార్థునిలో కలిగిన నిత్య స్వరూపానుభూతి. ఆ విధముగా ప్రార్థించిన అర్జునునకు తన విశ్వరూపమును దర్శింపజేయుటకు సిద్ధపడెను. ఆయనకు ఒక రూపముకాని, ఒక స్థితికాని లేదు. తన భక్తులకు అనేక సమయములలో తన దివ్యరూపమును దర్శింపజేసెను. తన జననీ జనకులకు బందీలయి ఉన్న సమయములో, గోకులంలో యశోదకు, బృందావనములో గోపికలకు, అక్రూరునకు, కౌరవసభలో భీష్మునకు, కురుక్షేత్రములో అర్జునునకు తన విశ్వరూపమును ప్రదర్శించెను.

ఒక్కొక్క యుగములో ఒక్కొక్క రంగుతో తాను తన రూపమును పొందెను. కృతయుగములో తెలుపురంగుతోను, త్రేతాయుగములో

ఎరుపురంగుతోను, ద్వాపరయుగములో నీలపు రంగుతోను, (కలియుగములో పసుపు రంగుతోను) వెలసిల్లెను. ఈ విధముగా కృష్ణభగవానుడు ప్రకాశించియుండెను. తన విశ్వరూపమును ప్రదర్శించుచుండగా ధైర్యమును, ప్రశాంతతను కోల్పోయి, ప్రసన్నమైన, ప్రశాంతమైన రూపముతో దర్శింపజేయమని ప్రార్థించెను.

ఈ అధ్యాయములో చివరి శ్లోకములో పరమాత్మ తన విశ్వరూపమును చూచు అర్హత ఎవరికి ఉన్నదో చెప్పెను. తన భక్తునకు ఒకనికే ఉండునని, ఇతరులయందు శత్రుత్వములేక అందరిని సమముగా చూడకలుగు భక్తునికి మాత్రమే ఈ రూపము లభ్యమని చెప్పెను.

"మత్కర్మకృన్మత్పరమో మద్భక్త సంగవర్జితః ।
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ ॥

ఈ విశ్వరూపము కాలునిరూపము. అనగా ప్రాప్తకాలములో అందరిని సంహరించు రూపము. (కాలము అనగా సమయము. కాలుడు అనగా యముడు అని అర్థము.) ఈ విధముగా అర్జునునికి కృష్ణభగవానుడు తన విశ్వరూపమును ప్రదర్శించెను. ఆ రూపమును చూచిన తరువాత అర్జునుడు **"హృషీకేశ"** (ఇంద్రియాధిపతి) అని అంటాడు. ఈ రూపమును చూసి రాక్షసులు భయపడటం, పరుగెత్తటం, సిద్ధసంఘాలు నమస్కరించడం ఉచితమేనంటాడు. ఈ 36వ శ్లోకం ఈ అధ్యాయానికి, శ్రీకృష్ణామృతవాణికే (భగవద్గీతకే) మకుటాయమానం. ఇందులో బీజాక్షరాలున్నాయని "మధుసూదన సరస్వతి" చెప్పారు. అందుకే దీనిని మంత్రశాస్త్రములోకి తీసుకున్నారట.

**అర్జున ఉవాచ**

**మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మ సంజ్ఞితమ్ ।**
**యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ ॥ 1**



**తాత్పర్యము:** నన్ను అనుగ్రహించుటకొరకు, నాకు జ్ఞానము ప్రసాదించుటకొరకు, నాకు నీవు ఉపదేశించినటువంటి రహస్యమైన ఆధ్యాత్మిక బోధనలవలన నాకు మోహాంధకారము తొలగి భ్రమ మాయపై జ్ఞానోదయము కలిగినది.

**భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశోమయా ।**
**త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్ ॥ 2**

**ఏవమేతద్యథాత్థ త్వమాత్మానం పరమేశ్వర ।**
**ద్రష్టుమిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ ॥ 3**

**తాత్పర్యము:** శ్రీకృష్ణా! సర్వప్రాణులయొక్క జనన మరణములు రెండును నీవలననే ఏర్పడినవి అని సవిస్తరముగా తెలిసికొంటిని. అంతేకాక శాశ్వతమగు నీ మహిమనుకూడ వింటిని.

మరియు శ్రీకృష్ణా నీ ఆత్మ తత్త్వమును గురించి, నీ గురించి ఏమి స్పష్టము చేసితివో అదంతయు నిస్సంశయముగా సత్యము. నీ జ్ఞాన, ఐశ్వర్య బలసంపన్న, ఈశ్వర సహిత రూపమును దర్శించుటకై వేడుకొనుచున్నాను. ప్రత్యక్షముగా సాక్షాత్కరించమని ప్రార్థించుచున్నాను.

**మన్యసే యదితచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో ।**
**యోగీశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్ ॥ 4**

**తాత్పర్యము:** శ్రీకృష్ణా! నీ దివ్య, తేజోమయ విశ్వరూపమును దర్శించుటకు నాకు సాధ్యమని, నేను యోగ్యుడనని నీవు భావించునట్లయిన నీ నిత్యమగు నీ జగద్వ్యాప్త విశ్వరూపమును నాకు చూపించకోరుచున్నాను.

**శ్రీ భగవాన్ ఉవాచ**

**పశ్యమే పార్థ రూపాణి శతశోఽథ సహస్ర శః ।**
**నానావిధాని దివ్యాని నానావర్ణా కృతీని చ ॥ 5**

**తాత్పర్యము:** ఓ అర్జునా! నా అలౌకికమగు, అనేక వర్ణములతోను ఉండునది, వందలకొలది వేలకొలది నిండియున్న ఆకృతులలో ఉన్న రూపమును చూడుము.

**పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రాన్ అశ్వినౌ మరుతస్తథా ।**
**బహూన్యదృష్ట పూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ॥ 6**

**తాత్పర్యము:** అర్జునా! అదితియొక్క ద్వాదశపుత్రులను, అష్టవసువులను, ఏకాదశ రుద్రులను, అశ్వనీ కుమారులైన ఇద్దరిని దేవతాగణములను చూడుము. అంతేకాక నీవుగాని, ఇతరులును గాని ఇంతవరకు చూడనటువంటి, ఆశ్చర్యకరమైన అనేక విషయములను చూడుము.

**ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।**
**మమ దేహే గుడాకేశ! యచ్చాన్యద్రష్టుమిచ్ఛసి ॥ 7**

**నతు మాం శక్యసే ద్రష్టుం అనేనైవ స్వచక్షుషా ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥ 8**

**తాత్పర్యము:** అర్జునా! నీవు చూడవలసిన నా దేహమునందు స్థిరమై ఉన్న చరాచర ప్రపంచమును గాంచుము. మరియు నీవు చూడదలచుకొన్న ఏ ఏ వస్తువులను గాని, ఇతరములైనవి గాని దర్శింపుము.

కాని, నీ చర్మచక్షువులతో నా విశ్వరూపమును చూడలేవు. కనుక, నీకు దివ్య యోగ దృష్టిని ప్రసాదించుచున్నాను. ఈ విధమైన దృష్టితో నా విశ్వరూపమును దర్శింపుము.

**సంజయ ఉవాచ**

**ఏవ ముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః ।**
**దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్ ॥ 9**

**తాత్పర్యము:** సంజయుడు పలికెను. ధృతరాష్ట్రమహారాజా! మహాయోగేశ్వరుడు అయిన శ్రీకృష్ణభగవానుడని వివరించుతూ తన ఈశ్వరసంబంధమగు విశ్వరూపమును అర్జునునకు చూపెను.



**అనేక వక్త్రనయనం అనేకాద్భుత దర్శనమ్ ।**
**అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥ 10**

**దివ్యమాల్యాంబరధరం దివ్యగంధాను లేపనమ్ ।**
**సర్వాశ్చర్యమయం దేవం అనంతం విశ్వతోముఖమ్ ॥ 11**

**తాత్పర్యము:** అనేకములైన ముఖములు, కన్నులు కలదియు, బహువిధములైన అద్భుత దర్శనములు కలదియు, అమితములైన దివ్యాభరణములు కలదియు, వివిధ ఆయుధములు కలదియు, అనేక శ్రేష్ఠమైన హారములు, వస్త్రములు కలదియు, సుగంధపు లేపమును కలదియు, ఆశ్చర్యమైనదియు, అనంతమైనది, సర్వత్రముఖశోభలను వెదజల్లునదియు అగు కృష్ణపరమాత్మ విశ్వరూపమును అర్జునుడు వీక్షించెను.

**దివి సూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా ।**
**యది భాః సదృశీ సా స్యాత్ భాసస్తస్య మహాత్మనః ॥ 12**

**తాత్పర్యము:** ఆకాశమున వేయి సూర్యులయొక్క కిరణములకాంతి ఒకేసారి సంభవించిన ఎటులనుండునో కృష్ణునియొక్క విశ్వరూపకాంతి ఆవిధముగా, ఆ కాంతికి సమానముగా ప్రకాశింప అర్జునుడు వీక్షించెను.

**తత్రైకస్థం జగత్ కృత్స్నం ప్రవిభక్తమనేకధా ।**
**అపశ్యద్దేవ దేవస్య శరీరే పాండవస్తదా ॥ 13**

**తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః ।**
**ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత ॥ 14**

**తాత్పర్యము:** అప్పుడు అర్జునుడు కృష్ణుని శరీరమందు నానావిధ రూపములుగా దేవ, పితృ మానవాదులు ఒకేచోట ఉండునట్లుగా చూచెను.

ఆ విధముగా చూచిన పార్థుడు ఆశ్చర్యముతో గగుర్పాటుచెంది పులకాంకితుడై, విశ్వరూపము ప్రదర్శించిన భగవంతునకు, చేతులు జోడించి సాష్టాంగప్రణామముచేసి ఇట్లు పలికెను.

**అర్జున ఉవాచ**

**పశ్యామిదేవాంస్తవ దేవ దేహే**
**సర్వాంస్తథా భూత విశేషసంఘాన్ ।**
**బ్రహ్మాణమీశం కమలాసనస్థమ్**
**ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥ 15**

**తాత్పర్యము:** అర్జును డిట్లుపలికెను, కృష్ణా! నీ విశ్వరూపమునందు సర్వదేవతలను, నానావిధ ప్రాణుల సమూహమును, కమలమునందు కూర్చునియున్న బ్రహ్మదేవుని, శంకరుని, యావత్తు ఋషి సముదాయమును, తక్షకుడు మొదలైన సర్పములను, చూచుచున్నాను.

**అనేక బాహూదర వక్త్రనేత్రం**
**పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్ ।**
**నాంతం న మధ్యం న పునస్తవాదిం**
**పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥ 16**

**తాత్పర్యము:** విశ్వేశ్వరా! జగదీశ్వరా! అసంఖ్యాకములగు హస్తములను, బాహువులను నేత్రములును కలిగియున్న, అనంత రూపములతోను నిండియున్న నిన్ను చూచు చున్నాను. మరియు, నీ మధ్యభాగమును, తుదిని ఆదిని చూడలేకున్నాను.

**కిరీటినం గదినం చక్రిణం చ**
**తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్ ।**
**పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతాత్**
**దీప్తానలార్క ద్యుతి మప్రమేయమ్ ॥ 17**

**తాత్పర్యము:** కిరీటమును ధరించినవానిగను, గదను చేతపట్టినవానిగను, చక్రమును హస్తమునందు చేబూనినవానిగను, సర్వత్ర తేజోవంతముగా ప్రకాశించువానిగను, ప్రజ్వలించెడి అగ్ని, ఆదిత్యులవలె ప్రభావంతునిగను, అప్రమేయుడవు అగు నిన్ను సకల ప్రదేశములయందు వీక్షించుచున్నాను.



**త్వ మక్షరం పరమం వేదితవ్యం**
**త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।**
**త్వమవ్యయః శాశ్వత ధర్మగోప్తా**
**సనాతనస్త్వం పురుషో మతో మే ॥ 18**

**తాత్పర్యము:** నీవు పరబ్రహ్మము. అక్షర స్వరూపుడవు. తెలిసికొనదలచిన వాడవు. సకలప్రాణులకు ఆశ్రయము నిచ్చువాడవు. శాశ్వత, సనాతన ధర్మరక్షకుడవు నాశనము లేనివాడవు. పురాణపురుషుడవు అని నా నిశ్చయ అభిప్రాయము.

**అనాది మధ్యాంతమనంత వీర్యం**
**అనంతబాహుం శశిసూర్యనేత్రం**
**పశ్యామి త్వాం దీప్తహుతాశ వక్త్రం**
**స్వతేజసా విశ్వమిదం తపంతమ్ ॥ 19**

**తాత్పర్యము:** ఆది మధ్యాంతరహితుడవు, అమితమైన శక్తికలవానివి, తేజోవంతునిగను, అనేక బాహువులు గలవానిగను, చంద్రసూర్యులను నేత్రములు గలవానిగను, అగ్నివలె ప్రకాశించు ముఖారవిందములుగల వానిగను, స్వీయమైన తేజస్సుతో తపింపజేయువానిగను నిన్ను వీక్షించుచున్నాను.

**ద్యావా పృథివ్యోరిదమంతరం హి**
**వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।**
**దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం**
**లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥ 20**

**తాత్పర్యము:** దేవలోకము, భూలోకము, ఆకాశం, అన్ని దిక్కులును నీవొక్కనిచేతనే వ్యాపించబడియున్నవి. నీ అద్భుతమైన ఉగ్రరూపము చూచి ముల్లోకములు భీతినొందినవి.

**అమీ హి త్వాం సురసంఘా విశంతి**
**కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి ।**
**స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధ సంఘాః ।**
**స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥ 21**

**తాత్పర్యము:** ఈ దేవతాసమూహములు నీయందే ప్రవేశించుచున్నారు. కొందఱు భయపీడితులై హస్తములు జోడించి నిన్ను స్తుతించుచున్నారు, మహర్షులు సిద్ధులు విశ్వమునకు శుభమగుగాక, స్వస్తి అంటూ బిగ్గరగా పొగడుతున్నారు.

**రుద్రాదిత్యా వసవో యేచ సాధ్యా**
**విశ్వేఽ_శ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ।**
**గంధర్వ యక్షాసుర సిద్ధసంఘా**
**వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥ 22**

**తాత్పర్యము:** ఏకాదశరుద్రులును, అష్టవసువులును, ఆదిత్యులును, సాధ్యులును, అశ్వనీదేవతలును, వాయుదేవతలును, పితృదేవతలును, యక్షులు, రాక్షసులును, సిద్ధులును, వీరందరు ఆశ్చర్యముపొంది నిన్ను ఉత్తమస్తోత్రములతో పొగడుతూ సంతోషముగా వీక్షించుచున్నారు.

**రూపం మహత్తే బహువక్త్రనేత్రం**
**మహాబాహో బహుబాహూరు పాదమ్ ।**
**బహూదరం బహుదంష్ట్రా కరాళం**
**దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాహమ్ ॥ 23**

**తాత్పర్యము:** ఓ కృష్ణా! అనేకములైన ముఖములు, నేత్రములు, బాహువులు, పాదములు, ఉదరములు, అసంఖ్యాకములైన కోరలచే భయంకరమైనది అగు నీ అద్భుతమైన రూపమును కాంచి సర్వలోకములు భయపడుచున్నవి. అలాగే నేను కూడ భీతి చెందుచున్నాను.



**నభః స్పృశం దీప్త మనేక వర్ణం**
**వ్యాత్తాననం దీప్తవిశాల నేత్రమ్ ।**
**దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా**
**ధృతిం న విందామి శమం చ విష్ణో ॥ 24**

**తాత్పర్యము:** కృష్ణా! ఆకాశమును తాకుతూ ప్రకాశించువాడవును, తెరచియున్న నోళ్లుకలవాడవు, ప్రకాశించు నేత్రములు కలిగియున్నవాడవును, అసంఖ్యాకములగు హస్తములు, కాళ్లు, తొడలు కలిగి, భయంకరములగు కోరలు గలిగియున్న నీ విశ్వరూపమును చూడ శాంతిని పొందలేకున్నాను. ఓ దేవదేవా! దయతో నన్ను అనుగ్రహించుము.

**దంష్ట్రాకరాలాని చ తే ముఖాని**
**దృష్ట్వైవ కాలానల సన్నిభాని ।**
**దిశో న జానే న లభే చ శర్మ**
**ప్రసీద దేవేశ జగన్నివాస ॥ 25**

**తాత్పర్యము:** అనేక కోరలతో భయంకరమైనది, ప్రళయాగ్నిబోలు నీ ముఖమును చూచి దిక్కులను కూడ గాంచలేక నున్నాను. శాంతిని పొందలేక భీతావహుడనై ఉన్నాను. దయతో, కరుణతో నాకు ప్రసన్నతను ప్రసాదించి నన్ను కృతార్థుని గావించుము.

**అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః**
**సర్వే సహైవావనిపాల సంఘైః ।**
**భీష్మో ద్రోణః సూతపుత్రస్తథాసౌ**
**సహాస్మదీయైరపి యోధముఖ్యైః ॥ 26**

**వక్త్రాణి తే త్వరమాణా విశంతి**
**దంష్ట్రాకరాళాని భయానకాని ।**
**కేచిద్విలగ్నా దశనాంతరేషు**
**సంధృశ్యంతే చూర్ణితైరుత్తమాంగైః ॥ 27**

**తాత్పర్యము:** ధృతరాష్ట్రుని కుమారులందరును, అటులనే భీష్మపితామహుడు, ద్రోణాచార్యులు, కర్ణుడు, ఇంకనూ మన పక్షమున నున్న యోధులలో ముఖ్యమైనవారును నీయందు ప్రవేశించుచున్నారు. వికృతమును, భయంకరము అగు నీ నోటియందు ప్రవేశించుచున్నారు. మరికొందరు నీ పండ్ల మధ్యనున్న ప్రదేశములో శిరస్సులతో సహా నలిగిపోయి చూర్ణమగుచున్నారు.

**యథా నదీనాం బహవోఽంబువేగాః**
**సముద్రమేవాభిముఖా ద్రవంతి ।**
**తథా తవామీ నరలోకవీరా**
**విశంతి వక్త్రాణ్యభి విజ్వలంతి ॥ 28**

**తాత్పర్యము:** నదీనదములోను, వివిధ విధములుగా నుండినటువంటి జలములన్నియు ఏవిధముగా సాగరములో ప్రవేశించునో ఆ ప్రకారముగానే నిపుణులైన యుద్ధవీరులందరు జ్వలించుచుండెడి నీ నోళ్లలో ప్రవేశించుచున్నారు.

**యథా ప్రదీప్తం జ్వలనం పతంగా**
**విశంతి నాశాయ సమృద్ధవేగాః ।**
**తథైవ నాశాయ విశంతి లోకాః**
**తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥ 29**

**తాత్పర్యము:** మిడుతలు మిక్కిలి వేగముగా మండుచున్న అగ్నిలో ప్రవేశించుచుండి ఎటుల మాడిపోవునో అటులనే జనులందరూ నీ నోళ్లలో పడి మృతి చెందుచున్నారు.

**లేలిహ్యసేఽగ్రసమానః సమంతాత్**
**లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః ।**
**తేజోఽభిరాపూర్య జగత్ సమగ్రం**
**భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో ॥ 30**



**తాత్పర్యము:** ఓ మహావిష్ణూ! దేదీప్యమానమగు ముఖములతో ఈ యావన్మంది యోధులను ఆస్వాదించుచున్నావు. ఓ పరాత్పరా! నీ తీవ్రమైన తేజస్సు విశ్వమంతయును నిండి తపింపజేయుచున్నది.

**ఆఖ్యాహిమే కో భవానుగ్రరూపో**
**నమోఽస్తు తే దేవవర ప్రసీద ।**
**విజ్ఞాతుమిచ్ఛామి భవంత మాద్యం**
**నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥ 31**

**తాత్పర్యము:** ఓ పరాత్పరా! నీకు ప్రణామము. నీ ఉగ్రరూపము భయంకరము గానున్నది. నీవు ఆదిపురుషుడవు. నిన్ను విపులముగా తెలిసికొనుటకు ఆరాటపడుచున్నాను. నీ ప్రవర్తనము తెలియుటలేదు. అందువలన నీవెవరివో వివరించమని ప్రార్థించుచున్నాను.

**శ్రీ భగవాన్ ఉవాచ**

**కాలోఽస్మి లోక క్షయకృత్ ప్రవృద్ధో**
**లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః ।**
**ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే**
**యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥ 32**

**తాత్పర్యము:** శ్రీభగవానుడు ఇట్లు చెప్పెను. సర్వలోకములను సంహరించుటకు నేను మహాకాలుడను. జీవులను సంహరించుటయే ప్రస్తుతము నాప్రవృత్తి. ఈ యుద్ధములో శత్రుపక్షమున ఏ వీరులు ఉన్నారో వారికి అంత్యకాలము సమీపించినది. నీవు సమరము చేయకున్నను ఆ శత్రు పక్షవీరులు ఎవరూ ఇకముందు ఉండరు.

**తస్మాత్ త్వముత్తిష్ఠ యశో లభస్వ**
**జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।**
**మయైవైతే నిహతాః పూర్వమేవ**
**నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥ 33**

**తాత్పర్యము:** అందువలన నీవు లేచి (శత్రువులను జయించి కీర్తిని గడింపుము. అఖండ) సంపదలతో సమగ్రము, సంపూర్ణముగా వెలయుచున్న రాజ్యమును పరిపాలించుము. వారు నాచేత ఇది వరకే చంపబడియున్నారు. అర్జునా! నువ్వు నిమిత్తమాత్రుడవు.

**ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ**
**కర్ణం తథాన్యా నపి యోధవీరాన్ ।**
**మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా**
**యుధ్యస్వ తేజాసి రణే సపత్నాన్ ॥ 34**

**తాత్పర్యము:** ద్రోణాచార్యులు, భీష్మపితామహుడు, జయద్రథుడు, కర్ణుడు, ఆ విధముగానే ఇదివరకే నా చేత చంపబడినారు. మిగిలిన శత్రువీరులను నీవు వధింపుము. భీతిచెందవలదు. లెమ్ము. సమరమునకు సంసిద్ధుడవుకమ్ము.

**సంజయ ఉవాచ**

**ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య**
**కృతాంజలిర్వేపమానః కిరీటీ ।**
**నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం**
**సగద్గదం భీత భీతః ప్రణమ్య ॥ 35**

**తాత్పర్యము:** కృష్ణపరమాత్ముని ఈ బోధలను ఆలకించి చేతులు జోడించి అంజలి ఘటించి, వణకుతూ, భయముతో నిండినవాడై, పార్థుడు గద్గదస్వరముతో ఈ విధముగా పలికెనని సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పెను.

**అర్జున ఉవాచ**

**స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా**
**జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।**



**రక్షాంసి భీతాని దిశోద్రవంతి సర్వే**
**నమస్యంతి చ సిద్ధసంఘాః ॥ 36**

**తాత్పర్యము:** అర్జునుడు ఈ విధముగా పల్కెను. ఓ కృష్ణా! నీ మహాత్మ్యమును విశ్వమంతయు కీర్తించుచూ ఆనందించుచున్నది. రాక్షసులందరు భీతి చెందినవారై నాలుగు దిక్కులకు పారిపోవుచున్నారు. తపోధనులందరు గూడ (సిద్ధిపొందినవారై నీకు ప్రణామము) చేయుచున్నారు. పార్థుడు భయముతో చేతులు జోడించి నమస్కరించి ఇట్లు పలికెను.

**కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్**
**గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే ।**
**అనంత దేవేశ జగన్నివాస**
**త్వమక్షరం సదసత్ తత్పరం యత్ ॥ 37**

**తాత్పర్యము:** మహాత్మా! దేవాధిదేవా! సృష్టికర్తయగు బ్రహ్మకు నీవే మూలకారకుడవు. అందువలన, దేవతలందరు నీకు ప్రణామము చేయుదురు. వీటన్నింటికిని అతీతమైన పరబ్రహ్మము నీవే కదా!

**త్వమాది దేవః పురుషః పురాణః**
**త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।**
**వేత్తాసి వేద్యం చ పరం చ ధామ**
**త్వయా తతం విశ్వమనంతరూప ॥ 38**

**తాత్పర్యము:** నీవు ఆదిదేవుడవు, అనంతరూపుడవు, పురాణపురుషుడవు, నీవు ఈ విశ్వమునంతకు అనంతమగు ఆశ్రయము నిచ్చువాడవు. నీవు తెలుసుకోవలసిన పరంధాముడవు. శ్రేష్ఠుడవు. ఈ ప్రపంచమునంతయును వ్యాపించి యున్నావు.

**వాయుర్యమోఽగ్నిర్వరుణ శ్శశాంకః**
**ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ ।**

**నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః**
**పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥ 39**

**తాత్పర్యము:** నీవు వాయుదేవుడవు, యముడవు, చంద్రుడవు, అగ్నిదేవుడవు, వరుణుడవు, అంతేకాక, కశ్యపప్రజాపతి రూపముతో వెలసియున్న బ్రహ్మవు. బ్రహ్మదేవునికే తండ్రివి. నీకు అనేక వేల నమస్కారములు. తిరిగి తిరిగి నమస్కారములు. మరల మరల వందనములు.

**నమః పురస్తాదథ పృష్ఠ తస్తే**
**నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ ।**
**అనంతవీర్యామిత విక్రమస్త్వం**
**సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥ 40**

**తాత్పర్యము:** నీకు ముందు వెనుక, అన్ని వైపుల ప్రణామము జేయుచున్నాను. నీవు అమిత విక్రమశాలియేగాక ఈ సమస్త విశ్వమంతయును వ్యాపించియున్నావు. అందువలననే నీవు సర్వేశ్వరుడవు, సర్వరూపుడవు అయి ఉన్నావు.

**సఖేతి మత్వా ప్రసభం యదుక్తం**
**హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి ।**
**అజానతా మహిమానం తవేదం**
**మయా ప్రమాదాత్ ప్రణయేన వాపి ॥ 4**

**యచ్చాపహాసార్థమసత్కృతోఽసి**
**విహారశయ్యాసన భోజనేషు ।**
**ఏకోఽథ వాప్యచ్యుత తత్సమక్షం**
**తత్క్షామయే త్వామహ మప్రమేయమ్ ॥ 42**

**తాత్పర్యము:** నీ మాహాత్మ్యము తెలియక అజ్ఞానముతో నున్న నేను నీ విశ్వరూప దర్శనము తరువాత నీ మహిమను గ్రహించినవాడనైతిని. నీ



స్నేహాధిక్యమునగాని, నీతో కలిసిమెలసి యుండుటవలనకాని, చనువుతో కాని, పొరపాటువలనగాని నిన్ను ఓ కృష్ణా! ఓ యాదవా! ఓ మిత్రమా! అని తొందరపాటుగా నిన్ను సంబోధించి యుంటిని.

అచ్యుతా! భోజనము చేయునపుడు, కూర్చుండినప్పుడు కాని, పరుండునప్పుడు కాని, మిత్రులతో ఉండునప్పుడుగాని, ఇతరులతో నుండునప్పుడుగాని నిన్ను కించపరచునట్లు ప్రవర్తించినట్లయిన నన్ను క్షమింప ప్రార్థన.

**పితాసి లోకస్య చరాచరస్య**
**త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।**
**స త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో**
**లోకత్రయేఽప్య ప్రతిమ ప్రభావ ॥ 43**

**తాత్పర్యము:** అనంతమగు శక్తి ప్రభావముకల నీవు ఈ స్థావర జంగమాత్మమైన ఈ సమస్త విశ్వమునకు తండ్రివి, గురుడవు, అగ్రజుడవు. ఈ మూడు లోకములలో నీకు సమమైనవాడుగాని, మించినవాడుగాని లేడు. మరియు నీవు యావన్మందికి పూజ్యుడవు.

**తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం**
**ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్ ।**
**పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః**
**ప్రియః ప్రియాయార్హసి దేవసోఢుమ్ ॥ 44**

**తాత్పర్యము:** అందువలన నా శరీరమును నీ పాదద్వయముకడ వంచి ఉంచి ప్రణామము చేయుటకు నేను నిన్ను సమ్మతించకోరుచున్నాను. నీవు వందనీయుడవు, సర్వేశ్వరుడవు, పుత్రాదులను తండ్రివలెను, భార్యను, భర్తవలె నేను తెలియక తెలిసిన అపరాధములన్నింటిని క్షమింప ప్రార్థించుచున్నాను.

**అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా**
**భయేన చ ప్రవ్యథితం మనో మే ।**
**తదేవ మే దర్శయ దేవరూపం**
**ప్రసీద దేవేశ జగన్నివాస ॥ 45**

**తాత్పర్యము:** నా అదృష్టముచేత ఇదివరకెప్పుడూ చూడని నీ విశ్వరూపమును దర్శించి సంతృప్తి నొందితిని. కాని, నా మనస్సు భయముతో బాధింపబడినది. అందువలన, ఓ జగన్నాథా! ప్రశాంతమైన నీ పూర్వరూపమునే చూపి ప్రసన్నుడవు కమ్ము. దేవదేవా! నన్ను అనుగ్రహింపుము.

**కిరీటినం గదినం చక్రహస్తం**
**ఇచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ ।**
**తేనైవ రూపేణ చతుర్భుజేన**
**సహస్రబాహో! భవ విశ్వమూర్తే ॥ 46**

**తాత్పర్యము:** నేను నీ పూర్వరూపమైన శంఖ, చక్ర, గదాధరునిగా, చతుర్భుజములతో వెలయుచున్న పరమాత్మగా వీక్షించకోరుచున్నాను. అందువలన, నీ పూర్వరూపముతో దర్శనమను గ్రహించు కృష్ణా!

**శ్రీ భగవాన్ ఉవాచ**

**మయా ప్రసన్నేన తవార్జునేదం**
**రూపం పరం దర్శిత మాత్మ యోగాత్ ।**
**తేజోమయం విశ్వమనంత మాద్యం**
**యన్మే త్వదన్యేన నదృష్ట పూర్వమ్ ॥ 47**

**తాత్పర్యము:** అర్జునా! తేజస్సుతో ప్రకాశించునది, ఆదియైనది, అనంతమైనది, ఇది వరకెన్నడూ ఎవరిచేత చూడబడలేనిది, సనాతనమైనది, నీ చేత మాత్రమే దర్శింపదగినది అగు నా విశ్వరూపము నీకు చూపబడినది.



**న వేదయజ్ఞాధ్యయనైర్న దానైః**
**న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః ।**
**ఏవం రూపః శక్య అహం నృలోకే**
**ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥ 48**

**తాత్పర్యము:** అర్జునా! నీవు యోధులలో శ్రేష్ఠమైనవాడవు. నీకు తప్ప ఇతరులకెవ్వరికీ ఈ నా విశ్వరూపము చూపబడలేదు. యజ్ఞయాగాదులు చేసిన వారిచే కాని, దానధర్మములు చేసిన వారిచేకాని, తీవ్రమైన తపస్సు చేసిన వారిచేకాని ఈ నా విశ్వరూపము వీక్షించుటకు అసాధ్యమైనది.

**మా తే వ్యథా మా చ విమూఢ భావో**
**దృష్ట్వా రూపం ఘోరమీ దృఙ్మమేదమ్**
**వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం**
**తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥ 49**

**తాత్పర్యము:** అర్జునా! భయంకరమైన ఈ నా విశ్వరూపమును చూచి నీవు భీతిచెందవలదు. నిర్భయముగా నుండు మనస్సును అదుపులో నుంచుకొనుము. సంతృప్తుడవై నా పూర్వరూపమునే దర్శించి కృతార్థుడవు కమ్ము.

**సంజయ ఉవాచ**

**ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా**
**స్వకం రూపం దర్శయామాస భూయః ।**
**ఆశ్వాసయామాస చ భీతమేనం**
**భూత్వా పునః సౌమ్యవపుర్మహాత్మా ॥ 50**

**తాత్పర్యము:** కృష్ణ పరమాత్మ అర్జునునితో ఆ విధముగా వివరించి, అటులనే తన పూర్వ నిజరూపమును, విశ్వాసపాత్రుడు, సౌమ్యస్వభావుడైన, భీతిచెందిన పార్థునకు చూపి ఓదార్చెను. అని సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పెను.

అర్జున ఉవాచ

**దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।**
**ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః ॥ 51**

**తాత్పర్యము:** అర్జునుడు అనుచున్నాడు. ఓ కృష్ణా! ప్రసన్నమైనట్టి నీ మనుష్య రూపమును దర్శించి నేను ప్రశాంత చిత్తుడనైతిని. ఇప్పుడు నేను నా స్వభావ సహజస్థితిని పొంది ధన్యుడనైతిని.

**సుదుర్దశమిదం రూపం దృష్టవానసి యన్మమ ।**
**దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః ॥ 52**

**తాత్పర్యము:** శ్రీ కృష్ణభగవానుడు చెప్పుచున్నాడు. ఓ అర్జునా! అత్యంత దుర్లభమగు ఏ దివ్యమైన నా విశ్వరూపమును నీవు చూచియుండితివో దానిని దేవతలు కూడా వీక్షించగోరుదురు.

**నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।**
**శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥ 53**

**తాత్పర్యము:** అర్జునా! నీవు నా చతుర్భుజ రూపమును చూచియుంటివి. ఇట్టి రూపముతో నేను వేదముల చేతగాని, తపస్సుచేత గాని, దాన, యజ్ఞముల చేతగాని చూడబడుట అసాధ్యము. కేవలం నీ అదృష్టవశముచేత నువ్వు జూడగలిగితివి.

**భక్త్యా త్వనన్యయా శక్య మేవం విధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥ 54**

**తాత్పర్యము:** శత్రుసంహారకుడవగు ఓ అర్జునా! నన్ను ఏకాగ్రమగు భక్తితోనే సాక్షాత్కరించుకొనుటకు, నాలో ఐక్యము పొంది కృతార్థుడగుటకు సాధ్యపడును. అన్యులకు అసాధ్యము.

**మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః ।**
**నిర్వైరస్సర్వ భూతేషు యస్స మామేతి పాండవ ॥ 55**



**తాత్పర్యము:** ఓ అర్జునా! ఏ మనుజుడు నా కొరకు కర్మలను, కర్తవ్యములను చేయుచుండునో, నన్నే పరమగతిగా తలంచువాడో, నాయందు భక్తిశ్రద్ధలు గలవాడో, సంసార ప్రాపంచిక విషయాదులందు ఆసక్తిలేనివాడో, వైరభావములేక సమస్తప్రాణుల సమముగా చూచువాడో అట్టివాడు నన్ను తప్పక పొందగలడు.

***ఇట్లు ఉపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జునసంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందలి విశ్వరూప దర్శనయోగమనెడి పదునొకండవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

# పన్నెండవ అధ్యాయము

# భక్తియోగము

శ్రీకృష్ణభగవానుడు విశ్వరూపదర్శనయోగములో అర్జునునకు తన విశ్వరూపమును ప్రదర్శించి ధన్యుని చేసెను. విశ్వరూపదర్శనము సగుణ బ్రహ్మోపాసన తెలియజేయును. కాని, రెండవది అయిన సాంఖ్యమునుండి పదవ అధ్యాయమువరకు నిర్గుణ ఉపాసన చెప్పబడినది. అందులకు అర్జునునకు అనుమానమువచ్చి ఏది మంచిదని అడిగితే భగవానుడు సగుణోపాసన ద్వారా నిర్గుణ బ్రహ్మమును చేరు విధానాన్ని అనగా

"మయ్యావేశ్య మనోయే మాం
నిత్యయుక్తా ఉపాసతే"..... (12-2)

అని భక్తియోగము చెప్పెను. ఇందులో జ్ఞానం తరువాత కర్మఫలత్యాగము, తరువాత భగవంతుని "కర్మఫలార్పణ"తో కర్మలు చేయుట మొదలగునవి చెప్పి, అభ్యాసముకంటె జ్ఞానము, దానికంటె ధ్యానము ఉత్తమమని చెప్పెను.

"శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్
జ్ఞానాద్ధ్యానం విశిష్యతే......" (12-12)

ఇదియే భక్తియోగము. వ్యక్తియొక్క వ్యాకులపాటు చెందిన మనస్సును అమృతము త్రాగించినట్లుచేయును. ఒకవ్యక్తియొక్క చిత్తములో "ఔన్నత్యము" ఎలా నిబిడీకృతమై ఉన్నదో గ్రహింపజేయునదే భక్తి. సత్యమును అవగాహనము చేసుకొని జీవింపచేయునదియే భక్తి.

విరక్తితోగాని, నిరాశతోగాని భగవంతుని విస్మరించకూడదు. సత్సంబంధముతో భగవంతుని అనుగ్రహము సంపాదించుకొనవలెను.



పరమభాగవతులైన ప్రహ్లాదుడు. ధ్రువుడు, అంబరీషుడు, నారదుడు, పృథువు, అక్రూరుడు, సుదాముడు, కుచేలుడు, బలిచక్రవర్తి, గోపికలు మొదలగువారు భక్తితో భగవంతుని అనుగ్రహము సంపాదించిరి. అన్ని సమయములలోను శాంతుడు, విశ్వమయుడు, జ్ఞానస్వరూపుడు, శుద్ధమైన ఆత్మస్వరూపుడు, పరమేశ్వరుడు, శాశ్వతమైనవాడు, సత్ అసత్తులకు అతీతుడైనవాడు అయిన ఆ శ్రీహరిని భక్తుడు ఏకాగ్రతమైన భక్తితో హృదయములో ప్రతిష్ఠించుకొనవలెను. ఇదియే భక్తియోగములోని ముఖ్యాంశము.

**అర్జున ఉవాచ**

**ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాంపర్యుపాసతే ।**
**యే చాప్యక్షరమవ్యక్తం తేషాంకే యోగవిత్తమాః ॥ 1**

**తాత్పర్యము:** అర్జునుడు కృష్ణపరమాత్మను అడుగుచున్నాడు. ఎల్లవేళలయందు సగుణరూపుడవు, విశ్వరూపుడవు, పరంధాముడవు, సర్వేశ్వరుడవైన నిన్ను అధికమైన ఏకాగ్రతతో ధ్యానించుదురో, నిర్గుణుడవు అయిన నిన్ను భజించుచున్నారో అట్టివారిలో యోగము నెరిగినవారు ఎవ్వరు? దయతో వివరించుము.

**శ్రీ భగవానువాచ**

**మయ్యావేశ్య మనోయే మాం నిత్యయుక్తా ఉపాసతే ।**
**శ్రద్ధయా పరయోపేతాః తే మే యుక్తతమా మతాః ॥ 2**

**తాత్పర్యము:** శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు ఈ విధముగా విశదీకరించెను. నాయందే తమ చిత్తమును కేంద్రీకరించి, నిలిపి శ్రద్ధాభక్తులతో నన్నే స్మరించుచూ ఎవరైతే ఉపాసించుచున్నారో అట్టివారు యోగులలో శ్రేష్ఠులని నాచేత భావింపబడుదురు.

**యే త్వమక్షరమనిర్దేశ్యం అవ్యక్తం పర్యుపాసతే ।**
**సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్ ॥ 3**

**సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।**
**తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః ॥ 4**

**తాత్పర్యము:** ఏ మనుజుడు తన ఇంద్రియములన్నింటిని పూర్తిగా స్వాధీనపరచుకొని, నిగ్రహించి, అంతటను సమానమైన బుద్ధికలిగి, సకల ప్రాణులకు మేలొనర్చుటకు పూర్తిగా ఆసక్తికలవాడై - వర్ణించుటకు వీలుకానిది, అన్ని ప్రదేశములలోను వ్యాపించినది, మనస్సుకు అతీతమైనది, మాయకు లొంగనిది, స్థిరమగునది, నిత్యమైనది అగు నిర్గుణ బ్రహ్మమును ఉపాసించుచున్నారో - అట్టివారు నన్నే పొందుచున్నారు.

**క్లేశోఽధికతరస్తేషాం అవ్యక్తాసక్త చేతసామ్ ।**
**అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥ 5**

**తాత్పర్యము:** వ్యక్తముగాని మనస్సునందు ఆశలు పెంచుకొన్నవారికి అక్షరబ్రహ్మ చింతనము చాలా కష్టసాధ్యమైనది. దేహాభిమానము కలవారికి కూడ నిర్గుణ బ్రహ్మము అమిత కష్టముతో పొందబడును.

**యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।**
**అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే ॥ 6**

**తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్ ।**
**భవామి నచిరాత్ పార్థ మయ్యావేశిత చేతసామ్ ॥ 7**

**తాత్పర్యము:** అర్జునా! ఏ మనుజుడు అన్ని కర్మలను నాకే అర్పించి, సగుణ రూప పరమాత్ముడైన నన్ను సర్వసమయములయందు ఏకాగ్ర భక్తియోగముతో భజింతురో అట్టివారిని శీఘ్రముగా జననమరణ సహిత మృత్యుసంసార సముద్రమునుండి నేను ఉద్ధరించి, వారిని కాపాడుదును.

**మయ్యేవ మన అధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।**
**నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ 8**



**తాత్పర్యము:** ఒక వేళ నీ మనస్సును ఏకాగ్రతతో స్థిరముగా ఉంచుకొనుట సాధ్యముకానిచో అభ్యాసయోగమనెడు ఉపాయముతో నన్ను పొందగోరుటకు ప్రయత్నించుము.

**అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।**
**అభ్యాసయోగేన తతోమామిచ్ఛాప్తుం ధనంజయ ॥ 9**

**తాత్పర్యము:** ఒక వేళ నీ మనస్సును ఏకాగ్రతతో స్థిరముగా ఉంచుకొనుట సాధ్యముకానిచో అభ్యాసయోగమనెడు ఉపాయముతో నన్ను పొందగోరుటకు ప్రయత్నించుము.

**అభ్యాసేఽప్య సమర్థోఽసి మత్కర్మపరమో భవ ।**
**మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి ॥ 10**

**తాత్పర్యము:** అభ్యాసయోగమును అవలంబించుటకు కూడ నీవు సమర్థుడవుకానిచో నా కొరకే కర్మలను ఆచరించుటవలన నీవు నన్ను పొందగోరుటకు ప్రయత్నించి పొందగలవు.

**అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।**
**సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ 11**

**శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాత్ ధ్యానం విశిష్యతే ।**
**ధ్యానాత్కర్మఫలత్యాగం త్యాగాత్ శాంతి రనంతరమ్ ॥ 12**

**తాత్పర్యము:** కర్మఫలత్యాగమునకు కూడ అసమర్థులైన, ఆత్మనిగ్రహముతో నన్నే ఆశ్రయించి శరణుపొందుతూ, సమస్తకర్మఫల త్యాగముచేసి, వాటియందు ఆశలను త్యజించి కర్మలను ఆచరింపుము. తత్త్వజ్ఞానరహితమగు అభ్యాసముకంటె జ్ఞానమే శ్రేష్ఠమైనది. జ్ఞానముకంటె ధ్యానము ఉత్తమమైనది. ధ్యానముకంటె సర్వకర్మలను త్యాగము చేయడమే ఉత్కృష్టమైనది. దానిమూలముగా శాంతిని పొందవచ్చును.

**అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।**
**నిర్మమో నిరహంకారః సమ దుఃఖసుఖః క్షమీ ॥ 13**

**తాత్పర్యము:** సర్వప్రాణులయందును ద్వేషమునులేనివాడును, వాటియందు సమానమైన, స్వార్థములేని కరుణతో యున్నవాడును, అహంకారములేక, క్షమతో మెలగువాడును, సుఖదుఃఖాదులయందు ఒకే రకమైన సమబుద్ధి కలిగియున్నవాడును, సర్వవేళలయందు సంతృప్తి కలిగినవాడును, సకల ఇంద్రియములను వశము నందుంచుకొన్నవాడును, మనస్సును తన అదుపులోనుంచుకొని, నాయందే మనోబుద్ధులను కేంద్రీకరించి అర్పించినవాడును ఎవరో, అట్టి నా భక్తుడు నాకు పరమప్రియుడు, ఇష్టుడు.

**సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।**
**మయ్యర్పితమనోబుద్ధిః యో మద్భక్తస్సమే ప్రియః ॥ 14**

**తాత్పర్యము:** సర్వప్రాణులయందును ద్వేషమును లేనివాడును, వాటియందు సమానమైన, స్వార్థములేని కరుణతో యున్నవాడును, అహంకారము లేకుండా, క్షమతో మెలగువాడును, సుఖదుఃఖాదులయందు ఒకే రకమైన సమబుద్ధి కలిగి యున్నవాడును, సర్వవేళలయందు సంతృప్తి కలిగినవాడును, సకల ఇంద్రియములను వశము నందుంచుకొన్నవాడును, మనస్సును తన అదుపులో నుంచుకొని, నాయందే మనోబుద్ధులను కేంద్రీకరించి అర్పించినవాడును ఎవరో అట్టి నా భక్తుడు నా పరమప్రియుడు ఇష్టుడు.

**యస్మాన్నో ద్విజతే లోకో లోకాన్నో ద్విజతే చ యః ।**
**హర్షామర్షభయోద్వేగైః ముక్తోయస్సచమే ప్రియః ॥ 15**

**తాత్పర్యము:** ఏ మనుజునివలన ఈ విశ్వము భయరహితమై ఉండునో, మరియు లోకమునుండి నిర్భయుడై మెలగునో, ఆనందము, ఈర్ష్య, అసూయ, ఉద్వేగము మొదలగువాటినుండి స్వేచ్ఛను సంపాదించినవాడో అట్టి భక్తుడు నాకు ఇష్టమైనవాడు అగుచున్నాడు.



**అనపేక్షః శుచిర్దక్షః ఉదాసీనో గతవ్యథః ।**
**సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్సమేప్రియః ॥ 16**

**తాత్పర్యము:** ఏ భక్తుడు దేహేంద్రియాదులందు వాంఛలు లేనివాడో, పరిశుద్ధమైన మనస్సుకలవాడో, ఉదాసీనుడు, ప్రయత్నములేకుండా లభించిన వస్తువులయందు ఆశలేనివాడును, పుణ్యాపాపములను త్యజించిన భక్తుడు నాకు ఇష్టుడు.

**యోన హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।**
**శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్సమే ప్రియః ॥ 17**

**తాత్పర్యము:** ఏ మనుజుడు, ఇష్టమైన వస్తువులు ప్రాప్తించినపుడు ఆనందముతో పొంగిపోడో, ఇష్టములులేని వస్తువులకు దుఃఖపడడో, దేనియందు కోరికలులేనివాడో, అటులనే శుభాశుభకర్మలను విడిచినవాడో అట్టి భక్తుడు నాకు ప్రియమైనవాడు.

**సమశ్శత్రౌ చ మిత్రే చ తథామానావమానయోః ।**
**శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః ॥ 18**

**తాత్పర్యము:** శత్రువులయందును మిత్రులయందును, అటులనే మానావమానములయందును, శీతోష్ణ, సుఖదుఃఖాదులయందును ఒకే విధమైన, అనగా సమానభావములను కలిగియుండువాడును, దేనియందును ఆసక్తిలేని భక్తుడు నాకు ప్రియుడు.

**తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్ ।**
**అనికేతః స్థిరమతిః భక్తిమాన్ మే ప్రియో నరః ॥ 19**

**తాత్పర్యము:** నిందలను, పొగడ్తలను సమముగా గ్రహించినవాడును, మననశీలుడును, వాక్పటిమకలవాడును, ఏమి లభించినను, లభించకపోయినను సంతృప్తి పొందినవాడును, స్థిరమైన మనస్సు కలవాడును అగు భక్తుడు నాకు ఇష్టుడు.

**యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।**
**శ్రద్ధ ధానా మత్పరమా భక్తాస్తేఽ తీవ మే ప్రియాః ॥ 20**

**తాత్పర్యము:** ఏ భక్తులు శ్రద్ధతో, ఏకాగ్రతతో నాయందు అనురాగము, అమృత సమానమగు ధర్మమును, అచంచలమైన భక్తిభావముతో ఉత్తమోత్తమముగా సేవించుచూ అనుష్టించుచున్నారో, అట్టి పరమభక్తులు నాకు అత్యంత ప్రియులు, ఇష్టులు. అని భగవానుడైన శ్రీకృష్ణపరమాత్మ విశదీకరించెను.

***ఇట్లు ఉపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జున సంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందలి భక్తియోగమనెడు పంద్రెండవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

## పదమూడవ అధ్యాయము

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగము

క్రిందటి పంద్రెండవ అధ్యాయములో శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు భక్తియోగము గురించి చెప్పి అర్జునుని చైతన్యపరచెను. ఈ క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగములో, అర్జునుడు ప్రకృతి పురుషుడు, క్షేత్రము క్షేత్రజ్ఞుడు, జ్ఞానము జ్ఞేయములను వివరించమని పరమాత్మను వేడుకొనుచున్నాడు.

**"ప్రకృతిం పురుషం చైవక్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ ।**
**ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ ॥**

ఈశరీరము క్షేత్రమని, దీనిని గ్రహించినవాడు క్షేత్రజ్ఞుడని భగవానుడు చెప్తూతూ దానికి సంబంధించిన అనేక విషయములను అర్జునునకు కృష్ణపరమాత్మ విపులముగా ఈ అధ్యాయములో చెపుచున్నాడు.

సూర్యుడు తనకిరణములతో విశ్వమునంతటను ప్రకాశించుచుండును. కాని, అంధునకు అది కన్పించదు. అటులనే విశ్వవ్యాప్తమైన బ్రహ్మము అజ్ఞానికి గోచరించదు. వస్తుదర్శనము సత్యమైనది నిత్యమైనదికాదు. వాయువు, ధ్వని, ఆకాశము మొదలగునవి మన కళ్లకు గోచరములుకావు. అంతమాత్రమున అవిలేనట్లా. విశ్వములోని సర్వస్వమును గ్రహించు శక్తి, తెలివియే జ్ఞానము అని ఎరుగవలెను. అని వాటి ప్రాధాన్యతలను తెలియజేస్తాడు. జ్ఞానయోగముయొక్క విశిష్టతను గురించి ఈ క్షేత్రక్షేత్రజ్ఞ విభాగము విపులముగా చర్చించుచున్నది. భక్తియోగము చివరలో

**"యేతు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే ।**
**శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేఽ తీవ మే ప్రియాః ॥**

అయితే సగుణోపాసన భక్తితోపాటు, ఆ భక్తి ఉపాసన చేసే శరీరము, దానిలోపల ఉన్న పరమాత్మను గూడ తెలుసుకోవాలని భగవానుడు తలచెను. అందుకే ''ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిధీయతే" అని మొదలుపెట్టాడు. అయితే చూడడానికి సంబంధంలేనట్లుగా అనిపించే ఈ రెండు విషయాలును - అనగా సగుణోపాసన క్షేత్రక్షేత్రజ్ఞ విభాగము అనుసంధించటానికి అనునట్లు తరువాతవారు అర్జునుడు అడిగినట్లుగా ఒకశ్లోకం ఇందులో కూర్చారు. అదేమిటంటే-

**"ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ ।**
**ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ ॥**

ఇది మూలంలో లేదు గనుక భగవత్పాద శ్రీ శంకరాచార్యులవారు దీనికి వ్యాఖ్యానం వ్రాయలేదు. ఇది ఉన్నా తప్పులేదు. లేకున్నా తప్పులేదు. కాకపోతే అల్పబుద్ధులైన జిజ్ఞాసువులకొరకు ఉంటే మంచిదే.

**ఇక అధ్యాయ సారం :** ఈ శరీరమే క్షేత్రం అంటే నశించే స్వభావము కలది. అని అలా తెలుసుకొన్నవాడు క్షేత్రజ్ఞుడు. అయితే ఇందులో క్షేత్రజ్ఞుడు శాశ్వతుడు. శరీరం ప్రకృతి అయితే క్షేత్రజ్ఞుడు పురుషుడు. శరీరంలోని సుఖదుఃఖాలను అనుభవించేవాడు. అయితే అతడే ఉపద్రష్ట - (సాక్షి) అనుమంత (ఆమోదకుడు). అయితే తనను తాను పరమాత్మగా తెలుసుకొంటాడు. అలా తెలుసుకోవటం జ్ఞానం. తెలియబడేవాడు అంటే జ్ఞేయం - పరమాత్మ - తెలుసుకొనే విధానము అమానిత్వము, అదంభిత్వము, ఆర్జవము మొదలైనవి.

సూర్యుడు ప్రపంచాన్ని ఎట్లు ప్రకాశింపజేస్తాడో, క్షేత్రజ్ఞుడు ఇంద్రియాదులు కలిగిన దేహాన్ని ప్రకాశింపజేస్తాడు. ఆకాశంలో అగ్ని ఉన్నా ఆకాశం ఎలా కాల్చబడదో, దేహంలో ఉన్నా కూడ క్షేత్రజ్ఞుడు ఆకాశ స్వరూపునివలె దేని చేత తాకబడడు.



**శ్రీభగవాన్ ఉవాచ**

**ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిధీయతే ।**
**ఏతద్యోవేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ 1**

**తాత్పర్యము:** ప్రకృతి పురుషుడు, క్షేత్రము క్షేత్రజ్ఞుడు, జ్ఞానజ్ఞేయములు అనేటువంటి ఈ విషయములను తెలుసుకొన గోరుచున్నానని అర్జునుడు శ్రీకృష్ణభగవానుని అడిగినప్పుడు భగవానుడు ఈ విధముగా వివరించెను. ఈ భోగమయమైన శరీరమే క్షేత్రమని, ఇది గ్రహించినవారు క్షేత్రజ్ఞుడని తత్త్వమును ఎరిగినవారు చెప్పుదురు.

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।**
**క్షేత్రక్షేత్రజ్ఞయోః జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ ॥ 2**

**తాత్పర్యము:** అర్జునా! సర్వప్రాణుల శరీరములలోను నేనున్నాను. అట్టినన్ను క్షేత్రజ్ఞునిగా ఎరుగుము. క్షేత్రక్షేత్రజ్ఞులనే ఏ జ్ఞానముకలదో అదియే నిజమైన జ్ఞానమని నా అభిప్రాయము.

**తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ ।**
**స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥ 3**

**తాత్పర్యము:** ఆ క్షేత్రము ఏదియో, ఎట్టి విధముగా ఉన్నదో, ఎటువంటి వికారములతో కూడి యున్నదో, ఎట్లు ఆవిర్భవించినదో, ఆ క్షేత్రజ్ఞుడు ఎవరో, ఏ విధమైన మహిమలు కలవాడో - ఈ వివరములను నానుండి వినుము.

**ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్ ।**
**బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥ 4**

**తాత్పర్యము:** ఋషులచే క్షేత్రక్షేత్రజ్ఞుల గొప్పతనము, మాహాత్మ్యము వేదములలో నిబిడీ కృతములైన మంత్రములద్వారా అనేక విధములుగా

వివరించబడినది. హేతువులతోకూడి సంశయములేని బ్రహ్మసూత్రములు సూచించును ఉపనిషత్తులచేతను కూడ తెలియచేయబడినది.

**మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ ।**
**ఇంద్రియాణి దశైకం చ పంచచేంద్రియ గోచరాః ॥ 5**

**తాత్పర్యము:** పంచ మహాభూతములైన పృథివ్యాపస్తేజో వాయురాకాశముల బుద్ధి, అహంకారము, అవ్యక్తమును, అటులనే పదిజ్ఞానేంద్రియ కర్మేంద్రియములును, అదే విధముగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు తెలియజేయబడినవి.

**ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః ।**
**ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ ॥ 6**

**తాత్పర్యము:** అటులనే కోరిక, ద్వేషము, సుఖదుఃఖాదులతో కూడినది, చైతన్యము, మోహములతో ఆవరింపబడిన ఈ క్షేత్రము సంగ్రహముగా వివరించబడినది.

**అమానిత్వ మదంభిత్వం అహింసాక్షాంతిరార్జవమ్ ।**
**ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మ వినిగ్రహః ॥ 7**

**ఇంద్రియార్థేషు వైరాగ్యం అనంహంకార ఏవ చ ।**
**జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషాను దర్శనమ్ ॥ 8**

**తాత్పర్యము:** తాను ఉత్తముడనే అహంకారము లేకుండుట, తాను ఆచరించవలసిన ధర్మమును నిర్వర్తించుట, ఇతరులు హింసింపబడకుండా మెలగుట, క్షమతో ఉండి కుటిలత్వమును వదలుట, గురువులకు సేవచేయుట, ఇంద్రియములను స్వాధీనములో నుంచుకొనుట మొదలగునవి ఆచరించుతూ సన్మార్గముతో మెలగవలెను.

ఇంద్రియములను అదుపులో నుంచుకొని, అశాశ్వత భౌతిక భోగములయందు అనాసక్తిని గలిగి, అభిమానమును పరిత్యజించుట, జన్మ, జరా, రోగాదులు, దుఃఖాదులను గురించి తరచుగా ఆలోచించుట వాటియందుగల దోషాలను భావించి తలంచుతూ నిగ్రహమును పాటించవలెను.



**అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।**
**నిత్యం చ సమచిత్తత్వం ఇష్టానిష్టోపపత్తిషు ॥ 9**

**మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।**
**వివిక్తదేశసేవిత్వం అరతిర్జన సంసది ॥ 10**

**అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।**
**ఏతద్ జ్ఞానమితిప్రోక్తం అజ్ఞానం యతతోఽ న్యథా ॥ 11**

**తాత్పర్యము:** భార్య, పుత్ర, గృహము మొదలగు భౌతిక విషయములయందు ఆసక్తిలేకుండా యుండుట, మమత్త్వము వీడుట, శుభాశుభములు, ఇష్టానిష్టములు సంభవించినపుడు నిత్యమగు సమత్వభావమును పొందియుండుట, పరమేశ్వరుడనైన నా మీద భక్తితో నేనే సర్వస్వమని భావించి ఏకాంత ప్రదేశమున స్థిరపడి, నీతిహీనులతో సాంగత్యమును వీడి అనిచ్ఛతోనుండుట, నిత్యము ఆధ్యాత్మిక జ్ఞానమునందు ఏకాగ్రతతో స్థిరముగానుండుట, తద్వారా మోక్షజ్ఞానమును గ్రహించుట, మొదలగు ఈ సాధనములన్నియు తత్త్వజ్ఞానార్జనకు సాధనములు. వీటికంటె ఇతరములైనవి. అజ్ఞాన సహితములైనవి. జ్ఞానమును పొందుటకు ప్రతిబంధకములు.

**జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వామృత మశ్నుతే ।**
**అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాస దుచ్యతే ॥ 12**

**తాత్పర్యము:** దేనిని తెలుసుకొనిన మోక్షము పొంద అర్హతకలుగునో, దానిని వివరించెదను. ఏది ఆదిరహితమగు పరబ్రహ్మమో, ఏది సత్తని కాని

అసత్తనికాని ప్రకటించబడదో అట్టి జ్ఞేయమును నీకు విశదీకరించుచున్నాను. అని కృష్ణభగవానుడు అర్జుననకు చెప్పుతూ ఇంకనూ ఈ విధముగా వివరించుచున్నాడు.

**సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షి శిరోముఖమ్ ।**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ 13**

**సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్ ।**
**అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ 14**

**తాత్పర్యము:** అంతటను హస్తములను, పాదములను, నేత్రములు, చెవులును, శిరస్సులు, ముఖములు కలిగియున్న ఆ పరమేశ్వరుడు సర్వమును వ్యాపించియున్నాడు.

ఇంద్రియరహితుడు, కాని ఇంద్రియముల వ్యాపారములన్నింటియందు లీనమైనవాడు. కాని, వాస్తవముగా ఆసక్తిలేనివాడు, విశ్వమంతయును భరించిన త్రిగుణరహితుడు. అయినను గుణములను పాలించువాడు పరంధాముడు.

**బహిరంతశ్చ భూతానాం అచరం చరమేవ చ ।**
**సూక్ష్మత్వాత్ తత్ అ విజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ ॥ 15**

**తాత్పర్యము:** అదియునుగాక సర్వభూతములను తెలిసినవాడు, బయట లోపలకూడ ఉన్నవాడు, సూక్ష్మరూపుడును, తెలియబడకున్నవాడు, ప్రత్యక్షముగాకాని, శబ్దరూపముగా కాని గోచరము గానివాడు అగు అతడే బ్రహ్మము.

**అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।**
**భూతభర్తృ చ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ 16**



**తాత్పర్యము:** కారణస్వరూపమున అభిన్నమైనవాడును, సంపూర్ణమైనవాడును, సర్వభూతముల ఆకారములతో విభిన్నముగా గోచరించువాడును, సృష్టికర్తయును, లయకారుడును అతడే. అతడే బ్రహ్మము.

**జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే ।**
**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥ 17**

**తాత్పర్యము:** ఆ పరబ్రహ్మ అన్ని జ్యోతులకంటెను జ్యోతిర్మయమైనది. చీకటికంటె భిన్నమైనది. జ్ఞానమును జ్ఞేయమును జ్ఞానముచేత పొందుటకు తగినది. సమస్త ప్రాణుల హృదయములలోను నిక్షిప్తమై ఉన్నది.

**ఇతి క్షేత్రం తథాజ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।**
**మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే ॥ 18**

**తాత్పర్యము:** ఈ రీతిగా క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయములను గురించి క్లుప్తముగా వివరించబడినది అని గ్రహించిన నా భక్తుడు సమర్థుడు. నా స్వరూపమును, బ్రహ్మమును పొంది ధన్యుడగును.

**ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।**
**వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్ ॥ 19**

**కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే ।**
**పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే ॥ 20**

**తాత్పర్యము:** ప్రకృతి పురుషుడు ఈ ఉభయులు గూడ ఆదిలేనివారుగా గ్రహింపుము. వికారములు, గుణములు మొదలైనవి ప్రకృతి మూలముగా జనించినవి అని గ్రహింపుము.

కార్యకారణ రూపములు ఏర్పడుటకు ప్రకృతియే కారణము. భోగాది విషయమువలన ఏర్పడు సుఖదుఃఖములకు పురుషుడే కారణభూతుడైయున్నాడని

చెప్పబడుచున్నదని ప్రకటించుటలో సందేహములేదు. అనగా జీవాత్మయే కారణమని తెలియబడుచున్నది.

**పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్ ।**
**కారణం గుణసంగోఽస్య సదసద్యోని జన్మసు ॥ 21**

**తాత్పర్యము:** పురుషుడు ప్రకృతినుండి వచ్చినవాడు. అందువలన ప్రకృతినుండి జనించిన సుఖ, దుఃఖ, మోహాది రూపములను అనుభవించును. అందువలన ఆ గుణ సంగకారణము చేతనే అతనికి ఉత్తమ, అధమ జన్మలు ప్రాప్తించి, అట్టి ఆసక్తికి కారణభూతుడగుచున్నాడు.

**ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః ।**
**పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః ॥ 22**

**తాత్పర్యము:** ఈ దేహమునందున్న స్థిరమైయున్న ఆత్మ స్వతంత్రుడు. సాక్షి. ఆమోదకుడు, పాలకుడు, అనుభవించువాడును, పరమేశ్వరుడును, పరమాత్మ అని పేర్కొనబడుచున్నాడు.

**య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।**
**సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥ 23**

**ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మాన మాత్మనా ।**
**అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ 24**

**తాత్పర్యము:** ఈ విధముగా ఏ పురుషుడు గుణసమూహములతో నిండియున్న ప్రకృతిని గ్రహించియున్నాడో, అట్టి మనుజుడు సర్వవిధముల ప్రవర్తించుచున్నను తిరిగి జన్మింపడు.

కొందరు ధ్యానము చేతను, మరికొందరు జ్ఞానయోగముచేతను, మరికొందరు శుద్ధమైన అంతఃకరణమువలనను వీక్షించుచూ చైతన్యమును పొందుచున్నారు.



**అన్యే త్వేవమజానంతః శృత్వాన్యేభ్య ఉపాసతే ।**
**తేపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥ 25**

**తాత్పర్యము:** ఈ విధముగా గ్రహించలేని మందబుద్ధులు తత్త్వజ్ఞులైన ఇతర ప్రముఖులనుండి చైతన్యముపొంది శ్రవణాసక్తులై మృత్యుమయమగు సంసారసాగరమును దాటుచున్నారు.

**యావత్సంజాయతే కించిత్ సత్త్వం స్థావరజంగమమ్ ।**
**క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్ తద్విద్ధి భరతర్షభ ॥ 26**

**సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం ।**
**వినశ్యత్స్వ వినశ్యంతం యః పశ్యతి స పశ్యతి ॥ 27**

**తాత్పర్యము:** అర్జునా! స్థావర రూపమైన ఏ ప్రాణి జన్మించుచున్నదో అది క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగము వలననే అని గ్రహించవలెను.

సర్వజీవరాసులయందు సమానమైన విధముగా నుండువాడును, అవి నశించినను తాను నశింపక వికసించుతూ ఉండు ఆ పరమేశ్వరుని ఎవరు పరిశుద్ధమైన భావముతో వీక్షించునో అతనే యథార్థదర్శి, సత్యముగా చూచువాడు.

**సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।**
**న హిన స్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥ 28**

**ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।**
**యః పశ్యతి తథాత్మానం అకర్తారం స పశ్యతి ॥ 29**

**తాత్పర్యము:** సమస్త ప్రదేశములందును, సకల భూతములయందును ఆ పరమాత్మను, సమాన భావముతో ఏ మనుజుడు కాంచుచున్నాడో అట్టివాడు ఆత్మహంతకుడు కాక మోక్షమును పొందుటకు అర్హుడు.

మరియు మనస్సు, వాక్కుల కారణముగాను, ప్రకృతి చేతను మాత్రమే చేయబడుచున్నవని, కర్మలకు ఆత్మకారణము కాదని ఎవరు నిజముగా భావించుచున్నారో వారే నిజముగా దర్శించువారగుచున్నారు.

**యదా భూతపృథగ్భావం ఏకస్థమను పశ్యతి ।**
**తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥ 30**

**తాత్పర్యము:** ఎవడు సర్వభూతముల వైవిధ్యాన్ని వేర్వేరు భావమును ఒకే ఆత్మయందు వెలసియున్నవని, మరియు ఆత్మనుండియే ఉత్పత్తిని, నానావిధములగు, తత్త్వమును శాస్త్రప్రకారం దర్శించుచుండునో అట్టి మనుజుడు బ్రహ్మత్వమును పొంది బ్రహ్మ స్వరూపుడగును.

**అనాదిత్వాన్నిర్గుణ త్వాత్ పరమాత్మాయ మవ్యయః ।**
**శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే ॥ 31**

**యథాసర్వగతం సౌక్ష్మ్యాత్ ఆకాశం నోపలిప్యతే ।**
**సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే ॥ 32**

**తాత్పర్యము:** అర్జునా! ఆ పరమాత్మ ఆదిరహితుడు. త్రిగుణ సంబంధరహితుడు. నాశనములేనివాడు. ఆ పరమాత్మ శరీరము నందున్నప్పటికి కర్మలేమియును చేయడు. కర్మఫలముచే అంటబడడు.

ఆకాశము సర్వగతమైనను సూక్ష్మమైనది. అది అంటుసొంటు లేనిది. అటులనే ఆత్మ దేహమునందు అంతట ఉన్నను దేహాన్ని అంటి ఉండక తటస్థంగా ఉంటుంది.

**యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః ।**
**క్షేత్రంక్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥ 33**

**తాత్పర్యము:** అర్జునా! సూర్యుడు ఒక్కడే. అయినా ఈ సమస్త విశ్వమును తన కిరణకాంతులతో ప్రకాశింపజేయును. ఆ విధముగా ఒకే క్షేత్రజ్ఞుడు, క్షేత్రమునంతటిని ప్రకాశింపజేయుచు స్థిరమైయుండును. అజ్ఞానమయమైన విశ్వమునంతటిని ప్రకాశింపజేయుచున్నాడు.



**క్షేత్రక్షేత్రజ్ఞయో రేవం అంతరం జ్ఞాన చక్షుషా ।**
**భూత ప్రకృతి మోక్షం చ యే విదుర్యాంతి తే పరమ్ ॥ 34**

**తాత్పర్యము:** ఈ విధముగా క్షేత్రక్షేత్రజ్ఞుల మధ్య భేదమును, మరియు భూతప్రకృతిని జ్ఞాననేత్రములద్వారా ఎవరు గ్రహింతురో, మోక్షమును తెలిసికొనుచున్నారో వారు పరబ్రహ్మమును పొంది మోక్షమును పొందుచున్నారు.

***ఇట్లు ఉపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జునసంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందలి క్షేత్రజ్ఞ విభాగమనెడు పదుమూడవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

## శ్రీకృష్ణామృతవాణి

## పదునాల్గవ అధ్యాయము

# గుణత్రయ విభాగయోగము

అర్జునుడు గుణాతీతుని లక్షణములు తెలుపుమని శ్రీకృష్ణ పరమాత్మను అడుగుతూ, ఆ స్థాయికి చేరుకొనుటకు ఎటువంటి మానసిక స్థితి మొదలైనవి అవసరమో వాటిగురించి వివరించమని కోరుతాడు.

గుణములు మూడు విధములు. సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము. సత్త్వగుణము తపస్సు, యజ్ఞము, దానము, నాయందు విశ్వాసము మొదలగు వాటిద్వారా లభించునని – రజోగుణము కార్యములయందు కోరిక, స్వార్థము, భోగములయందు ఆసక్తిని సూచించునని, తమోగుణము కార్యములయందు మోహము, అసత్యము పలుకుట, శోకము మొదలగువాటిని కలిగిస్తుందని అర్జునునకు కృష్ణభగవానుడు వివరించెను.

గుణాతీతుడైనవాడు మానావమానములను సమానముగా భావించి, మిత్రులయందు మమకారముగాని, శత్రువులయందు వికారము, విముఖత్వము గాని కలిగియుండడు. ఈ గుణాతీతభావము జ్ఞానముద్వారా ఉద్భవించును. సమస్త ప్రాణులయందు పరమాత్మ సమాన స్థితుడైయున్నాడని తెలిసికొనుట సాత్త్వికజ్ఞానము. ఇతడు సాత్త్విక జ్ఞాని. విశ్వములోని వివిధ వస్తువులను వేరువేరుగా గ్రహించేది రాజస ప్రవృత్తి. తామసజ్ఞానము ఈ శరీరానికి సంబంధించిన భౌతిక పదార్థములు, ప్రకృతి కార్యమైన శరీరమే సమస్తమని భావించును.

పురుషుడు తమోగుణము నుండి రజోగుణానికి, రజోగుణము నుండి విముక్తి పొంది సాత్త్విక గుణానికి చేరుకొని గుణాతీతుడై ఉండాలి. గుణములను శుద్ధిపరచుకొనుచూ, గుణాతీతుడవడానికి మార్గాన్వేషణ చేయుచూ గుణములకు అతీతుడై ప్రవర్తించవలెనని గుణత్రయ విభాగయోగము బోధించుచున్నది.

సాత్త్వికగుణము కలుగు మనుజుడు స్వర్గాది ఊర్ధ్వలోకములకు, రాజసగుణము కలవాడు మానవ లోకమునకు, తమోగుణము కలవాడు నరకాది అధో లోకములకు పోవుచున్నాడు. ఈ త్రిగుణములకు అతీతుడై ఎవరు నన్ను తలంచుదురో వారు నన్నే పొందుచున్నారు అని భగవానుడు చెప్పుచున్నాడు.

ఇవి గుణత్రయ విభాగ యోగములోని ముఖ్యమైన అంశములు.

**శ్రీభగవాన్ ఉవాచ**

**పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్ ।**
**యద్ జ్ఞాత్వామునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః ॥ 1**

**తాత్పర్యము:** భగవానుడైన శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. జ్ఞానములన్నింటిలోను బహుళశ్రేష్ఠమైన జ్ఞానమేదైతే ఉందో అట్టి అత్యుత్తమమైన జ్ఞానమును గ్రహించి భౌతిక బంధములనుండి విముక్తి పొందినారో తిరిగి ఆ విషయములను గురించి చెప్పెదను.

**ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః ।**
**సర్గేఽపి నోపజాయంతే ప్రళయే న వ్యథంతి చ ॥ 2**

**మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।**
**సంభవః సర్వభూతానాం తతో భవతి భారత ॥ 3**

**తాత్పర్యము:** ఈ జ్ఞానమును ఆశ్రయించి నా స్వరూపమునే పొందినవారు సృష్టి, స్థితి, లయముల వలయాకారంలోని సృష్టికాలమందు గూడ జన్మింపరు. ప్రళయకాలమందున వ్యథ చెందరు, నశింపరు.

అర్జునా! ప్రకృతి త్రిగుణాత్మకమైనది. అది నాకు గర్భస్థానము. అది మాయ. దానిలో నేను సృష్టిబీజమును దానము చేయుచున్నాను. అందులోనుండి సర్వప్రాణుల ఉత్పత్తి జరుగుచున్నది.

**సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవంతి యాః ।**
**తాసాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజప్రదః పితా ॥ 4**

**తాత్పర్యము:** అర్జునా! నానా యోనులనుండి పుట్టుచున్న ప్రాణులన్నింటికిని మూల ప్రకృతియే మాతృస్థానము. నేను బీజమును దానము చేసెదు తండ్రిని.

**సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ।**
**నిబధ్నంతి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్ ॥ 5**

**తాత్పర్యము:** అర్జునా! త్రిగుణములైన సత్త్వ, రజస్తమో గుణములు ప్రకృతినుండి ఉత్పన్నమై నాశనములేని ఆత్మను శరీరమున బంధించుచున్నవి.

**తత్ర సత్త్వం నిర్మల త్వాత్ ప్రకాశక మనామయమ్ ।**
**సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ ॥ 6**

**తాత్పర్యము:** పాపరహితుడగు! అర్జునా! ఈ త్రిగుణములో సత్త్వగుణము నిర్మలమైనది. అందువలన అది నిర్వికారమైనది, ఉపద్రవ రహితమైనది. చైతన్యమును చేకూర్చుచున్నది. జ్ఞానమునందు ఆసక్తిచేత ఆత్మను బంధించుచున్నది.

**రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సంగముద్భవమ్ ।**
**తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్ ॥ 7**

**తాత్పర్యము:** అర్జునా! రజోగుణము రాగాత్మకమైనది. విషయములయందు కర్మలయొక్క ఫలముల కూడికతో బంధించును. కర్మములు దృష్టా దృష్ట ఫలములకు కారణములు.



**తమస్ అజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।**
**ప్రమాదాలస్యనిద్రాభిః తన్నిబధ్నాతి భారత ॥ 8**

**తాత్పర్యము:** అర్జునా! దేహాభిమానము తమోగుణ ప్రభావముచే వచ్చినది. అది అజ్ఞానమునుండి ఆవిర్భవించినది. శరీరధారులందరికిని మోహము కలుగజేయునదని గ్రహింపుము. ఈ తమోగుణము మఱపు, సోమరితనము, అతి నిద్ర మొదలగు వానిచేత ఆత్మను బంధించును.

**సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత ।**
**జ్ఞానమావృత్యతు తమః ప్రమాదే సంజయత్యుత ॥ 9**

**రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।**
**రజఃసత్త్వం తమశ్చైవ తమః సత్త్వం రజస్తథా ॥ 10**

**తాత్పర్యము:** అర్జునా! సత్త్వగుణము మనుజుని సుఖమును కల్గించును. రజోగుణము కర్మలయందు నిమగ్నముజేయును. తమోగుణము జ్ఞానమును నశింపజేసి ఆపదలలో పడవేయును.

అర్జునా! రజోగుణము తమోగుణమును అణచివేయుచు సత్త్వగుణమును కలిగించుచున్నది. తమోగుణము అటులనే సత్త్వగుణములను అణచివేసి రజోగుణము వృద్ధి నొందించుచున్నది.

**సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే ।**
**జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వమిత్యుత ॥ 11**

**తాత్పర్యము:** ఈ శరీర సర్వ ఇంద్రియములయందు ఏ సమయమున బుద్ధి, జ్ఞానరూపమగు ప్రకాశజ్ఞానము ఉద్భవించుచున్నదో అప్పుడే సత్త్వగుణము వృద్ధినొందునని గ్రహింపుము.

**లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా ।**
**రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ ॥ 12**

**తాత్పర్యము:** అర్జునా! రజోగుణము వృద్ధియైనకొలది లోభము, లౌకిక, ప్రాపంచిక కర్మలయందు మోహము, వాటియందు ఆసక్తి, అశాంతి, భోగవాంఛలు మొదలగు గుణములు కలుగుటయే గాక వృద్ధి చెందుచుండును.

**అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।**
**తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన ॥ 13**

**తాత్పర్యము:** ఓ అర్జునా! తమోగుణము ఆవరించి వృద్ధి చెందినప్పుడు అవివేకము, ప్రయత్న సాధనలోపము, కర్తవ్యమునందు విముఖత, సోమరితనము, ఉదాసీనత, మూఢత్వము మొదలగునవి కలుగుచున్నవి.

**యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్ ।**
**తదోత్తమ విదాం లోకాన్ అమలాన్ ప్రతిపద్యతే ॥ 14**

**తాత్పర్యము:** సత్త్వగుణము వృద్ధినొందిన మనుజుడు దేహత్యాగము చేసినపుడు ఉత్తమజ్ఞానులకు, ఉపాసకులకు కలుగు సుఖలోక భోగపుణ్య లోకములను పొందును.

**రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే ।**
**తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే ॥ 15**

**తాత్పర్యము:** రజోగుణము వృద్ధిచెందుచున్న సమయములో మనుజుడు మృతి చెందినచో కర్మలయందు ఆసక్తి కలిగినటువంటి మానవులలో జన్మించును. అటులనే తమోగుణము అభివృద్ధి చెందుచున్న సమయములో మరణించిన మనుజుడు మూఢ జీవులయందు జన్మించును.

**కర్మణః సుకృత స్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।**
**రజసస్తు ఫలం దుఃఖం అజ్ఞానం తమసః ఫలమ్ ॥ 16**

**సత్త్వాత్ సంజాయతే జ్ఞానం రజసోలోభ ఏవ చ ।**
**ప్రమాదమోహౌ తమసో భావతోఽజ్ఞానమేవ చ ॥ 17**



**తాత్పర్యము:** సత్త్వగుణమునకు సంబంధించిన శ్రేష్ఠమైన కర్మకు సాత్త్వికమైన ఫలము లభించునని, రాజసమగు కర్మకు ఫలము దుఃఖమని, తామస కర్మకు ఫలము అజ్ఞానమని జ్ఞానులు చెప్పుదురు.

సత్త్వగుణము ద్వారా జ్ఞానము లభించును. రజోగుణముద్వారా లోభము, తమోగుణము మూలముగా ప్రమాదంతో కూడిన మోహము, అజ్ఞానములు కలుగును.

**ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః ।**
**జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః ॥ 18**

**నాన్యం గుణేభ్యః కర్తారం యదాద్రష్టాను పశ్యతి ।**
**గుణేభ్యశ్చ పరంవేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥ 19**

**తాత్పర్యము:** సత్త్వగుణము కలిగినవారు దేవలోకములకు, రాజసగుణముగల మనుజులు మానవలోకమునకు, నీచగుణమైన తామసమను అంధకారమునకు లోనైనవారు అధోలోకమునకు పోవుదురు.

దూరదృష్టికల ద్రష్ట ఈ మూడు గుణములకంటెను వేరొకదానిని కర్తగా వీక్షించడో, భిన్నమైనదానిని గుర్తించక ఆత్మజ్ఞానమును పెంపొందించు కొన్నటువంటి ఆత్మజ్ఞాని నా స్వరూపమునే యథార్థముగా పొందుచున్నాడు.

**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహ సముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుఃఖైః విముక్తోఽమృతమశ్నుతే ॥ 20**

**తాత్పర్యము:** ఏ మనుజుడు దేహోత్పత్తికి మూలకారణములైన ఈ త్రిగుణములను అధిగమించునో, జన్మ జరామరణములనబడు దుఃఖ బంధములనుండి విముక్తిని పొంది పరమానందమైన అమృతత్త్వమును అనగా మోక్షమును తప్పక పొందును.

**అర్జున ఉవాచ**

**కైర్లింగైః త్రీన్ గుణానేతాన్ అతీతో భవతి ప్రభో ।**
**కిమాచారః కథం చైతాన్ త్రీన్ గుణానతివర్తతే ॥ 21**

**తాత్పర్యము:** కృష్ణా! ఈ త్రిగుణములను అతిక్రమించిన పురుషుడు ఏ లక్షణములతో, ఏ ఆచార వ్యవహారములతో కూడియుండి ఏ ఉపాయముతో, ఏ ఆచరణతో వీటినుండి అతీతుడగుచున్నాడని అర్జునుడు పరమాత్మను వేడుకొనెను.

**శ్రీ భగవాన్ ఉవాచ**

**ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ ।**
**న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥ 22**

**తాత్పర్యము:** శ్రీకృష్ణ భగవానుడు పలికెను. అర్జునా! ఆవరించినట్టి సత్త్వ, రజో, తమో గుణధర్మములను ఏ పురుషుడు ద్వేషింపకుండా, అంతేగాక వాంఛించకుండా యుండునో అతనిని గుణాతీతుడని చెప్పుదురు.

**ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।**
**గుణావర్తంత ఇత్యేవయోఽవతిష్ఠతి నేంగతే ॥ 23**

**తాత్పర్యము:** ఏ పురుషుడు ఉదాసీనత వహించి గుణములచేత, ఆవరింపబడడో, ఎవడు చలింపడో, అతడు గుణములయందు సర్వకార్యములు వాటంతట అవియే పుట్టుచున్నవని తలంచి గుణాతీతుడుగా నుండి ద్వేషింపడు. సుఖములను భావించి కోరుకొనడు.

**సమ దుఃఖ సుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః ।**
**తుల్య ప్రియా ప్రియో ధీరస్తుల్యనిన్దాత్మ సంస్తుతిః ॥ 24**

**తాత్పర్యము:** ఏ మనుజుడు సుఖదుఃఖములయందు ఒకే రీతిగానుండునో, ఆత్మయందే స్థిరముగా నుండునో, మట్టి, రాయి, బంగారములయందు సమమైన భావమును కలిగియుండునో, నిందా ఇష్టాయిష్టములయందు సమమైన భావమును కలిగియుండునో అట్టివాడు గుణాతీతుడు, ధీరుడు.

**మానావమానయోస్తుల్యః తుల్యో మిత్రారిపక్షయోః ।**
**సర్వారంభపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే ॥ 25**



**తాత్పర్యము:** ఏ మనుజుడు సన్మాన తిరస్కారములను, మానవా మానములను సమముగా భావించుచూ, శత్రుమిత్రులయందు సమానమైన బుద్ధి కలిగియుండునో, సర్వకర్మలను త్యజించినవాడో అట్టివాడు గుణాతీతుడని చెప్పబడును.

**మాం చ యోఽవ్యభిచారేణ భక్తి యోగేన సేవతే ।**
**స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥ 26**

**తాత్పర్యము:** ఏ పురుషుడు ఏకాగ్రమైన, బుద్ధితో, సర్వభూతములను తనయందు స్థిరపరచుకొన్న పరమాత్మను సేవించునో, పూజించునో, ఉపాసించునో ఈ త్రిగుణములను పూర్తిగా అతిక్రమించి పరబ్రహ్మమునకు అర్హుడగుచున్నాడు.

**బ్రహ్మణో హి ప్రతిష్ఠాహం అమృత స్యావ్యయస్య చ ।**
**శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతి కస్య చ ॥ 27**

**తాత్పర్యము:** ఎందువలన అనగా నేను వికారరహితుడును, వినాశము లేనివానిని, శాశ్వతుడను నాశనములేని పరబ్రహ్మమునకు, జ్ఞానయోగమునకు, సనాతనమైన ధర్మమునకు, నీతిమంతమైన సుఖస్వరూపమగు బ్రహ్మమునకు నేనే ఆశ్రయుడను, ఆధారమును.

***ఇట్లు ఉపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జున సంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందలి పదునాల్గవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

## పదునైదవ అధ్యాయము

## పురుషోత్తమప్రాప్తి యోగము

పదునాల్గవ అధ్యాయములో త్రిగుణముల గురించి, వాటివలన మానవుడు వ్యధనొందుట గురించి భగవానుడు విపులీకరించియున్నాడు. ఈ పురుషోత్తమప్రాప్తి యోగములో కృష్ణపరమాత్మ అశ్వత్థమనెడు చిత్రవిచిత్రమైన సంసార వృక్షమును ఆవిష్కరించి, కోరికలనుండి, వాంఛలనుండి మనుజుడు బంధింపబడకుండా స్వతంత్రుడుకావాలని చెప్పాడు. స్వప్నములోని వ్యాపారములు, వికారములు మానవుడు యథాస్థితికి వచ్చాక మాయమవుతాయి. అటులనే మానవుడు బ్రాహ్మీస్థితినిపొంది తనను బాధించే బంధములనుండి స్వతంత్రుడై మెలగవలెను. మానవుడు పురుషోత్తమునకు ప్రాప్తుడై దానిలో లీనమై యుండుటయే పురుషోత్తమ ప్రాప్తి.

భగవత్ప్రాప్తికి ఉపాయములు, జీవాత్మ పరమాత్మ వివరములు మొదలైనవి ఈ అధ్యాయములో వివరింపబడెను. నిర్వికల్పమే బ్రాహ్మీస్థితి.

**శ్రీ భగవాన్ ఉవాచ**

**ఊర్ధ్వమూలమధశ్శాఖం అశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।**
**ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥** 1

**తాత్పర్యము:** శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు. సంసారము అశ్వత్థ వృక్షముతో పోల్చబడినది. దానికి మూలము ఊర్ధ్వమునకలదు. శాఖలు క్రిందుగా యున్నవి. వేదములే దీని పత్రములు అనగా ఆకులు. వేదములు, శాస్త్రములు ఈ సంసారము క్షణికమని వర్ణించుచున్నవి. వీటిని పూర్తిగా గ్రహించినవాడే వేదజ్ఞుడు, వేదములయొక్క అర్థములను పూర్తిగా ఎఱిగినవాడు.

**అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా**
**గుణ ప్రవృద్ధా విషయ ప్రవాలాః ।**
**అధశ్చమూలాన్యను సంతతాని**
**కర్మానుబంధీని మనుష్యలోకే ॥** 2

**తాత్పర్యము:** ఈ సంసార వృక్షముయొక్క శాఖలు త్రిగుణములవలన, వారివారి కర్మఫలానుసారముగా వృద్ధిపొందుచున్నవి. విషయవాంఛలే వీటి చిగుళ్లు క్రిందకును, మీదకును సర్వత్ర వ్యాపించియున్నవి. మానవలోకమున అహంకార, మమకారములనెడు వ్రేళ్లు, ధర్మము, అధర్మములు అనెడు మూలములు క్రిందికి పాదుకొనియుండెను.

**న రూపమస్యేహ తథోపలభ్యతే**
**నాంతో న చాదిర్న చ సంప్రతిష్ఠా ।**
**అశ్వత్థమేనం సువిరూఢమూలం**
**అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ॥** 3

**తాత్పర్యము:** ఈ విశ్వమునందు ఈ సంసార అశ్వత్థ స్వరూపమును తెలిసికొనుటకు ఎవరికీ సాధ్యముకాదు. ఎందువలన, అనగా దీని మూలమునుకాని, మధ్యమునుకాని, అంతమునుకాని ఎవ్వనికిని తెలియదు. పాతుకుపోయిన వ్రేళ్లుగల దీనిని విరక్తి, అనాసక్తులతో ఛేదించవలెను.

**తతః పదం తత్పరి మార్గితవ్యం**
**యస్మిన్ గతా న నివర్తంతి భూయః ।**
**తమేవ చాద్యం పురుషం ప్రపద్యే**
**యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥** 4

**తాత్పర్యము:** అటుపిమ్మట ఏ పరమపదమును, ఏ స్థితిని చేరిన తరువాత మఱలరాకుండా ఉందురో, పునరావృత్తి కలుగదో, ఎవనినుండి ఈ సంసారబంధము కలిగినదో అట్టి పరమాత్మనే ఆశ్రయించి

ధన్యమగుచున్నాను. ఆ ఆదిపురుషుని శరణు వేడుకొంటున్నాను. అట్టి భావముతో పురుషోత్తముని అన్వేషింపవలెను.

**నిర్మానమోహాజిత సంగదోషా**
**అధ్యాత్మ నిత్యా వినివృత్త కామాః ।**
**ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖ సంజ్ఞైః**
**గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్ ॥ 5**

**తాత్పర్యము:** అహంకార అవివేకములు వదలినవారును, ఆశలను, వాంఛలను త్యజించి వాటిని పారద్రోలినవారును, కామ రహితులును, సుఖ దుఃఖాదులనుండి విముక్తిని పొందినవారైన జ్ఞానులు పరమపదమును అనగా మోక్షమును పొందుచుండిరి.

**న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః ।**
**యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమః మమ ॥ 6**

**తాత్పర్యము:** మానవుడు ఏ మోక్షమును పొందిన పిమ్మట ఈ లోకమునకు తిరిగిరారో వారిని సూర్యచంద్రులు ప్రకాశింపజేయలేరు. అగ్నికూడా ఏ విధముగాను ప్రకాశింపజేయలేదు. అదియే శ్రేష్ఠమగు నా పరమపదము, నా స్వరూపము.

**మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః ।**
**మనః షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥ 7**

**తాత్పర్యము:** ఎందువలన అనగా పురాతనమగు జీవాత్మ నా అంశమే. సర్వజీవుల దేహములలోనున్నది. అది ప్రకృతియందున్న కర్ణ, త్వక్, యిత్యాది ఇంద్రియములను ఆకర్షించుచున్నది.

**శరీరం యదవాప్నోతి యచ్చా ప్యుత్క్రామతీశ్వరః ।**
**గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్ ॥ 8**



**తాత్పర్యము:** జీవుడు తన శరీరమును ఎప్పుడు పొందుచుండెనో, ఎపుడు తన శరీరమును త్యాగముజేయునో, మరియు నూతన శరీరమును పొందుచున్నప్పుడు, పుష్పముల రేకులనుండి వాయువు సువాసనలను తీసుకొనిపోవు విధముగా, గంధము ఆహరించునట్లు, జీవుడు తన పూర్వ శరీరమునుండి మనస్సుతో సహితముగా పంచేంద్రియములను తనవెంట తీసుకొని పోవుచుండెను.

**శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ ।**
**అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥ 9**

**తాత్పర్యము:** ఈ దేహి అనగా జీవాత్మ కర్ణమును, నేత్రమును, స్పర్శనమును, నాలుకను, ముక్కును, అటులనే మనస్సును ఆశ్రయించిన విషయాది సమూహములను అనుభవించుచున్నాడు.

**ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్ ।**
**విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః ॥ 10**

**తాత్పర్యము:** దేహమునుండి పోవుచున్నవాడును, శరీరమున ఉండువాడును, విషయ వాంఛలను అనుభవించు చుండువాడును అగు ఈ జీవుని జ్ఞానహీనులు కాంచలేరు. జ్ఞాననేత్ర దృష్టితో మాత్రమే జ్ఞానులు దర్శించగలరు.

**యతంతో యోగినశ్చైనం పశ్యంతాత్మన్యవస్థితమ్ ।**
**యతంతోఽప్యకృ తాత్మానో నైనం పశ్యంత్యచేతసః ॥ 11**

**తాత్పర్యము:** యోగులు ఎల్లప్పుడును తమ స్వీయమగు బుద్ధితో అభ్యాసపరులై ఆత్మను దర్శించుచున్నారు. శుద్ధమైన చిత్తము లేనివారు ఎంత ప్రయత్నించినను అజ్ఞానులై పరమాత్మను వీక్షించలేక అసహాయులై యున్నారు. ఆత్మను తెలుసుకొనజాలరు.

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।**
**యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥ 12**

**తాత్పర్యము:** సూర్యమండలము తేజస్సుతో ప్రకాశించుచున్నది. అది విశ్వమునంతయును ప్రభావితము జేయుచున్నది. మఱియు చంద్రుని యందున్న తేజస్సు, అగ్ని యందున్న జ్యోతి, ఇవన్నియు నావే అని గ్రహింపుము.

**గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా ।**
**పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః॥ 13**

**తాత్పర్యము:** అంతేగాక, ఈ పృథివిని నా ఐశ్వర్య శక్తిచేత ప్రవేశించి, సమస్తభూతములను ధరించుచున్నాను. ఆ విధముగానే చంద్రుడనై సర్వఓషధులను, సస్యములను పోషించుచున్నాను.

**అహంవైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।**
**ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥ 14**

**తాత్పర్యము:** నేనే సమస్త జీవకోటియొక్క శరీరములయందుండి వారి జఠరాగ్నిని, ప్రాణాపాన వాయువులతో నిండిన ఆహారమును పచనము అనగా జీర్ణింపజేయుచున్నాను.

**సర్వస్య చాహం హృది సన్నివిష్టో**
**మత్తః స్మృతిర్ జ్ఞాన మపోహనం చ ।**
**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో**
**వేదాంతకృద్వేదవిదేవ చాహమ్ ॥ 15**

**తాత్పర్యము:** నేను సర్వ జీవులయొక్క హృదయములలో ఉన్నవాడను. నా వలననే వారికి జ్ఞానము, జ్ఞాపకశక్తి ఏర్పడుచున్నవి. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము అను ఈ నాల్గు వేదములచేత



తెలిసికొనబడుచున్నాను. వేదాంతకర్తను కూడా నేనే. వాటి అర్థమును కూడ నేనే అని ఎఱుంగుము.

**ద్వావిమౌ పురుషౌ లోకే క్షరాశ్చాక్షర ఏవ చ ।**
**క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ 16**

**తాత్పర్యము:** ఈ విశ్వమునందు క్షరుడు, అక్షరుడు అను ఇరువురు పురుషులు కలరు. వీరిద్దరూ కూడా జగత్తునందు ప్రసిద్ధిని పొందినవారే. నాశనములేని వారే. సర్వభూతములు క్షరమనియు, జీవుడు అక్షరుడని చెప్పబడుదురు.

**ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।**
**యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥ 17**

**తాత్పర్యము:** వినాశనములేనివాడును, ఈశ్వరుడును పరమాత్మ అని చెప్పబడును. ఎవరు క్షయము కానివాడో, పాలకుడో, జగత్తునంతటిని తన అద్భుతమహిమ, మాయా శక్తులద్వారా ప్రవేశించి సర్వమును భరించుచున్నాడో ఆయనే (ఉత్తమ పురుషుడు, పరమాత్మ ఆయనే) అనుగ్రహించుచూ పాలించుచుండెను.

**యస్మాత్ క్షరమతీతోఽహం అక్షరాదపి చోత్తమః ।**
**అతోఽస్మి లోకేవేదే చ ప్రథితః పురుషోత్తమః ॥ 18**

**తాత్పర్యము:** ఎందువలన అనగా నేను క్షరము, అక్షరములకంటె అతీతుడను. వాటిని సులభముగా అతిక్రమించినవాడను. శ్రేష్ఠుడను. విశ్వమునందును, వేదమునందును పురుషోత్తముడనని ప్రఖ్యాతి చెందితిని.

**యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।**
**స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥ 19**

**తాత్పర్యము:** ఓ అర్జునా! ఈ రహస్యమగు శాస్త్రము నాచే వివరించబడినది. జ్ఞాని అయిన పురుషుడు దీనిని గ్రహించి సర్వజ్ఞుడు, కృతార్థుడు, అగును.

**ఇతి గుహ్యతమం శాస్త్రం ఇదముక్తం మయానఘ ।**
**ఏతద్ బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత ॥ 20**

**తాత్పర్యము:** పుణ్యాత్ముడవైన ఓ అర్జునా! మిక్కిలి రహస్యమైన శాస్త్రమును నీకు ఈ విధముగా, వివరముగా బోధించితిని. దీనిని మనస్ఫూర్తిగా గ్రహించి అర్థము చేసికొనినవాడు బుద్ధిమంతుడు. జ్ఞాని, కృతార్థుడగును.

***ఇట్లు ఉపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జున సంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందలి పురుషోత్తమప్రాప్తి యోగమనెడు పదునైదవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

## శ్రీకృష్ణామృతవాణి

## పదునారవ అధ్యాయము

## దైవాసుర సంపద్విభాగ యోగము

క్రిందటి పదునైదవ అధ్యాయమైన పురుషోత్తమప్రాప్తి యోగములో భగవానుడు అర్జునునకు రహస్యమైనటువంటి యోగశాస్త్రమును వివరముగా బోధించెను. దీనిని మనస్ఫూర్తిగా గ్రహించినవాడు కృతార్థుడగునని కూడా చెప్పెను.

ఈ పదునారవ అధ్యాయమైన దైవాసుర సంపద్విభాగయోగములో సత్యము, అసత్యములయొక్క వివరములను, వ్యత్యాసములను భగవానుడు స్పష్టము జేసెను. జీవులలో మానవునకు మాత్రమే మనస్సు ఉన్నది. ఆలోచనా శక్తికలదు. ఆ ఆలోచనా శక్తి నశించినప్పుడు మానవుడు రాక్షస స్వభావము కలవాడగును. అదియే ఆసురీసంపద. రెండవదైన సత్యమార్గము దైవీ సంపద. అసుర ప్రవృత్తిని నాశనముజేసి దైవప్రకృతిని హృదయములో నిక్షిప్తము చేసుకొనవలెను. అటు తర్వాత రెండింటికిని అతీతముగా ప్రవర్తించి, ఆధ్యాత్మ సాధనానుగుణ్యముగా మానవుడు తన జీవితమును గడపవలెను. (శాస్త్రప్రకారముగా యుక్తమగు కర్మలను ఆచరించవలెను.)

ఇటువంటి విషయములన్నింటిని సాంగోపాంగముగా ఈ దైవాసుర సంపద్విభాగయోగము చర్చించుచున్నది.

**శ్రీభగవాన్ ఉవాచ**

**అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః ।**
**దానం దమశ్చ యజ్ఞశ్చస్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥ 1**

**తాత్పర్యము:** భగవానుడు చెప్పుచున్నాడు. అర్జునా! భయము లేకుండా యుండుట హృదయములో త్రికరణశుద్ధి, ధ్యానయోగములందు

దృఢముగానుండుట, ఇంద్రియములను స్వాధీనములో నుంచుకొనుట, తపస్సు, యజ్ఞము, సరళీకృతమైన ప్రవర్తన, చెడు మరియు అనవసరమైన వ్యర్థములైన కార్యములను చేయకుండుట.

**అహింసా సత్యః అక్రోధః త్యాగః శాంతిః అపైశునమ్ ।**
**దయా భూతేః అలోలత్వం మార్దవం హ్రీః అచాపలమ్ ॥ 2**

**తాత్పర్యము:** ప్రాణులను హింసించకుండా అహింసా వ్రతమును అవలంబించుట, అప్రియమును పలుకకుండుట, సత్యమగు దానిని చెప్పుట, క్రోధమును అణచుకొనుట, శుద్ధమైన మనస్సు కలిగియుండుట, త్యాగమునకు సిద్ధమగుట, పరుల దోషములయందు మౌనము, తనకు సరిపడని విషయములయందు నిర్భయముగానుండుట, నిర్మలముగా ప్రవర్తించుట, అశాస్త్రీయమైన పనులు చేయకుండుట.

**తేజః క్షమా ధృతిః శౌచం అద్రోహో నాతిమానితా ।**
**భవంతి సంపదం దైవీం అభిజాతస్య భారత ॥ 3**

**దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।**
**అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్ ॥ 4**

**తాత్పర్యము:** అర్జునా! తేజస్సు, ఓర్పు, నిర్భయత్వము, శుద్ధమైన మనస్సు, దానగుణము, మంచినడవడి, అహింసను అవలంబించుట, క్రోధము లేకుండుట, త్యాగగుణమును కలిగియుండుట, శాంత స్వభావము పెంపొందించుకొనుట, అసత్యము పలుకకుండుట, ద్రోహబుద్ధిని విడుచుట ఇవన్నియు దైవీసంపదలు.

అర్జునా! కపటము, గర్వము, దురభిమానము, కోపు మాటలు, చేష్టలయందు కఠినముగా ప్రవర్తించడం, అజ్ఞానము మొదలైనవి రాక్షసగుణములుకల మానవులకు కలుగుచున్నవి. అనగా ఆసురీసంపదలు. ఈ లక్షణములు కలిగినవాడు నిజముగా అసురుడే.



**దైవీ సంపద్వి మోక్షాయ నిబంధాయాసురీ మతా ।**
**మాశుచః సంపదం దైవీం అభిజాతోఽసి పాండవ ॥ 5**

**ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ ।**
**దైవో విస్తరశః ప్రోక్తః ఆసురం పార్థ మే శృణు ॥ 6**

**తాత్పర్యము:** అర్జునా! దైవీసంపద మోక్షముకొరకు, ఆసురీసంపద భౌతిక బంధము కోసమని వచింపబడినది. నీవు విచారమునకు లోనుకాకుండా ఉండుము. నీవు దైవీసంపదకు అర్హుడవైన కారణజన్ముడవు.

ఈ లోకమునందు దైవాసుర స్వభావములతో కూడిన మానవుల సృష్టి జరిగినది. దైవలక్షణములు గలవారిని గురించి నీకు విపులముగా వివరించబడినది. ఇక ఆసుర గుణములు కలవారిని గురించి నేను చెప్పెదను. అని శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు తెలియజేసెను.

**ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।**
**న శౌచం నాపి చా చారో న సత్యం తేషు విద్యతే ॥ 7**

**తాత్పర్యము:** అసుర స్వభావముగల ప్రజలు ధర్మప్రవృత్తిని కాని, నివృత్తి మార్గమును కాని, ఎఱుగరు. వారియందు శుచి, సత్యము, ఆచారములు ఉండవు.

**అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్।**
**అపరస్పర సంభూతం కిమన్యత్ కామహైతుకమ్ ॥ 8**

**తాత్పర్యము:** వారు ఈ విశ్వము అసత్యమని, ప్రమాణము లేనిదని, ప్రతిష్ఠ లేనిదని, ధర్మాధర్మములు లేనిదని, ఈశ్వర సంబంధము కానిదని, కామకారణముగా స్త్రీ పురుష సంయోగమువలన మాత్రమే ఏర్పడినదని చెప్పెదరు.

**ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।**
**ప్రభవంత్యుగ్ర కర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥ 9**

**కామ మా(శిత్య, దుష్పూరం దంభమాన మదాన్వితాః ।**
**మోహాద్గృహీత్వాఽ_సద్గ్రాహాన్ (ప్రవర్తన్తేఽ_శుచి (వ్రతాః ॥ 10**

**తాత్పర్యము:** ఈ ఆసురీ సంపద కలవారు నాస్తిక దృష్టితో ఆత్మయొక్క అస్తిత్వమును నమ్మకుండా, చెడిపోయిన మనస్సుతో మందబుద్ధిని పెంపొందించుకొని, జగత్తుయొక్క ఉనికిని (గ్రహించక దానినాశనము కొరకు జన్మించుచున్నారు.

మరియు అంతములేని కామమును ఆ(శయించి, దానికి లోబడి, దంభము, అభిమానములతో మదోన్మత్తులై, గర్వమునకు బానిసలై, వివేకహీనులై, దురాచారమునకు బందీలై, మోహముతో (ప్రవర్తించుచున్నారు.

**చింతామపరిమేయాం చ (ప్రలయాంతా ముపా(శితాః ।**
**కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః ॥ 11**

**ఆశాపాశశతైర్బద్ధాః కామ(క్రోధపరాయణాః ।**
**ఈహంతే కామభోగార్థం అన్యాయేనార్థ సంచయాన్ ॥ 12**

**తాత్పర్యము:** పరిమితములేని భోగములచేత, కోరికలచేత చింతా(క్రాంతులై, కామాది భోగములకు వశులై, ఇదియే ఉత్తమమని, పురుషార్థమని తలంతురు. అటులనే నిశ్చయము కలవారై ఉందురు.

అంతులేని ఆశాపాశములచేత బంధింపబడినవారై, కామ(క్రోధములకు బానిసలై విషయవాంఛలను తీర్చుకొనుటకు వ(క్రమార్గములే పరమార్థమని భావించి అన్యాయ విరుద్ధమైన మార్గమున ధనమును సంపాదించుచున్నారు.

**ఇద మద్య మయా లబ్ధమిమం (ప్రాప్స్యే మనోరథమ్ ।**
**ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥ 13**

**అసౌ మయాహతః శ(తుః హనిష్యే చాపరానపి ।**
**ఈశ్వరోఽ_హమహం భోగీ సిద్ధోఽ_హం బలవాన్ సుఖీ ॥ 14**



**తాత్పర్యము:** నేను ఇంతవరకు దీనిని సంపాదించితిని. ఇంకనూ అనేకమైన కోర్కెలను పొంది అనుభవించగలను. అంతేగాక, పెక్కు అభీష్టములనూ పొందగలను. ఇంకనూ నా సంపదను అభివృద్ధి చేసుకొనగలను.

నా విరోధి నాచేతనే అంతము చేయబడెను. మిగిలిన విరోధులను కూడా తప్పక చంపెదను. నేను అధికమైన శక్తిగలవాడను. నేనే (ప్రభువును. భోగిని. అధిక సంపన్నుడను. సుఖవంతుడను. పురుషార్థములను సంపాదించినవాడను. సిద్ధులన్నియు నా అధీనములో యున్నవి.

**ఆఢ్యోఽ_భిజనవానస్మి కోఽ_న్యోఽ_స్తి సదృశోమయా ।**
**యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన విమోహితాః ॥ 15**

**అనేక చిత్త వి(భ్రాంతాః మోహజాలసమావృతాః ।**
**(ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽ_శుచౌ ॥ 16**

**ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమాన మదాన్వితాః ।**
**యజంతే నామయజ్ఞైస్తే దంభే నా విధి పూర్వకమ్ ॥ 17**

**తాత్పర్యము:** నేను మిక్కిలి ధనవంతుడను, అసంఖ్యాకమైన అనుచరులను కలవాడిని, నాతో సమానుడైన మనుజుడు ఎవ్వరూలేరు. యజ్ఞములనుచేసి దానములీయగలను. ఈ విధముగా జ్ఞానహీనులై అవివేకముతో మునిగి యుందురు.

అనేక విధములుగా చిత్తములో (భ్రమలను పెంచుకొని, మోహముతో బంధింపబడి, శక్తిహీనులై ఈ ఆసురీ సంపదకలవారు నరకము పాలగుచున్నారు.

వారు ఈ విధముగా తమంతట తామే లోలోన పొగడుకొనుచు, వినయ శూన్యులై, ధనముచేత అభిమానము, గర్వములతో కూడినవారై, శాస్త్రవిరుద్ధముగా, విధిరహితముగా యజ్ఞములను చేయుచున్నారు.

**అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।**
**మామాత్మ పరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః ॥ 18**

**తాత్పర్యము:** వారు అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము ఇత్యాదులను ఆశ్రయించుచున్నారు. స్వదేహమున, ఇతరుల శరీరములందు ఉన్న నన్ను అనగా పరమేశ్వరుని ద్వేషించుచున్నారు. సన్మార్గమున ప్రవర్తించుచున్నవారిని అకారణంగా నిందించుచున్నారు.

**తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।**
**క్షిపామ్యజస్ర మశుభాన్ ఆసురీష్వేవ యోనిషు ॥ 19**

**అసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।**
**మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిమ్ ॥ 20**

**తాత్పర్యము:** ఈ ఆసురీ సంపదగలవారు క్రూరస్వభావము కలవారు. అందువలన అమంగళకరమగు, రాక్షస సంబంధములైన గర్భములయందు, అటువంటి వంశములలోనే వారిని ఉంచుచున్నాను.

ఓ అర్జునా! ఈ మూఢులందరు, ప్రతియొక్క జన్మలోనూ ఆసుర సంబంధమగు శరీరమును పొంది నన్ను పొందలేకున్నారు. అటుల అధోగతిపాలై అత్యంత హీనమైన నరకము పాలగుచున్నారు.

**త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః ।**
**కామః క్రోధస్తథా లోభః తస్మాదేతత్రయం త్యజేత్ ॥ 21**

**తాత్పర్యము:** అర్జునా! కామక్రోధ లోభములు అను ఈ మూడు నరకద్వారములు. ఇవి అధోగతికి దారితీయును. కనుక ఈ మూడింటిని తప్పక త్యజించవలెను.

**ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైః త్రిభిర్నరః ।**
**ఆచరత్యాత్మనః శ్రేయః తతోయాతి పరాం గతిమ్ ॥ 22**



**తాత్పర్యము:** అర్జునా! ఈ మూడు నరకములనుండి విముక్తి చెందిన మానవుడు శ్రేయస్సును తనంతట తానే కలిగించుకొనుచు, అటుపిమ్మట పరమగతిని అనగా మోక్షమునకు అర్హుడై మోక్షమును పొందుచున్నాడు.

**యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః ।**
**న స సిద్ధిమవాప్నోతి న సుఖం నపరాం గతిమ్ ॥ 23**

**తాత్పర్యము:** ఏ మనుజుడు శాస్త్రముచే నిషేధింపబడిన కర్మములు చేయుచున్నాడో, అతడు పురుషార్థ, సిద్ధిని పొందదు. ఉత్కృష్టమైన మోక్షమును పొందలేడు.

**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ ।**
**జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తుమిహార్హసి ॥ 24**

**తాత్పర్యము:** అర్జునా! నీకు బోధించుచున్నాను. కార్యాకార్యములలోను, కర్తవ్యాకర్తవ్య నిర్ణయములోను శాస్త్రమే ప్రమాణము. అందువలన శాస్త్రము విధించిన కర్మలను అవగాహన చేసుకొని వాటిని ఆచరించుటకు సిద్ధమగుము. అప్పుడు నీవు యోగ్యుడవగుదువు. కర్మలు చేయుటకు తగిన వాడవగుదువు.

***ఇట్లు ఉపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జున సంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందలి దైవాసుర సంపద్విభాగ యోగమనెడు పదునాఱవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

# పదునేడవ అధ్యాయము

# శ్రద్ధాత్రయ విభాగ యోగము

క్రిందటి పదునారవ అధ్యాయమైన దైవాసుర సంపద్విభాగ యోగములో, కార్యాకార్యములను, కర్తవ్యాకర్తవ్య నిర్ణయములలోనూ శాస్త్రమే ప్రమాణమని, ఆ శాస్త్రప్రకారమే కర్మలను అవగాహన చేసుకొని, నిర్వర్తింపుమని భగవానుడు అర్జునునకు బోధించెను.

ఈ శ్రద్ధాత్రయ విభాగయోగములో అర్జునుడు కేవలము శాస్త్రప్రమాణముతో సంబంధములేక ఆత్మ విశ్వాసముతో ఆచరించు కర్మలు సాత్వికమా, తామసమా లేక రాజసమా అని అర్జునుడు శ్రీకృష్ణభగవానుని చెప్పుమని కోరుచున్నాడు. కర్మలు ఫలాపేక్షలేక సాత్వికమైన శ్రద్ధతో ఆచరించిన ముక్తికి మార్గమని, శ్రద్ధ, ఏకాగ్రత లేనివారికి సద్గతిలేదని, శ్రద్ధలేకుండా చేయుకర్మలు జీవునకు మేలుచేకూర్చవని, అశ్రద్ధతో చేయబడిన యజ్ఞము, ధ్యానము, తపస్సులు అసత్ఫలిముల నిచ్చునని, అందువలన అవి ఇహపరములయందు ప్రయోజనము చేకూర్చవని, భగవానుడు అర్జునునకు బోధించుచున్నాడు.

"దేవపితృకార్యములయందు జాగ్రత్తగాయుండి, చేయరాని పనులు చేయకూడదు. శుభము కలిగించే పనులు మాత్రమే చెయ్యాలి. మనము చేసే యజ్ఞము, దానము, తపస్సు, శ్రద్ధతో, విజ్ఞానంతో చేయవలెను. అని వేదము చెప్పుచున్నది.

**యే శాస్త్ర విధిముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః ।**
**తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్వమాహో రజస్తమః ॥ 1**



**తాత్పర్యము:** కృష్ణా! శ్రుతి స్మృతులను విసర్జించిననూ శ్రద్ధతో కూడినవారై శాస్త్ర విధిని అనుసరించకుండా, దేవతలను ఎవరు పూజించుచున్నారో వారి నిష్ఠసాత్వికమా, రాజసమా లేక తామసమా అని అర్జునుడు భగవానుని అడుగుచున్నాడు.

**శ్రీభగవాన్ ఉవాచ**

**త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।**
**సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥ 2**

**తాత్పర్యము:** మనుజులకు సాత్త్విక, రాజస, తామస ప్రధానములని ఈ మూడు విధములుగానే శ్రద్ధ కలుగును. పూర్వజన్మ సంస్కారములవలన, అధర్మ ఆచరణములను అశ్రద్ధ కలుగుచున్నది. దానిని గురించి వివరించెదనని దానిని గ్రహించవలెనని కృష్ణభగవానడు అర్జునునకు చెప్పుచున్నాడు.

**సత్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।**
**శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః ॥ 3**

**యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః।**
**ప్రేతాన్ భూత గణాం శ్చాన్యే యజంతే తామసా జనాః ॥ 4**

**తాత్పర్యము:** అర్జునా! మానవులందరికి వారి వారి శ్రద్ధ, వారి అంతఃకరణ ప్రకారము, దానికి తగినట్లు ఏర్పడుచున్నది. జీవుడు శ్రద్ధామయుడు. అతడు పూర్వజన్మమున ఎటువంటి శ్రద్ధను కలిగియుండెనో, ఈ జన్మమందునూ అటువంటి నిష్ఠనే కలిగియుండును.

సాత్త్వికులైన జనులు దేవతలను పూజించుచున్నారు. రాజసికులు యక్షులను, రాక్షసులను, తామసగుణము కలవారు భూతప్రేత గుణములను పూజించుచున్నారు.

**అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః ।**
**దంభాహంకార సంయుక్తాః కామరాగ బలాన్వితాః ॥ 5**

**తాత్పర్యము:** దంభము, అహంకారము, కామముయందు కోరికలుగల అవివేకులు తమ బుద్ధికి ఆత్మస్వరూపముగా నున్న నన్ను కించపరుస్తూ బలగర్వముతో నిండిన మనుజులు, అశాస్త్రీయమైన ఘోరతపస్సును చేయుచున్నారో వారు ఆసురీ స్వభావము కలవారు.

**కర్షయంతః శరీరస్థం భూతగ్రామ మచేతసః ।**
**మాం చైవాంతః శరీరస్థం తాన్ విద్ధ్యాసుర నిశ్చయాన్ ॥ 6**

**తాత్పర్యము:** ఆత్మ స్వరూపుడైన నన్ను కృశింపచేయుటకు కష్టపెట్టుతూ, పరమాత్ముడైన నన్ను ఉద్దేశపూర్వముగా లెక్కచేయక ప్రవర్తించు అజ్ఞానులు ఆసుర స్వభావము కలవారని తెలుసుకొనుము.

**ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।**
**యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు ॥ 7**

**ఆయుః సత్త్వబలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః ।**
**రస్యాస్స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః ॥ 8**

**తాత్పర్యము:** ప్రతి మనిషికి ఆహారము కూడ మూడు విధములుగా ప్రియమగు చున్నది. అటులనే యజ్ఞము, దానము, తపస్సులు మూడు విధములుగా తృప్తిపరచుచున్నది. ఈ బేధమును వినుము.

ఆయువును, ఉత్సాహమును, బలమును, ఆరోగ్యమును వృద్ధిచేయునవి, రసవంతములైనవి, ఎక్కువకాలము చెడిపోకుండా యుండునవి ప్రీతికరమైన ఆహార పానీయములు సాత్త్వికులకు ప్రియము కలిగించుచున్నవి.

**కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః ।**
**ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥ 9**



**తాత్పర్యము:** చేదు, పులుపు, ఉప్పు, వేడి, కారముగాయుండి దాహమును వృద్ధిచేయు ఆహార పదార్థములు రోగములకు దారితీయును. ఇవి రాజసగుణము కలిగి యున్నవారికి ప్రీతికరమైనవి.

**యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।**
**ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్ ॥ 10**

**తాత్పర్యము:** ఆహారము చిరకాలము నిలువయున్నది, పూర్తిగా వండకుండా పచనము చేయకుండా యుండునది, చెడువాసన వేయుచున్నది, ఎంగిలిది, అపవిత్రమైనది అయినట్టి ఆహారము తామసజనులకు ప్రియమైనది.

**అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।**
**యష్టవ్యమేవేతి మనః సమాధాయ స సాత్త్వికః ॥ 11**

**తాత్పర్యము:** నిష్కామముతో, శాస్త్రోక్తముగా ప్రతిఫలాపేక్ష లేకుండా, మనస్సును స్థిరపరచుకొని యజ్ఞమును చేయవలెను. అట్టి యజ్ఞము సాత్త్వికమని చెప్పబడును.

**అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్ ।**
**ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥ 12**

**తాత్పర్యము:** అర్జునా! ఫలములను ఆశించి, శాస్త్రము ననుసరింపక, తన ఔన్నత్యమును ప్రకటించుటకొరకు, ఆడంబరముతో చేయు యజ్ఞము రాజసయజ్ఞము అని గ్రహింపుము.

**విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్ ।**
**శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥ 13**

**తాత్పర్యము:** శాస్త్ర విరుద్ధమైనది, అన్నదానములేనిది, మంత్రరహితమైనది, దక్షిణలులేనిది, శ్రద్ధలేనిది మొదలైనవాటితో చేయబడు యజ్ఞము తామస యజ్ఞము అని చెప్పుచున్నారు.

**దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్ ।**
**బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే ॥ 14**

**తాత్పర్యము:** దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను గౌరవించి, పూజించడం, శుచిత్వము కలిగియుండటము, బ్రహ్మచర్యమును పాటించుట, అహింసను అనుసరించుట ఇవి శారీరక తపస్సులని చెప్పబడును.

**అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చయత్ ।**
**స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥ 15**

**తాత్పర్యము:** ఇతరుల మనోభావములను బాధించనిది, ఇతరులకు దుఃఖము కలిగించనిది, ప్రియమైన, సత్యములైన ప్రసంగము చేయునది, ఇతరులకు శ్రేయస్సు కలిగించునది, వేదాలను అనుసరించునది, శాస్త్రమును అభ్యాసము చేయునది అగు తపస్సు వాచిక తపస్సు అని చెప్పబడును.

**మనః ప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మ వినిగ్రహః ।**
**భావసంశుద్ధిరిత్యే తత్ తపో మానసముచ్యతే ॥ 16**

**తాత్పర్యము:** చిత్తము నిర్మలముగానుండుట, దయ, సౌమ్యత్వము, మనస్సును అధీనములో నుంచుకొనుట, హృదయములో భావముల పవిత్రత, మితమైన సంభాషణము మొదలగువాటిని మానసిక తపస్సు అని చెప్పబడును.

**శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్ త్రివిధం నరైః ।**
**అఫలా కాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ॥ 17**

**తాత్పర్యము:** ఫలాకాంక్ష లేనివారును, ఏకాగ్రమైన మనస్సుగల వారును, అగు మానవులచే, అత్యంత శ్రద్ధతో ఆచరించబడు శారీరక, వాచిక, మానసిక కర్మలను సాత్త్వికములని చెప్పబడును.

**సత్కారమాన పూజార్థం తపోదంభేన చైవ యత్ ।**
**క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్ ॥ 18**



**మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః ।**
**పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్ ॥ 19**

**దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే ।**
**దేశేకాలేచ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥ 20**

**తాత్పర్యము:** సత్కార్యములను పూజలను, గౌరవాదులు పొందుటకు చేయబడిన తపస్సు ఈ విశ్వములో కొంతకాలమే ఉండుననియు, తాత్కాలికమని, చంచలమని, రాజసమని చెప్పబడెను.

మూర్ఖులు తమకు తామే కీడు కలిగించుకొందురు. అంతేకాక ఇతరులకు బాధ కలిగించునది, హానికలిగించునది అయిన తపస్సు తామస తపస్సు అని అందురు.

ప్రత్యుపకారమును ఆశింపక విద్యావేత్తలు, తపోధనులు అగు బ్రాహ్మణులకు దానముచేయుటయే తన కర్తవ్యమని, అంతేకాక, క్షామము నిండియున్న ప్రదేశములయందును, దానమునకు అర్హతగలవారికి, యోగ్యులైన వారికిని, దృఢనిశ్చయముతో చేయబడుదానము సాత్త్వికమని అందురు.

**యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః ।**
**దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥ 21**

**తాత్పర్యము:** ప్రత్యుపకారము ఆశించికాని, ఫలమును ఉద్దేశించుతూ, ఇష్టములేకుండా కష్టపడుతూ ఇచ్చిన దానము రాజసదానమని చెప్పబడినది.

**అదేశకాలే యద్దానం అపాత్రేభ్యశ్చ దీయతే ।**
**అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ ॥ 22**

**తాత్పర్యము:** అపవిత్రమైన ప్రదేశములలో, అపసవ్యమైన స్థితిలో, దానమును స్వీకరించెడివారియందు గౌరవభావములేకుండా నిర్లక్ష్యముతో, అనర్హులకు చేయుదానము తామస దానమని చెప్పబడును.

**ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః ।**
**బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥ 23**

**తాత్పర్యము:** ఓం తత్ సత్ అని బ్రహ్మములు మూడువిధములుగా నిర్దేశింపబడెను. ఈ బ్రహ్మము ద్వారా బ్రాహ్మణులును, యజ్ఞములును, వేదములును ప్రాచీన కాలములోనే నిర్మించబడినవని చెప్పబడెను.

**తస్మాద్ ఓం ఇత్యు దాహృత్య యజ్ఞదాన తపః క్రియాః ।**
**ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ ॥ 24**

**తాత్పర్యము:** అందువలన బ్రహ్మవాదులచేత శాస్త్రసమ్మతముగా ఆచరించబడు యజ్ఞములు, దానములు, తపస్సులు చేయబడుచున్నప్పుడు ముందుగా "ఓం" ఉచ్చరించబడుచున్నది.

**తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపః క్రియాః ।**
**దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్ష కాంక్షిభిః ॥ 25**

**తాత్పర్యము:** సర్వము పరమాత్మదే అని 'ఓం' అని ఉచ్చరించుచూ, ఏకోరికలనూ ఆశించకుండా యజ్ఞము, దానము, తపస్సులను నిర్వర్తించువారు 'తత్' అని స్మరించుచూ పరమాత్మదే అను భావముతో చేయుచుందురు.

**సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ ప్రయుజ్యతే ।**
**ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥ 26**

**యజ్ఞేతపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే ।**
**కర్మచైవ తదర్థీయం సదిత్యే వాభిధీయతే ॥ 27**

**తాత్పర్యము:** అర్జునా! సద్భావమునందును, శ్రేష్ఠమైన భావమునందును, ఉత్తమోత్తమమైన కర్మయందును, పరమాత్మ నామమందును 'సత్' అను పదము వాడబడుచున్నది అని గ్రహించుము.



యజ్ఞ దాన తపస్సులందును, నిష్ఠకలిగిన స్థితిని "సత్" అని చెప్పబడుచుండెను. అంతియేకాక, బ్రహ్మోద్దేశమైన కర్మకూడా 'సత్' అని పేర్కొనబడుచున్నది.

**అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।**
**అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ ॥ 28**

**తాత్పర్యము:** అర్జునా! శ్రద్ధలేకుండా చేయబడిన హోమము, యజ్ఞము, దానము, తపస్సులను "అసత్" అని అందురు. దానివలన ఫలితముండదు. ఇహ, పరలోకములందు కూడ ప్రయోజనముండదు.

***ఇట్లు ఉపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జున సంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందలి శ్రద్ధాత్రయ విభాగయోగము అను పదునేడవ అధ్యాయము.***

ఓం శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీకృష్ణామృతవాణి

# పద్ధెనిమిదవ అధ్యాయము

# మోక్షసన్న్యాస యోగము

క్రిందటి పదునేడవ అధ్యాయమైన శ్రద్ధాత్రయ విభాగ యోగములో మానవుడు శ్రద్ధలేకుండా చేయు యజ్ఞ, దాన, తపస్సులు "అసత్" అని వాటివలన ఈ లోకమునందుకాని, మరణించిన తర్వాత పరలోకమునందుకాని ప్రయోజనముండదని శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు వివరించి చెప్పెను.

ఈ పదునెనిమిదవ అధ్యాయమైన మోక్షసన్న్యాస యోగమునందు గడచిన పదునేడు అధ్యాయములలోని సారమును భగవానుడు క్లుప్తముగా విశదీకరించెను. ఇంద్రియభోగములతో, సంసారమాయా జాలములో చిక్కుకొని నిద్రలో మునిగి తిరిగి, ఇటువంటి జీవితమునకే పునాదులు వేసుకొంటాడు. జీవి, సంసార తాపత్రయమునుండి బంధవిముక్తుడై, తాను మోక్షము పొందుటకు, ఆ సర్వాత్మకుడు, సర్వాంతర్యామి, సర్వేశ్వరుడు, భగవానుడు అయిన శ్రీవిష్ణువే అని గ్రహించాలి. ఎల్లప్పుడు, మరణ సమయమందుకూడ భగవంతునే స్మరించుతూ, విష్ణుచింతనతో శరీరత్యాగము చేయవలెను.

కామ్య కర్మలను త్యజించుటయే సన్న్యాసము. సర్వకర్మల ఫలమును త్యజించుటయే త్యాగము. మోక్షభావమును కూడా సన్యసించవలెను. అదియే మోక్షసన్న్యాసము. ఎచ్చట కోరికలు లేని కర్మ, జ్ఞాననిష్ఠ కలసియుండునో అచట సర్వశుభములను మానవుడు పొందగలడు. ఎచ్చట యోగేశ్వరుడు, జ్ఞానబుద్ధి, ధృతి ఇత్యాదులు ప్రసాదించు భగవానుడు, ధనుర్ధారి అగు పార్థుడు ఉందురో, అచ్చట ఐశ్వర్యము, విజయము, నీతి తప్పక ఉండుననెడి పరమాత్మ అభిప్రాయముతో ఈ మోక్షసన్న్యాసయోగ అధ్యాయము ముగించబడెను.

**అర్జున ఉవాచ**

**సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ।**
**త్యాగస్య, చ హృషీకేశ పృథక్ కేశినిషూదన ॥ 1**

**తాత్పర్యము:** అర్జునుడు శ్రీకృష్ణభగవానుని ఈ విధంగా అడుగుచున్నాడు. సన్న్యాసముయొక్కయు, త్యాగము యొక్కయు, తత్త్వము యొక్కయు, యథార్థమును వేరువేరుగా విడమర్చి చెప్పవలెను.

**శ్రీ భగవాన్ ఉవాచ**

**కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః ।**
**సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥ 2**

**తాత్పర్యము:** కృష్ణభగవానుడు చెప్పెను. స్వర్గము మొదలగు కామ్యకర్మలను విడుచుట సన్న్యాసమని పండితులు తెలిసికొని చెప్పుచున్నారు. వారే మరల సమస్త కర్మములయొక్క ఫలమును త్యజించుటయే త్యాగమని చెప్పుచున్నారు.

**త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః ।**
**యజ్ఞదాన తపః కర్మ న త్యాజ్యమితి చాపరే ॥ 3**

**తాత్పర్యము:** సర్వజ్ఞులైన కొందరు పండితులు అన్ని కర్మలు దోషములతో కూడినవే అని, యజ్ఞ, దాన, తపస్సు మొదలగు కర్మలు మాత్రము త్యాగము చేయరానివనియు స్పష్టము చేసిరి.

**నిశ్చయం శృణుమే తత్ర త్యాగే భరతసత్తమ ।**
**త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధం సంప్రకీర్తితః ॥ 4**

**తాత్పర్యము:** పురుష శ్రేష్ఠుడవైన ఓ అర్జునా! అటువంటి కర్మత్యాగ విషయమున నా నిశ్చితాభిప్రాయమును ఆలకింపుము. త్యాగము సాత్త్విక,

రాజస, తమో గుణాత్మకమని త్రివిధములుగా చెప్పబడినది.

**యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।**
**యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ 5**

**తాత్పర్యము:** యజ్ఞము, దానము, తపస్సు, మొదలగు కర్మలను త్యజింపరాదు. ఈ మూడును తప్పక అనుష్ఠింపవలసినవి. ఇవి బుద్ధిమంతులు, జ్ఞానులు, మొదలగువారిని పవిత్రము చేయును. కాబట్టి, త్యాగము చేయవలసినవి కావు. ఇవి వారి బుద్ధిని శుద్ధముజేయును.

**ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ ।**
**కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్ ॥ 6**

**తాత్పర్యము:** అర్జునా! కాని సర్వకర్మలను ఆసక్తిని విడిచి, వాటివలన లభించు ఫలములను త్యజించి వాటిని చేయవలెను. అని నా నిశ్చయమైన అభిప్రాయము.

**నియతస్యతు సన్యాసః కర్మణో నోపపద్యతే ।**
**మోహాత్తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః ॥ 7**

**తాత్పర్యము:** శాస్త్రవిరుద్ధములైన కర్మలను త్యాగముచేయుట సవ్యమైనది. కాని, శాస్త్రసమ్మతమైన కర్మలను త్యజించుట యుక్తముకాదు. ఒకవేళ వాటిని త్యాగము చేసిన దానిని తామస త్యాగమని ఎఱుంగుము.

**దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్ త్యజేత్ ।**
**స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥ 8**

**తాత్పర్యము:** తనయొక్క విధింపబడిన కర్మలను, దుఃఖమునకు హేతువని తలంచి, శరీరము బాధకులోనవునని భీతిచెంది, కర్మలను త్యాగముజేసిన అది రాజస త్యాగమని చెప్పబడును. అట్టి మనుజుడు మోక్షమునకు అర్హుడు కాడు.



**కార్య మిత్యేవ యత్కర్మనియతం క్రియతేఽర్జున ।**
**సంగం త్యక్త్వాఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః ॥ 9**

**తాత్పర్యము:** అర్జునా! మానవునకు విధింపబడిన కర్మ చేయవలసినదే. ఇది శాస్త్రసమ్మతమై యుండవలెను. అట్టి కర్మను అభిమానమును ఆసక్తిని, ఫలమును విడిచి ఆచరించుచున్నచో దానిని సాత్త్విక త్యాగమని గ్రహింపుము.

**న ద్వేష్ట్య కుశలం కర్మ కుశలే నానుషజ్జతే ।**
**త్యాగీ సత్త్వ సమావిష్టో మేధావీ ఛిన్న సంశయః ॥ 10**

**తాత్పర్యము:** సత్త్వగుణముకలవాడు, ప్రజ్ఞావంతుడు, సంశయములు లేనివాడు, నిత్యకర్మలను నిష్ఠతో ఆచరించువాడు, త్యాగశీలుడు, అశుభకర్మలను ద్వేషింపడు, శుభమగు నిత్యకర్మలయందు ఆసక్తి కలిగియుండడు.

**నహిదేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।**
**యస్తు కర్మఫలత్యాగీ న త్యాగీత్యభిధీయతే ॥ 11**

**అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।**
**భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ॥ 12**

**తాత్పర్యము:** మానవుడు శరీరధారి. అందువలన, కర్మలను పూర్తిగా త్యజించుటకు వీలుపడదు. అయినను ఎవరు కర్మఫలములను త్యజించునో అతడు త్యాగి అని గ్రహింపుము.

మానవ జీవితములో కర్మలు మంచి చెడుల మిశ్రమము. అనగా ఇష్టము, అనిష్టము, ఈ రెంటికలయికతో ఉండును. ఇవి త్రివిధములు. ధర్మా ధర్మముల కర్మలయొక్క ఫలమును త్యాగము చేయనివారికి మరణము తర్వాత అవి కలుగును. కాని, కర్మలఫలమును త్యాగము చేసినవారికి అనగా సన్న్యాసులకు ఏ పరిస్థితులలోనూ, ఏ కర్మబంధము కలుగదు.

**పంచైతాని మహాబాహో కారణాని నిబోధమే ।**
**సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥ 13**

**తాత్పర్యము:** అర్జునా! వేదాంత శాస్త్రమునందు సమస్తకర్మల సిద్ధికొరకు చెప్పబడిన ఐదు కారణములను నేను నీకు ఇప్పుడు వివరముగా తెలియజేయుచున్నాను. శ్రద్ధతో గ్రహింపుము.

**అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।**
**వివిధాశ్చ పృథక్ చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ ॥ 14**

**శరీర వాఙ్మనోభిర్యత్ కర్మప్రారభతే నరః ।**
**న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్యహేతవః ॥ 15**

**తాత్పర్యము:** సమస్తకర్మలు సిద్ధించుటకు, దేహము, కర్త, వివిధ ఇంద్రియములు, పలువిధములైన కార్యములు, దైవము కారణములు.

మానవుడు త్రికరణములతో అనగా మనోవాక్కాయములతో చేయుకర్మలు ధర్మమైనవి అయినను, అధర్మమైనవి అయినను ఈ ఐదును కారణములని గ్రహించుము.

**తత్రైవం సతి కర్తారం ఆత్మానం కేవలం తు యః ।**
**పశ్యత్యకృతబుద్ధిత్వాత్ న స పశ్యతి దుర్మతిః ॥ 16**

**తాత్పర్యము:** ఏ మానవుడు కేవలం తాను మాత్రమే అవివేకముతో కర్తగా భావించునో, అట్టి దుర్మతి, అజ్ఞాని, యథార్థమును దర్శింపలేడు.

**యస్య నాహం కృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।**
**హత్వాపి స ఇమాన్ లోకాన్ న హంతి న నిబధ్యతే ॥ 17**

**తాత్పర్యము:** ఏ పురుషుడు నేనే కర్తను అనెడు భావములేనివాడో, ఎవడు అహంకారమును త్యజించునో, అట్టి నిరహంకారి లోకమునందు అందరిని హతమార్చినా, కర్మలచే బంధింపబడక చంపినవాడు కాదని గ్రహించుము.



**జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మ చోదనా ।**
**కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మ సంగ్రహః ॥ 18**

**తాత్పర్యము:** జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము ఇవి కర్మలవలన ప్రేరేపింపబడినవి. ఇవి మూడు విధములు. ఆ విధముగానే కర్త, కరణము, క్రియ అనునవి మూడు విధములు. ఇవి కర్మకు ఆధారములని చెప్పబడెను. వీటిని నీకు విపులముగా చెప్పెదను-వినుము.

**జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।**
**ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ॥ 19**

**తాత్పర్యము:** సాంఖ్య శాస్త్రమునందు జ్ఞానము, క్రియ, కర్తలను మూడు విధములుగా చెప్పబడెను. అవి సాత్త్వికాది గుణభేదములు. వాటిని సమగ్రముగా వివరించెదను. వినుము.

**సర్వభూతేషు యేనైకం భావమవ్యయ మీక్షతే ।**
**అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥ 20**

**తాత్పర్యము:** వివిధములైన సర్వప్రాణులయందును, అవి అఖండముగా నున్నట్టియు, వినాశముకానట్టియు, నశింపబడలేనట్టియు, అనే భావన చూడబడుచున్నదో అట్టి జ్ఞానము సాత్త్వికమని గ్రహించుము.

**పృథక్త్వేన తు యత్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్ ।**
**వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసం ॥ 21**

**తాత్పర్యము:** సమస్త ప్రాణులయందును రకరకములుగా నున్న వివిధ భావములను ఏ మనుజుడు వేరువేరుగా గ్రహించుచున్నాడో ఆజ్ఞానమును రాజసజ్ఞానమని అందురు.

**యత్తు కృత్స్నవ దేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్ ।**
**అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్ ॥ 22**

**తాత్పర్యము:** కాని, ఏ జ్ఞానము శరీరము నందుండినదియై అదియే సర్వస్వమని, అటువంటి ఆశను కల్గించునట్టిదియు, యుక్తియుక్తము కానట్టిదియును అయిన నీచమైన జ్ఞానమును తామసజ్ఞానమని చెప్పబడును.

**నియతం సంగరహితం అరాగద్వేషతః కృతమ్ ।**
**అఫలప్రేప్సునా కర్మ యత్తత్ సాత్త్వికముచ్యతే ॥ 23**

**తాత్పర్యము:** రాగద్వేషములను త్యజించి, ఆసక్తిలేక శాస్త్రసమ్మతముగా, నియతమైనది అగు ఏ కర్మ ఆచరించబడునో అట్టి కర్మసాత్త్విక కర్మ అని చెప్పబడుచున్నది.

**యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।**
**క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతం ॥ 24**

**తాత్పర్యము:** ఫలములను కోరుకొను వానిచేతనో, అహంకారముతో, అహంభావముతో, అతికష్టముతో చేయబడు యాగాది కర్మలను రాజసకర్మలని గ్రహింపుము.

**అనుబంధం క్షయం హింసాం అనపేక్ష్య చ పౌరుషమ్ ।**
**మోహాదారభ్యతే కర్మ యత్తత్ తామసముచ్యతే ॥ 25**

**తాత్పర్యము:** పరిణామమును, హింసాయుతమును, హానిని, క్షయమును, సామర్థ్యమును ఆలోచించక, అవివేకముతో చేయబడు కర్మను తామస కర్మ అని చెప్పబడును.

**ముక్తసంగోఽనహం వాదీ ధృత్యుత్సాహసమన్వితః ।**
**సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ 26**

**తాత్పర్యము:** ఫలాపేక్షలేనివాడును, అహంకారము లేనివాడును, ధైర్యము, ఉత్సాహములు కలిగియున్నవాడును, ప్రయత్నించిన కార్యము నెరవేరినను,



నెరవేరకున్నను, విషాదము పొందని వాడగు కర్త సాత్త్వికుడని ప్రసిద్ధిపొందును.

**రాగీకర్మఫలప్రేప్సుః లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।**
**హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥ 27**

**తాత్పర్యము:** నిషిద్ధములైన వస్తువులయందు కోరికలు కలవాడును, ఇతరుల ధనమునందు ఆసక్తి కలవాడును, లోభియును, అపవిత్రుడును, తాను ఇష్టపడిన పదార్థములు లభించిన ఆనందించువాడును, లేనిచో దుఃఖించువాడును అగు కర్త రాజసకర్త అని చెప్పబడును.

**అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠోనైష్కృతికోఽలసః ।**
**విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥ 28**

**తాత్పర్యము:** ఇంద్రియములను జయించి స్వాధీనములో నుంచుకొననివాడును, ఏకాగ్రతలేనివాడును, యుక్తుడుకానివాడును, లక్షణమైన ప్రవర్తనలేని పామరుడును, ఇతరులను మోసముచేయు గుణముకలవాడును, కారణములేకుండా ఇతరులకు కష్టము కలిగించువాడును, దుఃఖించువాడును, సోమరితనముతో కాలహరణము చేయువాడును అగు కర్త తామస కర్త అనబడును.

**బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు ।**
**ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ ॥ 29**

**తాత్పర్యము:** అర్జునా! బుద్ధియొక్కయు, ధైర్యము యొక్కయు వాటియొక్క గుణముల ఆధారముగా నున్న భేదమును విడివిడిగాను, పూర్తిగాను చెప్పెదను వినుము.

**ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।**
**బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ సాత్త్వికీ ॥ 30**

**తాత్పర్యము:** పార్థా! ప్రవృత్తి నివృత్తి విషయములను కర్తవ్యమును, అకార్యములను, భయాభయములను, ఆ విధముగానే బంధమోక్షములందును ఏ బుద్ధిగ్రహించునో అట్టిదానిని సాత్త్వికబుద్ధి అని గ్రహించుము.

**యయా ధర్మమధర్మం చ కార్యం చా కార్యమేవచ ।**
**అయథావత్ ప్రజానాతి బుద్ధిః సా పార్థ! రాజసీ ॥ 31**

**తాత్పర్యము:** అర్జునా! ఏ బుద్ధిచేత శాస్త్రసమ్మతమైన కర్మమును శాస్త్రము నిషేధించిన కర్మమును తన కర్తవ్యమును, అకర్తవ్యమును మానవుడు నిర్ణయింపబడినట్లు కాక, దానికి భిన్నముగా గ్రహించినచో దానిని రాజస బుద్ధి అని అందురు.

**అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽ వృతా ।**
**సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ ॥ 32**

**తాత్పర్యము:** అర్జునా! ఏ బుద్ధి ధర్మమును అధర్మముగా, అధర్మమును ధర్మముగా, సర్వవిషయములను విపరీతముగా తలంచుచున్నదో అట్టి బుద్ధిని తామస బుద్ధి అని చెప్పబడినది.

**ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియ క్రియాః ।**
**యోగేనావ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ ॥ 33**

**తాత్పర్యము:** పార్థా! ఏ ధారణాశక్తితో మానవుడు ప్రాణేంద్రియ క్రియలను, మనస్సును శాస్త్రసమ్మతముగా ధరించుచున్న ధృతిని కలిగియున్నాడో అట్టి మానవుని బుద్ధిని సాత్త్వికమని గ్రహించుము.

**యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽ ర్జున ।**
**ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిః సా పార్థ రాజసీ ॥ 34**

**తాత్పర్యము:** అర్జునా! ఎక్కువ ఆసక్తితో ఫలముగోరువాడు ఏ బుద్ధితో ధర్మ, అర్థ, కామములను నిత్య కర్తవ్యములుగా ధారణ చేయుచున్నాడో అతనిది రాజసికమని చెప్పబడును.



**యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।**
**స విముంచతి దుర్మేధా ధృతిః సా పార్థ తామసీ ॥ 35**

**తాత్పర్యము:** అర్జునా! దుర్బుద్ధితో నిద్రను, భయమును, సంతాపమును, విషాదమును మరియు మదమును ఎవడు విడువకుండునో అతనిది తామసమైనది.

**సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।**
**అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి ॥ 36**

**తాత్పర్యము:** పార్థా! సుఖము మూడు విధములుగా యున్నది. వాటిని వివరించెదను వినుము. ఎటువంటి సుఖమును నిత్య అభ్యాసమువలన మానవుడు ఆనందించునో, పిమ్మట దుఃఖనాశనానంతరము సుఖమును పొందుచున్నాడో అట్టి సుఖము మూడువిధములుగా చెప్పబడుచున్నది.

**యత్తదగ్రే విషమివ పరిణామేఽ మృతోపమమ్ ।**
**తత్సుఖం సాత్త్వికం ప్రోక్తం ఆత్మబుద్ధి ప్రసాదజమ్ ॥ 37**

**తాత్పర్యము:** ఏ సుఖము ప్రారంభమునందు విషమని తోచునో, అంతమున అమృతముగా పరిగణింపబడునో, పరమాత్మ మూలముగా నిర్మలముగా యుండునో అట్టి సుఖము సాత్త్వికము.

**విషయేంద్రియ సంయోగాత్ యత్తదగ్రేఽ మృతోపమమ్ ।**
**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ 38**

**తాత్పర్యము:** ఏ విషయ వాంఛలవల్ల ఏ సుఖము ప్రారంభ దశయందు సుఖదాయకముగా నుండి తదనంతరము అంతమునందు విషప్రాయముగా నుండునో దానిని రాజస సుఖము అని అందురు.

**యదగ్రే చానుబంధే చ సుఖం మోహనమాత్మనః ।**
**నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ ॥ 39**

**తాత్పర్యము:** ఏ సుఖము ప్రారంభమునందు, అంతమునందు ఆత్మకు మోహకరముగానుండునో, నిద్ర, సోమరితనము మరుపు కలిగించునో అట్టి సుఖము తామసమని గ్రహింపుము.

**న తదస్తి పృథివ్యాం వా దివిదేవేషు వా పునః ।**
**సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిః స్యాత్ త్రిభిర్గుణైః ॥ 40**

**తాత్పర్యము:** ఈ త్రిగుణముల బంధమునుండి, భూలోకమునందుగాని, స్వర్గలోకమునందుగాని, దేవతలయందుగాని, ఏ ఇతరలోకమందుగాని ఈ మాయనుండి విడుదల పొందిన గుణమును సాత్త్వికమని చెప్పబడును.

**బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప ।**
**కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః ॥ 41**

**తాత్పర్యము:** అర్జునా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు వారి కర్తవ్యములు, వారి వారి స్వభావముల ప్రకారముగా వారి వారి గుణములు విభజింపబడి ఏర్పాటు చేయబడినవి.

**శమో దమస్తపః శౌచం క్షాంతిరార్జవమేవ చ ।**
**జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్ ॥ 42**

**శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యద్ధే చాప్యపలాయనం ।**
**దానమీశ్వర భావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥ 43**

**తాత్పర్యము:** ఇంద్రియములను, తమ వశములో నుంచుకొనుట, మనో నిగ్రహము, తపస్సు, క్షమ, ఋజుత్వము, జ్ఞాన, విజ్ఞానములు, శుచిత్వము, భగవంతునియందు విశ్వాసము అనగా ఆస్తిక్యము ఇవన్నియు బ్రాహ్మణులకు నియమించబడిన విధులు.

శౌర్యము, యుద్ధమునందు భీతిచే మధ్యలో పారిపోకుండా జయము లభించువరకు పోరాడుట, దానము, శాసించు శక్తి, ధైర్యము, ఈశ్వరభావము, క్షత్రియ ధర్మములు కలిగియుండుట ఇవన్నియు క్షత్రియ కర్మములు.



**కృషిగోరక్ష్య వాణిజ్యం వైశ్యంకర్మ స్వభావజమ్ ।**
**పరిచర్యాత్మకం కర్మశూద్రస్యాపిస్వభావజమ్ ॥ 44**

**తాత్పర్యము:** కృషి, గోరక్షణ, వ్యాపారము మొదలగునవి వైశ్యులకు విధింపబడిన కర్మములు. శూద్రులకు పరిచర్యలుచేయుట విధింపబడిన కర్మ.

**స్వేస్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।**
**స్వకర్మ నిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు ॥ 45**

**తాత్పర్యము:** మానవులు తమకు విధించబడిన విధులను నిర్వర్తించుచూ, అట్టి స్వీయకర్మములయందు శ్రద్ధతో నిర్వర్తించువారు ఏ రీతిగా సిద్ధిని పొందెదరో వివరించెదను వినుము.

**యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।**
**స్వకర్మణా తమ భ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ॥ 46**

**తాత్పర్యము:** సర్వప్రాణుల ఉత్పత్తి ఏ పరమాత్మునిచేత కలుగుచున్నదో, ఎవనివలన ఈ సమస్త విశ్వము వ్యాపించియున్నదో, అట్టి పరమేశ్వరుని, మానవుడు తనకు విధింపబడిన స్వాభావికమైన కర్మములచేత అర్చించి సిద్ధిని పొందును.

**శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।**
**స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 47**

**తాత్పర్యము:** మానవుడు తనకు విధింపబడిన కర్మములను, ధర్మములను శ్రద్ధతో నిర్వర్తించిన అదిశ్రేష్ఠము, శ్రేయోదాయకము. పరధర్మాచరణ పాపమును కలిగించును.

**సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్ ।**
**సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥ 48**

**తాత్పర్యము:** అర్జునా! సహజముగా, విధింపబడిన స్వధర్మము దోషముతో కూడియున్నను దానిని త్యజించకూడదు. ఎందువలన అనగా, అగ్ని పొగచేత కప్పబడినట్లు సమస్త కర్మములు దోషముచేత ఆవరించబడియున్నవి.

**అసక్త బుద్ధిః సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।**
**నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి ॥ 49**

**తాత్పర్యము:** సర్వవిషయములందును ఆసక్తి, ఆశలేని మనుజుడు సవ్యమైన చిత్తముకలవాడు. అటువంటివాడు ధర్మయుతమైన సన్న్యాసముచేత అత్యంత ఉత్కృష్టమైనటువంటి ఆత్మ స్వరూప సిద్ధిని పొందును.

**సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే ।**
**సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ 50**

**తాత్పర్యము:** అర్జునా! జ్ఞానయోగముయొక్క సిద్ధిని పొందిన మనుజుడు ఏ విధముగా పరమాత్మను పొందునో ఆ జ్ఞాన నిష్ఠావిధానమును నీవు నా ద్వారా గ్రహించుము.

**బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ ।**
**శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥ 51**

**వివక్తసేవీ లఘ్వాశీ యుతవాక్కాయమానసః ।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥ 52**

**అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।**
**విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ॥ 53**

**తాత్పర్యము:** స్వచ్ఛమైన, నిర్మలమైన, బుద్ధితో అనగా ఆత్మను బ్రహ్మముగా తలంచుకొని, నిగ్రహమునుపొంది, ధైర్యముగా రాగద్వేషములను దూరముగా నుంచడమేకాక పరిత్యజించి, ఏకాంతవాసి అగుచు, మితాహారముతో మనోవాక్కాయములను అదుపులో నుంచుకొన్నవాడును, ధ్యానయోగమును అవలంబించువాడును, వైరాగ్యమును పాటించువాడును, బలం, దర్పం, కామం క్రోధాదులను పరిత్యజించినవాడును, ద్రవ్యమునందు ఆసక్తిని వీడినవాడును, మమకారమును, వదలి జీవితమును సాగించువాడును, శాంతుడును అగు మనుజుడు బ్రహ్మత్వమును పొందుటకు సమర్థుడగును.



**బ్రహ్మ భూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।**
**సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥ 54**

**తాత్పర్యము:** బ్రహ్మజ్ఞానము పొందుటకు అర్హత కలిగినవాడు, అట్టి నిష్ఠకలవాడు, ప్రాప్తమగునట్టి విషయములు లభించకపోయినను శోకింపడు. అప్రాప్త విషయములను ఆశింపడు. సర్వప్రాణులయందు సమానమైన భావముతో నుండువాడు జ్ఞానలక్షణమగు, ఉత్తమమైన నా భక్తిని పొందుచున్నాడు.

**భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః ।**
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్ ॥ 55**

**తాత్పర్యము:** భక్తి జ్ఞానుల లక్షణము. అటువంటి భక్తితో పరంధాముడైన నన్ను యథార్థరూపమున ఎంతటి శక్తిమంతుడనో తెలిసికొని, నా తత్త్వమును గ్రహించిన భక్తుడు తక్షణమే నాలో ప్రవేశించి నాయందే ఏకాగ్రమైన మనస్సుతో ఉండును.

**సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।**
**మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ॥ 56**

**తాత్పర్యము:** నిరంతరము సర్వకర్మలను చేయుచున్నను, నన్నే ఆశ్రయించి శరణుపొందిన భక్తుడు నా అనుగ్రహమును పొందును. అతడు నాశనములేని శాశ్వతమైన పరమపదమును అనగా మోక్షమును పొందును.

**చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।**
**బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ ॥ 57**

**తాత్పర్యము:** వివేకమైన చిత్తముచేత సర్వకర్మలను నాకు సమర్పించి నాయందు ఆసక్తికలవాడవు కమ్ము. ఏకాగ్రమైన బుద్ధితో ఎల్లవేళలయందు సదా నాయందే చిత్తము కలవాడవై యుండుము.

**మచ్చిత్తః సర్వ దుర్గాణి మత్ప్రసాదాత్ తరిష్యసి ।**
**అథ చేత్ త్వమహంకారాత్ నశ్రోష్యసి వినంక్ష్యసి ॥ 58**

**తాత్పర్యము:** నాయందు నిరంతరము మనస్సుతోనున్న నీవు, అతికష్టమైన సంసార తాపత్రయముల నన్నింటిని అత్యంత సులభముగా దాటగలవు. నేను బోధించిన ఈ తత్త్వమును నీవు అహంకారముచేత వినకుండా ప్రవర్తించిన ఎడల, భ్రష్టుడవగుదువు.

**యదహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।**
**మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥ 59**

**తాత్పర్యము:** అహంకారముతో యుద్ధము చేయను అని నీవు తలంచెదవేని నీ నిర్ణయము వ్యర్థమగును. నీ క్షత్రియస్వభావమే నీచే యుద్ధము చేయించును.

**స్వభావజేన కౌంతేయ నిబద్ధః స్వేన కర్మణా ।**
**కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోఽపి తత్ ॥ 60**

**తాత్పర్యము:** అర్జునా! ఒకవేళ అవివేకముతో నీవు చేయవలసిన కర్తవ్యమును ఇష్టములేక నిర్వహించకపోయిన, నీ స్వర్గమోహ ప్రభావముచేత పరవశుడవై ఆ పనిని నిర్వర్తించుదువు.

**ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।**
**భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥ 61**

**తాత్పర్యము:** అర్జునా! ఈశ్వరుడు తన మాయచేత తమ తమ దేహములమీద అభిమానముగల ప్రాణులందరి హృదయములలోను స్థిరపడియున్నాడు.



**తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।**
**తత్ప్రసాదాత్ పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥ 62**

**తాత్పర్యము:** అర్జునా! సర్వవిధములా మనస్ఫూర్తిగా ఈశ్వరునే శరణు పొందుము. ఆ పరమేశ్వరుని కృపవలన అనుగ్రహమువలన పరమశాంతిని శాశ్వతమైన మోక్షమును పొందగలవు.

**ఇతితే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।**
**విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥ 63**

**తాత్పర్యము:** రహస్యములనన్నింటి కంటెను అతి రహస్యమైన జ్ఞానము నాచేత విశదీకరించబడినది. దీనిని సర్వవిధములా విచారించి అటుపిమ్మట నీకు తోచిన రీతిగా చేయుము.

**సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః ।**
**ఇష్టోఽసిమే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్ ॥ 64**

**తాత్పర్యము:** పరమరహస్యమగునది, ఉన్నతమైనది, శ్రేష్ఠమైనది అగు నా మాటలను వినుము. నీవు నాకు అత్యంత ప్రియుడవు. కనుక, నీకు ఇంకనూ హితమైన వచనములను తెలియజేయుచున్నాను. శ్రద్ధగా వినుము.

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసిమే ॥ 65**

**తాత్పర్యము:** నా మీదే నీ చిత్తమును నిల్పుము. నన్ను పూజించుతూ నా యందు భక్తితో మెలగుచూ నాకు అత్యంత భక్తుడవుకమ్ము. నాకు ప్రణామము జేయుము. నీవు నా కత్యంత ప్రియమైన వానివి, ఇష్టమైనవాడివి.

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ 66**

**తాత్పర్యము:** సర్వధర్మములను నీవు త్యజించి, సర్వేశ్వరుడను, జరామరణములు లేనివాడను, పరాత్పరుడను అయిన నన్నే

శరణువేడుకొనుము. నన్నే ఆశ్రయింపుము. నేను నిన్ను సర్వపాపములనుండి నిశ్చయముగా విముక్తినిజేసి ముక్తిని ప్రసాదించెను. నీవు శోకింపవలదు.

**ఇదం తే నా తపస్కాయ నా భక్తాయ కదాచన ।**
**న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి ॥ 67**

**తాత్పర్యము:** ఇపుడు నేను నీకు బోధించిన ఈ గీతోపదేశము బహురహస్యమైనది. దీనిని తపోరహితునకును, భక్తిలేనివానికిని, నన్ను సామాన్య మానవునిగా భావించువానికిని, నన్ను ద్వేషించు నీచునకు ఏ సమయమునందు చెప్పవలదు. ఇది అట్టి మానవులకు చెప్పబడరానిది.

**య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్య సంశయః ॥ 68**

**తాత్పర్యము:** ఎవడు నాయందు పరమభక్తిని కలిగియుండి సందేహము లేనివాడైన మానవుడు ఈ అతిరహస్యమైన గీతాజ్ఞానమును అర్హులైనవారికి, నా భక్తులకు వివరించునో అతడు నిశ్చయముగా నన్నే పొందును.

**న చ తస్మాన్ మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మే తస్మాత్ అన్యః ప్రియతరో భువి ॥ 69**

**తాత్పర్యము:** అటువంటి మానవులలో, వారికంటె అనగా ఈ గీతాజ్ఞానమును బోధించువానికంటె ప్రియమైనవారు ఇంకొకరు లేరు. ఇతరులు నాకు ప్రియమైనవారు కారు.

**అధ్యేష్యతే చ ఇమం ధర్మ్యం సంవాద మావయోః ।**
**జ్ఞానయజ్ఞేన తే నాహ మిష్టః స్యామితి మే మతిః ॥ 70**

**తాత్పర్యము:** ఎవరైతే మన ఇరువురు జరిపిన ఈ అమృతవాణి అగు గీతా సంవాదమును పఠించి ఆరాధింతురో వారిచేత నేను తప్పక పూజింపబడుదును.



**శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।**
**సోఽపి ముక్తః శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్ పుణ్యకర్మణామ్ ॥ 71**

**తాత్పర్యము:** శ్రద్ధతో కూడియున్నవాడును, అసూయలేనివాడును జ్ఞానసహితుడును, దోషములేకుండా ఏ మానవుడు అ అమృతవాణి అగు ఈ గీతాశాస్త్రమును వినునో అతడు పాపమునుండి విముక్తిచెంది పుణ్యపురుషులు పొందదగిన పుణ్యలోకములను పొందుట తథ్యము.

**కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా ।**
**కచ్చిదజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ ॥ 72**

**తాత్పర్యము:** ఈ నా అమృతవాణిని నీవు ఏకాగ్రతతో, పరిశుభ్రమైన చిత్తముతో వినియుంటివా ఓ అర్జునా! ఒకవేళ అజ్ఞానముతో ఉండిన మోహము నిర్మూలింపబడినదా!

**అర్జున ఉవాచ**

**నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత ।**
**స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥ 73**

**తాత్పర్యము:** అర్జునుడు ఈ విధముగా కృష్ణపరమాత్మను అడిగెను. కృష్ణా! నీ కృపవలన, నీ అనుగ్రహమువలన నా అజ్ఞానము పూర్తిగా తొలగి సందేహములు లేనివాడనైతిని. ఆత్మతత్త్వమును పొందగలిగితిని. అందువలన నీ ఆజ్ఞను, సందేశమును తప్పక పాటించి కృతార్థుడను అగుదును.

**సంజయ ఉవాచ**

**ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।**
**సంవాదమిమ మశ్రౌషం అద్భుతం రోమహర్షణమ్ ॥ 74**

**తాత్పర్యము:** సంజయుడు పల్కెను. ఈ విధముగా పరమాత్ముడై కృష్ణునియొక్కయు, పాండవ మధ్యముడైన అర్జునుని యొక్కయు

అద్భుతమైనదియు, విస్మయమును కలిగించునట్టిది, రోమాంచకమైనది అగు సంభాషణమును మనస్ఫూర్తిగా వినినటువంటి అదృష్టవంతుణ్ణి.

**వ్యాసప్రసాదాచ్ఛ్రుతవాన్ ఏతద్గుహ్యతమం పరమ్ ।**
**యోగం యోగేశ్వరాత్ కృష్ణాత్ సాక్షాత్ కథయతః స్వయమ్ ॥75**

**తాత్పర్యము:** వ్యాసుని దయవలన ఈ అతిరహస్యముగా వెలుగొందుచూ చెప్పబడు ఈ శ్రీకృష్ణామృతవాణి అగు గీతాశాస్త్రమును నా అదృష్టముచేత శ్రీకృష్ణభగవానుడు బోధించబడినది. దీనిని నేను స్వయముగా ప్రత్యక్షముగా వినియుంటిని.

**రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదం ఇమమద్భుతమ్ ।**
**కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥ 76**

**తాత్పర్యము:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! కృష్ణభగవానునికి అర్జునునకు మధ్య జరిగిన ఈ అశ్చర్యకరమును, అద్భుతమైనది అగు సంవాదమును అను క్షణము తలంచుకొనుచూ ఆనందించుచున్నాను.

**తచ్చ సంస్మృత్య సంస్మృత్యరూపమత్యద్భుతం హరేః ।**
**విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః పునః ॥ 77**

**తాత్పర్యము:** రాజా! శ్రీకృష్ణభగవానునియొక్క అత్యద్భుతమైన ఈ పవిత్ర విశ్వరూపమును స్వయముగా దర్శించి నిత్యము స్మరించుచు మరలమరల సంతోషముతో మునిగిన నేను చాలా అదృష్టవంతుణ్ణి.

**యత్ర యోగేశ్వరః కృష్ణో యత్రపార్థో ధనుర్ధరః ।**
**తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతిర్మతిర్మమ ॥ 78**

**తాత్పర్యము:** ఎచ్చట మాయాధీశ్వరుడు, యోగీశ్వరుడు అయిన శ్రీకృష్ణభగవానుడు, ధనుస్సును ధరించిన అర్జునుడు ఉందురో అచట సమస్త



జయములును ధనధాన్యసంపదలు, స్థిరముగా నుండుచూ నీతినియమములు తప్పక ఉండునని నా నిశ్చితాభిప్రాయము.

భగవంతునియందు పవిత్రమైన భక్తి కలిగియున్న మానవునకు ఆత్మజ్ఞానము కలిగి అత్యంత సులభముగా సహజముగా మోక్షము లభింపగలదు. ఇదియే శ్రీకృష్ణామృతవాణి అగు గీతాశాస్త్ర సందేశము.

***ఇట్లు ఉపనిషత్తులును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రము శ్రీకృష్ణార్జున సంవాదమును శ్రీకృష్ణామృతవాణియైన భగవద్గీతయందలి మోక్షసన్న్యాస యోగమను పద్ధెనిమిదవ అధ్యాయము.***

***శ్రీకృష్ణామృతవాణి దీనితో సంపూర్ణము.***

# పదవివరణలు

**1. త్రిమూర్తులు**

1. బ్రహ్మ 2. విష్ణువు 3. మహేశ్వరుడు

**2. త్రిమూర్తుల వాహనాలు**

1. బ్రహ్మ- హంస, 2. విష్ణువు- గరుత్మంతుడు, 3. మహేశ్వరుడు- నంది.

**3. అమ్మలకన్న అమ్మలు**

1. బ్రహ్మ- సరస్వతి, 2. విష్ణువు- లక్ష్మి, 3. మహేశ్వరుడు- పార్వతి.

**4. ప్రజాపతులు :**

1. కశ్యపుడు, 2. మరీచి, 3. దక్షుడు, 4. అత్రి, 5. అంగీరసుడు, 6. పులస్త్యుడు, 7. ప్రచేతసుడు, 8. వశిష్ఠుడు, 9. భృగువు, 10. నారదుడు, 11. క్రతువు, 12. పులహుడు (మనుస్మృతి ప్రకారం)

**5. సప్తఋషులు**

1. మరీచి, 2. అత్రి, 3. అంగీరసుడు, 4. పులస్త్యుడు, 5. పులహుడు, 6. క్రతువు, 7. వశిష్ఠుడు (అమరం ప్రకారం)

**6. దిక్పాలకులు - వారి వాహనాలు - వారు ఉండే దిక్కులు**

1. తూర్పు- ఇంద్రుడు- ఐరావతం, 2. ఆగ్నేయం- అగ్ని- మేక, 3. దక్షిణం- యముడు- దున్నపోతు, 4. నైరుతి- నిర్యతి- గుఱ్ఱము, 5. పడమర- వరుణుడు- మొసలి, 6. వాయువ్యం- వాయుదేవుడు- లేడి, 7. ఉత్తరం- కుబేరుడు- నరుడు, 8. ఈశాన్యం- ఈశానుడు- వృషభం.

**7. నవగ్రహాలు - వారి వాహనాలు**

1. కుజుడు- మేక, 2. శుక్రుడు- తెల్లగుర్రం, 3. బుధుడు- సింహం, 4. సూర్యుడు- ఏడుగుర్రాల రథం, 5. చంద్రుడు- లేడి, 6. గురుడు- ఏనుగు, 7. రాహువు- పులి, 8. కేతువు- సర్పం, 9. శని- కాకి.

**8. చతుర్వేదములు**

1. ఋగ్వేదము, 2. యజుర్వేదము, 3. సామవేదము, 4. అధర్వణ వేదము.

**9. చతురాశ్రమములు**

1. బ్రహ్మచర్యము, 2. గృహస్థాశ్రమ, 3. వానప్రస్థాశ్రమము, 4. సన్యాస ఆశ్రమము.

**10. పంచ మహాపాతకములు**

1. బంగారము దొంగతనం చేయడం, 2. బ్రహ్మహత్య, 3. మద్యపానము, 4. పాపుల సహవాసములు, 5. గురుపత్నీ గమనము.

**11. ఆత్మ**

1. అచలము- చలించనిది, 2. స్థాణువు- స్థిరమైనది, 3. సనాతనము- శాశ్వతము, 4. అవ్యక్తము- ఇంద్రియములకు గోచరముకానిది, 5. అచింత్యము- మనస్సుకు అందనిది, 6. యాదృచ్ఛికము- అనుకోకుండా తటస్థించినది.

**12. అష్ట ఐశ్వర్యములు**

1. దాసదాసీలు, 2. సేవకులు, 3. బంధువులు, 4. వాహనములు, 5. మిత్రులు, 6. ధనము, 7. పుత్రులు, 8. ధాన్యము

**13. అష్ట భోగములు**

1. అన్నము, 2. గంధము, 3. పుష్పము, 4. తాంబూలము, 5. వస్త్రము, 6. స్త్రీ, 7. పానుపు, 8. గానము.

**14. అష్ట అవధానములు**

1. చతురంగము, 2. చదువు, 3. వ్రాయుట, 4. కవిత్వము, 5. సంగీతము, 6. వ్యస్తాక్షరి, 7. గణితము, 8. యుక్తి సమాధానములు.

**15. పంచాంగములు**

1. తిధి, 2. వారము, 3. నక్షత్రము, 4. యోగము, 5. కరణము.

**16. పంచవర్ణములు**

1. తెలుపు, 2. ఎరుపు, 3. నలుపు, 4. ఆకుపచ్చ, 5. పసిమి.

**17. పంచ గవ్యములు**

1. గోమూత్రము, 2. గోమయము, 3. గోఘృతము, 4. గోదధి, 5. గోక్షీరము

**18. పంచామృతములు**

1. పాలు, 2. పెరుగు, 3. నెయ్యి, 4. తేనె, 5. నారికేళోదకములు

**19. షడ్రసములు**

1. ఉప్పు, 2. పులుపు, 3. కారము, 4. తీపి, 5. చేదు, 6. వగరు.

**20. సప్తవ్యసనములు**

1. జూదము, 2. స్త్రీలోలత్వము, 3. వేట, 4. మద్యపానము, 5. కఠినముగా మాట్లాడుట, 6. పరధనాపహరణము, 7. ఇతరులను నిందించుట.

**21. అరిషడ్వర్గము**

1. కామము, 2. క్రోధము, 3. లోభము, 4. మోహము, 5. మదము, 6. మాత్సర్యము.

**22. నవరత్నములు**

1. వజ్రము, 2. వైడూర్యము, 3. గోమేధికము, 4. పుష్యరాగము, 5. మరకతము, 6. మాణిక్యము, 7. నీలము, 8. ప్రవాళము, 9. మౌక్తికము

**23. నవధాన్యాలు**

1. వడ్లు, 2. ఉలవలు, 3. పెసలు, 4. మినుములు, 5. నువ్వులు, 6. గోధుమలు, 7. అనుములు, 8. కందులు, 9. శనగలు



**24. త్రిగుణములు**

1. సత్వము, 2. రజస్సు, 3. తమోగుణములు

**25. పురుషులలో చతుష్టయము**

1. భద్రుడు, 2. దత్తుడు, 3. కూచిమారుడు, 4. పాంచాలుడు.

**26. స్త్రీలలో చతుష్టయము (స్త్రీ జాతి భేదములు)**

1. పద్మిని, 2. హస్తిని, 3. చిత్తిని, 4. శంఖిణి

**27. పంచభూతములు**

1. పృథ్వి, 2. జలము, 3. తేజ, 4. వాయువు, 5. ఆకాశము.

**28. పంచకర్మేంద్రియములు**

1. వాక్కు, 2. పాణి, 3. పాదము, 4. పాయువు, 5. ఉపస్థ.

**29. ఛందస్సులు మూడు**

1. వసూన్ - ఇది గాయత్రీ ఛందస్సు 3 పాదాలు, పాదానికి 8 అక్షరాలు
2. అదిత్యాన్ - జగతీ ఛందస్సు ఇది 4 పాదాలు, పాదానికి 12 అక్షరాలు
3. త్రిష్టుప్ ఛందస్సు 4 పాదాలు, పాదానికి 11 అక్షరాలు. విశ్వము ఈ మూడు ఛందస్సుల మీద ఆధారపడివుంది.

**30. శంఖములు - వాటిని ధరించువారు**

1. కృష్ణుడు- పాంచజన్యము, 2. ధర్మరాజు- అనంత విజయము, 3. భీముడు- పౌండ్రము, 4. అర్జునుడు- దేవదత్తము, 5. నకులుడు- సుఘోష, 6. సహదేవుడు- మణిపుష్పకము

**31. సప్తమోక్ష నగరములు**

1. అయోధ్య, 2. మధుర, 3. హరిద్వారము (మాయా), 4. కాశీ, 5. కంచి, 6. అవంతిక (ఉజ్జయిని), 7. జగన్నాథపురి (ఒరిస్సాలోని పూరీజగన్నాథము)

**32. పంచభూతాత్మక శివ లింగములు**

1. కంచి– పృధ్వీలింగము, 2. జంబుకేశ్వరము– అబ్లింగము, 3. అరుణాచలం– తేజోలింగం, 4. శ్రీకాళహస్తి– వాయులింగము, 5. చిదంబరం– ఆకాశం

**33. సత్యము**

1. సత్యమైన ప్రియమైన మాటను పలుకుట. 2. సత్యమైనను, అప్రియమైన పలుకు పలుకరాదు, 3. ప్రీతికరమగును కదా అని అసత్యము పలుక వలదు. ఇది సనాతన ధర్మము, 4. మనస్సుకు నొప్పి కలిగింపక సత్యములు, హితకరములు, సంతోషప్రదమైన మాటలు, స్వాధ్యాయాభ్యాసము (ఉత్తమ గ్రంథపారాయణము, జపస్తోత్ర సంకీర్తనాదులు) వాచిక తపస్సు అని భగవద్గీత చెప్పుచున్నది. మౌనము బంగారము.

**34. రాశులు - నక్షత్రములు**

1. మేషరాశి - అశ్వని, భరణి, కృత్తిక 1వ పాదము

2. వృషభరాశి - కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2

3. మిథునరాశి - మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1,2

4. కర్కాటకరాశి - పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష

5. సింహరాశి - మఖ, పుబ్బ, ఉత్తర 1 పా

6. కన్యారాశి - ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త, 1,2 పా

7. తులారాశి - చిత్త 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3పా

8. వృశ్చికరాశి - విశాఖ 4పా, అనురాధ జ్యేష్ఠ

9. ధనూరాశి - మూల పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

10. మకరరాశి - ఉత్తరాషాఢ 2,3,4 పా,శ్రవణం, ధనిష్ఠ 1,2 పా



11. కుంభరాశి - ధనిష్ఠ 3,4 పా, శతభిషం, పూర్వాభాద్ర 1,2 పా

12. మీనరాశి - పూర్వా భాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

**35. ఋతువులు**

1. చైత్ర, వైశాఖ మాసములు– వసంతఋతువు

2. జ్యేష్ఠ, ఆషాఢములు– గ్రీష్మఋతువు

3. శ్రావణ, భాద్రపదములు– వర్షఋతువు

4. ఆశ్వయుజ, కార్తీకములు– శరదృతువు

5. మార్గశిర, పుష్యమాసములు– హేమంతఋతువు

6. మాఘ, ఫాల్గుణములు– శిశిరఋతువు.

**36. పురుషార్థములు**

1. ధర్మము, 2. అర్థము, 3. కామము, 4. మోక్షము

**37. పూజలు రెండు విధాలు**

1. నిత్య 2. నైమిత్తిక

**38. ఉపవేదములు**

1. ఆయుర్వేదము, 2. ధనుర్వేదము, 3. గాంధర్వవేదము, 4. అర్థవేదము.

**39. వేదాంగములు**

1. శిక్ష, 2. వ్యాకరణము, 3. ఛందస్సు, 4. నిరుక్తము, 5. జ్యోతిష్యము, 6.కల్పము

**40. శ్రీమహా విష్ణువు దశావతారములు**

1. మత్స్యావతారము, 2. కూర్మావతారము, 3. వరాహావతారము, 4. నరసింహావతారము, 5. వామనావతారము, 6. పరశురామావతారము,

7. రామావతారం, 8. బుద్ధావతారము, 9. కృష్ణావతారము, 10. కల్కి అవతారము.

**41. దాచవలసినవి**

1. ఆయువు, 2. ధనం, 3. మంత్రం, 4. గృహకలహం, 5. ఔషధం, 6. సంగమం, 7. దానం, 8. మానం, 9. అవమానం

**42. పుష్కరములు - నదులు**

1. ప్రణీతానది, 2. గంగానది, 3. నర్మదానది, 4. సరస్వతీనది, 5. యమునానది, 6. గోదావరీనది, 7. కృష్ణానది, 8. కావేరీనది, 9. భీమరధీనది, 10. పుష్కరిణీనది, 11. తుంగభద్రానది, 12. సింధూనది.

**43. నవగ్రహాలకు ప్రీతికరమైనవి**

1. రవికి – చెరుకుముక్క, 2. కుజునకు – పరమాన్నము, 3. గురువునకు – అరటిపండు, 4. శనికి – నేరేడుపండు, 5. రాహువునకు – తేనె, 6. కేతువుకు – కొబ్బరికాయ, 7. చంద్రుడికి – ఆవుపాలు, 8. బుధునకు – ద్రాక్షరసము, 9. శుక్రునకు – పటిక బెల్లము

**44. తిథులు - వార అధిపతులు**

1. పాడ్యమి– అగ్ని, 2. విదియ– బ్రహ్మ, 3. తదియ– పార్వతి, 4. చవితి– విఘ్నేశ్వరుడు, 5. పంచమి– ఆదిశేషుడు, 6. షష్ఠి– కుమారస్వామి, 7. సప్తమి– సూర్యుడు, 8. అష్టమి– శివుడు, 9. నవమి– అష్టవసువు, 10. దశమి– దిగ్గజములు (యముడు), 11. ఏకాదశి– యముడు (శివుడు), 12. ద్వాదశి– విష్ణువు, 13. త్రయోదశి– మన్మథుడు, 14. చతుర్దశి– కలిపురుషుడు, 15. పౌర్ణమి– చంద్రుడు, 16. అమావాస్య– పితృదేవతలు.

**45.1. సంతృప్తి :** దేనితోనైనను సంతృప్తి చెందనివాడు ఎవ్వరినీ సంతృప్తి పరచలేడు.



**2. భయం :** 'భయం అనేది ఎపుడూ కూడా అజ్ఞానం నుండే పుట్టుకు వస్తుంది.

**3. సోమరితనం :** ఇది మూర్ఖపు జనుల బద్ధకమును చేపట్టిన శలవు రోజు.

**4. మిత్రుడు :** విజ్ఞతను వృద్ధిచేసేవాడు.

**5. శత్రుత్వము :** ఇది అజ్ఞానానికి బందీ.

**6. నీ కర్తవ్యం :** ఆనందాన్ని, సంతోషాన్ని సాధించడం.

**46. దంభి**

బలవంతంగా బాహ్యముగా, ఇంద్రియ వ్యాపారములను నిగ్రహించి మానసికంగా ఇంద్రియ, విషయములను చింతించునట్టివాడు (అనగా మిథ్యాచారి)

**46. అష్టాదశ శక్తిపీఠములు**

లంకాయాం శాంకరీ దేవీ – కామాక్షీ కాంచికాపురే ॥
ప్రద్యుమ్నే శృంఖలాదేవీ – చాముండీ క్రౌంచ పట్టణే ॥
అలంపురీ జోగులాంబా – శ్రీశైలే భ్రమరాంబికా ॥
కొల్హాపురీ మహాలక్ష్మీ – మాహూరే ఏకవీరకా ॥
ఉజ్జయిన్యాం మహాకాళీ – పీఠ్యాంచ పురుహూతికా
ఓఢ్యాణే గిరిజాదేవీ – మాణిక్యాం దక్షవాటికే ॥
హరిక్షేత్రౌ కామరూపీ – ప్రయాగే మాధవేశ్వరీ ॥
జ్వాలాయాం వైష్ణవీదేవీ – గయా మాంగల్య గౌరికా ॥
వారాణాస్యాం విశాలాక్షీ, – కాశ్మీరేషు సరస్వతీ ॥

1. శ్రీలంక – శాంకరీదేవి

2. కంచి – కామాక్షీదేవి

3. ప్రద్యుమ్నం– సింహళాదేవి, శృంఖలాదేవి (సింహళం)

4. చాముండీదేవి – క్రౌంచపట్టణం – (కర్ణాటక)

5. అలంపురం – జోగులాంబ (ఆం.ప్ర)

6. శ్రీశైలం – భ్రమరాంబాదేవి (ఆం.ప్ర)

7. కొల్హాపురం – మహాలక్ష్మి (మహారాష్ట్ర)

8. మాహూర్యాం – ఏకవీరకాదేవి. (మహారాష్ట్ర)

9. ఉజ్జయిని – మహాకాళి (మధ్యప్రదేశ్)

10. పిఠాపురం – పురుహూతికాదేవి (ఆం.ప్ర)

11. ఓఢ్యాణం – గిరిజాదేవి – (ఒడిస్సా)

12. మాణిక్యాదేవి – దాక్షారం – (ఆం. ప్ర)

13. హరిక్షేత్రం – కామరూపాదేవి (అస్సాం)

14. ప్రయాగ – మాధవేశ్వరీదేవి (ఉ.ప్ర)

15. జ్వాలాక్షేత్రం – వైష్ణవీదేవి (హిమాచలప్రదేశ్)

16. గయ – సర్వమంగళాదేవి (బీహార్)

17. వారణాశి – విశాలాక్షీదేవి (ఉత్తరప్రదేశ్)

18. కాశ్మీరము – సరస్వతీదేవి (శారదాపీఠం, కాశ్మీరం)

**47. గాయత్రీ మంత్రము**

ఓం భూర్భువస్సువః, ఓం తత్సవితుర్వరేణ్యం ।
భర్గో దేవస్యధీమహి, ధియోయోనః ప్రచోదయాత్ ॥
తత్సద్బ్రహ్మార్పణమస్తు ॥



**48. పండితుడు**

శాస్త్ర సమ్మతములైన కర్మలను ఎవరైతే చేయుదురో, అవి కామసంకల్పిత వర్జితములై జరుగునో ఎవని కర్మలన్నియు జ్ఞానమనే అగ్నిచేత భస్మమగునో అట్టి మహాత్ముని జ్ఞానులు పండితుడని అందురు.

**49. అయనములు**

1. ఉత్తరాయణము, 2. దక్షిణాయనము

**50. నవవిధ భక్తిమార్గములు**

1. శ్రవణం, 2. కీర్తనం, 3. విష్ణోఃస్మరణం, 4. పాదసేవనం, 5. అర్చనం, 6. వందనం, 7. దాస్యం, 8. సఖ్యం, 9. ఆత్మనివేదనం.

**51. అష్టవసువులు**

1. ఆపుడు, 2. ధ్రువుడు, 3. సోముడు, 4. ధరుడు, 5. అనిలుడు, 6. అనలుడు, 7. ప్రత్యూషుడు, 8. ప్రభాసుడు (వసువు అంటే దేవపురోహితుడు)

**52. యుగములు**

1.కృతయుగము, 2. త్రేతాయుగము, 3. ద్వాపరయుగము, 4. కలియుగము.

**53. కృష్ణపరమాత్మ – ప్రకృతి**

1. భూమి, 2. నీరు, 3. అగ్ని, 4. వాయువు, 5. ఆకాశము, 6. మనస్సు, 7. బుద్ధి, 8. అహంకారము. ఈ 8 బేధములుగల ప్రకృతిని "అపరా" లేక "జడ" అని అందురు.

**54. చతుర్విధ భక్తులు**

1. శుభకర్మలను ఆచరించుచూ సుఖసంపదలను కోరుకొనువారు. (అర్థార్థులు), 2. శారీరక మానసిక, సంతాపములకు గురి అయిన ఆర్తులు, 3. ఐహిక విషయములపై ఆసక్తినివీడి పరమాత్మతత్వజ్ఞానమును

పొందుటకు ఇచ్ఛకలవారు. (జిజ్ఞాసువులు), 4. పరమాత్మప్రాప్తి నొందిన జ్ఞానులు.

**55. జ్ఞాని :** భగవత్తత్వమును ఎరిగినవాడు.

**56. చతుర్విధ పుత్రులు**

1. ఔరసపుత్రుడు, 2. దత్తపుత్రుడు, 3. క్షేత్రపుత్రుడు, 4. కృత్రిమపుత్రుడు

**57. పరమాత్మసద్గుణ ఐశ్వర్య సంపదలు**

1. జ్ఞానము, 2. ఐశ్వర్యము, 3. భక్తి, 4. శక్తి, 5. బలము, 6. తేజము

**58. పురాణములు**

1. భాగవతము, 2. మార్కండేయ, 3. మత్స్య, 4. బ్రహ్మ, 5. మార్కండేయ, 6. బ్రహ్మవైవర్త, 7. బ్రహ్మాండ, 8. విష్ణు, 9. వరాహ, 10. వామన, 11. వాయువు, 12. అగ్ని, 13. నారద, 14. పద్మ, 15. లింగ, 16. గరుడ, 17. కూర్మ, 18. స్కాంద.

**59. తులసి**

తులసిమొక్కను ప్రతివారు ఇంట్లోవుంచుకుని పూజింపవలెను. అది శ్రీహరినివాసస్థానము తులసిని స్మరిస్తూవుంటే సర్వపాపములు నశించును. తులసి ఎంతకాలము నివసించునో అంతకాలము అతనికి వైకుంఠములో నివసించు యోగ్యతకలుగును.

**60. ఉపనిషత్తులు**

12 ప్రసిద్ధములు: (మొత్తము 108 అని చెప్పుదురు)

1. ఈశ, 2. కేన, 3. కఠ, 4. ప్రశ్న, 5. ముండక, 6. మాండూక్య, 7. తైత్తిరీయ (తైత్తిరీయి), 8. ఐతరేయ, 9. ఛాందోగ్య, 10. బృహదారణ్యక, 11. శ్వేతాశ్వతర, 12. నృసింహతాపినీ

(ఈ 12 ఉపనిషత్తులకు శ్రీశంకరాచార్యులవారు భాష్యం వ్రాశారు)



**61. నవదుర్గలు**

1. శైలపుత్రి, 2. బ్రహ్మచారిణి, 3. చంద్రఘంటా, 4. కూష్మాండా, 5. స్కందమాతా, 6. కాత్యాయిని, 7. కాలరాత్రి, 8. సిద్ధి, 9. మహాకాళీ

**62. అష్టలక్ష్ములు**

1. ఆదిలక్ష్మి, 2. ధాన్యలక్ష్మి, 3. ధైర్యలక్ష్మి, 4. గజలక్ష్మి, 5. సంతానలక్ష్మి, 6. విజయలక్ష్మి, 7. విద్యాలక్ష్మి, 8. ధనలక్ష్మి

**63. సముద్రములు 9**

1. లవణ, 2. క్షీర, 3. మధు, 4. ఇక్షురస, 5. సుర, 6. ఘృత, 7. దధి.

**64. లోకములు 7**

1. అతల, 2. వితల, 3. సుతల, 4. రసాతల, 5. తలాతల, 6. మహాతల, 7. పాతాళ (ఇవి అధోలోకములు)

**65. యజ్ఞములు**

I **పాక యజ్ఞములు :** 1. ఔపాసన, 2. వైశ్వదేవము, 3. పార్వణ, 4. అష్టకా, 5. మాసిశ్రాద్ధము, 6. సర్పబలి, 7. ఈశానబలి

II **హవిర్యజ్ఞములు :** 1. అగ్నిహోత్రం, 2. దర్శపూర్ణమాస, 3. అగ్రాయణ, 4. చాతుర్మాస్య, 5. నిరూఢపశుబంధ, 6. సౌత్రామణి, 7. పితృయజ్ఞము.

**66. యాగములు**

1. అగ్నిష్టోమ, 2. అత్యగ్నిష్టోమ, 3. ఉక్థ్య, 4. షోడశీ, 5. నిరూఢ పశుబంధ, 6. సౌత్రామణి, 7. ఆప్తోర్యామము.

**67. ఈశ్వరుని ముఖ్యనామములు**

1. శివుడు, 2. నాగేంద్రహారుడు, 3. త్రిలోచనుడు, 4. భస్మాంగధారి, 5. నిత్యుడు, 6. శుద్ధుడు, 7. దిగంబరుడు, 8. త్రినేత్రుడు,

9. నీలకంఠుడు, 10. చంద్రశేఖరుడు, 11. చంద్రమౌళి, 12. గంగాధరుడు, 13. రుద్రాక్షమాలాధరుడు, 14. అర్ధనారీశ్వరుడు, 15. లింగాకారుడు, 16. అభిషేకప్రియుడు, 17. జటాధరుడు, 18. పినాకపాణి, 19. సనాతనుడు, 20. జటాజూటధారి.

**68. శ్రీకృష్ణుడు ఉద్ధవునకు, తనను ఈ 11 స్థానములలో ఆరాధించవలెను అని చెప్పెను**

1. సూర్యుడు, 2. అగ్ని, 3. బ్రాహ్మణుడు, 4. గోవులు, 5. వైష్ణవులు, 6. ఆకాశము, 7. వాయువు, 8. జలము, 9. భూమి, 10. ఆత్మ, 11. సర్వ మరియు యజ్ఞ యాగాదులచే.

**69. శ్రీ మహావిష్ణువు శరీరములు**

1. బ్రాహ్మణులు, 2.గోవులు, 3. తపస్సు, 4. సత్యం, 5. దమం, 6. శమం, 7. శ్రద్ధ, 8. దయ, 9. సహనం, 10. యజ్ఞం.

**70. శ్రీ విష్ణుమూర్తి ధరించినవి**

1. పాంచజన్య శంఖము, 2. సుదర్శనచక్రము, 3. నందకఖడ్గము, 4. కౌమోదకీగద, 5. శార్‌ఙ్గ ధనుస్సు, 6. మెడలో తులసీమాల (వనమాల).

**71. కృష్ణుని వేణువుకు ఉన్న రంధ్రాలు**

1. ఐశ్వర్యం, 2. వీర్యం, 3. యశస్సు, 4. శ్రీ, 5. జ్ఞానం, 6. వైరాగ్యం

**72. భక్తిమార్గములు 9**

1. శ్రవణభక్తి, 2. సంకీర్తనభక్తి, 3. స్మరణ భక్తి, 4. పరిచర్యా భక్తి, 5. అర్చనాభక్తి, 6. వందనభక్తి, 7. దాస్యభక్తి, 8. సఖ్యభక్తి, 9. ఆత్మనివేదనభక్తి.

**73. బ్రాహ్మణం అంటే ఏమిటి?**

వేదాలలో మంత్రాలను యజ్ఞక్రతువులలో ఏ విధముగా ఉపయోగించాలో చెప్పేది బ్రాహ్మణం. ఇది బ్రహ్మ శబ్దమునుండి వచ్చింది. బ్రహ్మ అంటే మంత్రము. బ్రహ్మచర్యవ్రతము అంటే మంత్రములయందు చరించే వ్రతము



**74. సంవత్సరములు**

1. ప్రభవ, 2. విభవ, 3. శుక్ల, 4. ప్రమోదూత, 5. ప్రజోత్పత్తి, 6. అంగీరస, 7. శ్రీముఖ, 8. భావ, 9. యువ, 10. ధాత, 11. ఈశ్వర, 12. బహుధాన్య, 13. ప్రమాది, 14. విక్రమ, 15. వృష (విషు), 16. చిత్రభాను, 17. స్వభాను, 18. తారణ, 19. పార్థివ, 20. వ్యయ, 21. సర్వజిత్తు, 22. సర్వధారి, 23. విరోధి, 24. వికృతి, 25. ఖర, 26. నందన, 27. విజయ, 28. జయ, 29. మన్మథ, 30. దుర్ముఖి, 31. హేవిలంబి, 32. విలంబి, 33. వికారి, 34. శార్వరి, 35. ప్లవ, 36. శుభకృతు, 37. శోభకృతు, 38. క్రోధి, 39. విశ్వావసు, 40. పరాభవ, 41. ప్లవంగ, 42. కీలక, 43. సౌమ్య, 44. సాధారణ, 45. విరోధికృతు, 46. పరీధావి, 47. ప్రమాదీచ, 48. ఆనంద, 49. రాక్షస, 50. నల, 51. పింగల, 52. కాళయుక్తి, 53. సిద్ధార్థి, 54. రౌద్రి, 55. దుర్మఖి, 56. దుందుభి, 57. రుధిరోద్గారి, 58. రక్తాక్షి, 59. క్రోధన, 60. అక్షయ

**75. ద్వాదశాదిత్యులు**

1. ధాత, 2. మిత్రుడు, 3. ఆర్యముడు, 4. రుద్రుడు, 5. వరుణుడు, 6. సూర్యుడు, 7. భగుడు, 8. వివస్వంతుడు, 9. పూష, 10. సవిత, 11. త్వష్ట, 12. విష్ణు

**76. అశ్వినీకుమారులు**

1. నాసత్యులు, 2. దస్రులు

**77. మరుద్గణములు**

ఇందు 7 గణములున్నవి : 1. ఆవహ, 2. ప్రవహ, 3. పరావహ, 4. వివహ, 5. ఉద్వహ, 6. సంహవ, 7. పరివహ. (ఒక్కొక్క గణానికి ఏడుదేవతలు)

**78. అగ్నిహోత్రుని జిహ్వలు**

1. కాళి, 2. కరాళి, 3. మనోజవా, 4. సులోహిత, 5. సుధూమ్రవర్ణ, 6. స్ఫులింగిని, 7. విశ్వరుచి

**79. ఋక్కులు**

దేవతలను స్తుతిస్తూ ఋషులు చేసే ప్రార్థనలు. (దేవీభాగవతం).

**80. మనస్సును బంధించేవి**

1. మమకారం, 2. కోపం, 3. ద్వేషం, 4. పగ, 5. అసూయ, 6. విషయ వాంఛలయందు మోహం.

**81. ప్రత్యక్ష దైవాలు**

1. మాతృదేవోభవః, 2. పితృదేవోభవః, 3. ఆచార్యదేవోభవ.

తల్లిని తెలియపరచేది భగవంతుడే. తండ్రిని తెలియపరచేది తల్లి మాత్రమే. 'గు' అంటే అజ్ఞానము 'రు' అంటే అజ్ఞానాన్ని పారద్రోలుట. అనగా జ్ఞానాన్ని, విద్యని ఉపదేశించేవాడు గురువు. గురువుద్వారా ఉపదేశించబడేదే శాశ్వతము నైపుణ్యం కలది. నీ సంతతిని ప్రేమించి, ఆదరించి, సుఖపెట్టే దానికంటె తల్లితండ్రులను గౌరవించి వారి అనుగ్రహానికి పాత్రులగుట విద్యుక్త ధర్మం, శాస్త్రీయం. తల్లిజీవనాన్ని ఇస్తుంది. తండ్రి జీవితాన్ని ప్రసాదిస్తాడు. గురువు జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు.

**82. త్రి వర్గములు**

ధర్మము అర్థమే ఉత్కృష్టమైనవి కొందరు, అర్థకామములే శ్రేయస్కరములైనవి కొందరు, ధర్మమొక్కటే శ్రేష్టమైనదని మరికొందరు ప్రకటిస్తారు. వేరొకరు అర్థమొక్కటే శ్రేష్టమైనదని, ఇలా పలువురు పలువిధములుగా చెప్తూతూవుంటారు. కానీ, ఈ మూడు వర్గములూ మానవ జీవితానికి శ్రేయస్కరమైనవని మనువు తన ధర్మశాస్త్రమునందు ప్రకటించెను.



**83. సప్త ద్వీపాలు**

1. జంబూ ద్వీపము, 2. ప్లక్ష ద్వీపము, 3. శాల్మలీ ద్వీపము, 4. కుశద్వీపము, 5. క్రౌంచద్వీపము, 6. శాకద్వీపము, 7. పుష్కర ద్వీపము.

**84. ఋషీకలు**

పవిత్రమైన వేదంలో మంత్ర ద్రష్టలైన మహిళలు.

**85. ముముక్షువు**

జీవరాసులన్నిటిలోను, మానవునిది ఉత్తమమైన జన్మ. అతనికి మనస్సు, బుద్ధి, విచక్షణాజ్ఞానములను భగవంతుడిచ్చాడు. సంసారలంపటత్వము, భోగలాలస, ద్వేషము, అసూయ, క్రోధాదులను జయించి మోక్షమును ప్రసాదించమని భగవంతుని ప్రార్థించినవాడు.

**86. కాలమానము**

నాలుగు యుగములు, వెయ్యిసార్లు గడచితే బ్రహ్మదేవునకు ఒక పగలు లేక ఒక కల్పము. ఒక కల్పకాలంలో 14 మన్వంతరములు గడుస్తాయి. ఇది బ్రహ్మదేవునకు ఒక రాత్రి. అప్పుడు ప్రళయం సంభవిస్తుంది. ఈ సమయంలో మహావిష్ణువు, విశ్వమునంతటిని ఉపసంహరించుకుని శేషునిపై విశ్రాంతి తీసుకొంటాడు. బ్రహ్మదేవునికి ఆయన కాలమానప్రకారం 360 దినములు ఒక సంవత్సరము. అట్టి 100 సంవత్సరములు బ్రహ్మ ఆయుర్దాయము . తర్వాత ప్రళయం సంభవిస్తుంది.

**87. నారదుడు ధర్మరాజుకి బోధించిన మానవధర్మాలు**

1. సత్యము, 2. సంతోషము, 3. సమదృష్టి, 4. సత్, అసత్, వివేకము, 5. శౌచము, 6. క్షమ, 7. దయ, 8. దానము, 9. మార్దవము, 10. మనోనిగ్రహము, 11. సమాజసేవ, 12. మితభాషణము, 13. ఇంద్రియజయము. 14. బ్రహ్మచర్యము, 15. ప్రాణులలో పరమాత్ముని

యొక్క దర్శనము, 16. అభేదబుద్ధితో ప్రవర్తించడము, 17. ఉపవాసాదికము, 18. తగినంత జపము, 19. అహింస, 20. ఆత్మావలోకనము, 21. అన్నోదకాలపంచుట, 22. అసభ్యవాంఛలను విసర్జించుట, 23. అనర్ధకక్రియలను విడిచిపెట్టుటు, 24. శ్రీ విష్ణుభగవానుని స్మరణము, 25. విష్ణు కథల శ్రవణము, 26. విష్ణు నామకీర్తనము, 27. స్నేహభావము, 28. సేవాభావము, 29. ఆరాధనము, 30. నమస్కృతి, 31. దానము, 32. దాస్యము, 33. సఖ్యము, 34. ఆత్మసమర్పణము.

**89. బ్రహ్మచర్యా శ్రమధర్మాలు**

1. శీలము, 2. నియమనిష్ఠలు, 3. వినమ్రత, 4. సౌమ్యము, 5. గురుసేవ, 6. దేవతార్చన మొదలగు నిత్యకర్మలు, 7. అధ్యయనము అభ్యాసము చేయుట, 8. స్త్రీలతో అవసరానికి మించి మాట్లాడకుండుట మరియు కలియకుండుట 9. స్త్రీల యందు మాతృభావము, 10. గరువులసేవా శుశ్రూషలు, భక్తిశ్రద్ధలు, 11. గురువుల అనుగ్రహంతో విద్యనభ్యసించుట, 12. గురుదక్షిణ, 13. గురువుల ఆశీస్సులతో గృహస్థ, వానప్రస్థ మరియు సన్యాస ఆశ్రమాలస్వీకరణ, 14. మనస్ఫూర్తిగా తల్లితండ్రులసేవా, కర్తృత్వధర్మాలను నిర్వర్తించుట.

**89.2. గృహస్థాశ్రమధర్మాలు**

మనస్థైర్యముతో తన ధర్మాలను నిర్వర్తించుట, సత్ప్రవర్తన, పరసతులయందు పవిత్రభావము కలిగియుండుట, ఋతుకాలంలో తప్ప భార్యాసంగమము విసర్జించుట, ఇంద్రియ నిగ్రహము సర్వత్రాపాటించుట, ఋజువర్తనము, ధర్మబద్ధత, గురువు వద్ద నేర్చుకొనిన విద్యలను ఆచరణలలో పెట్టుట, అతిథులను మర్యాదతో సత్కరించుట, సమాజసేవ వీలయి నంతవరకు చేయుట, విరోధ భావమును విసర్జించుట, మానవులందు మాత్రమే కాకుండా, సర్వప్రాణులలో పరమేశ్వరుని దర్శించుట.



**90. కలియుగ ప్రభావము**

శ్రీకృష్ణావతారానంతరము కలియుగారంభము ప్రారంభమువలన మానవులలో మానవత్వము, అంతర్ధానము, స్వార్థము, అర్థము మొదలగు దుష్టగుణములు ఆవహించుటవలన ప్రతిమానవుడు సదుద్దేశములు, సత్ప్రవర్తన కలిగియుండుటకు, కామ, క్రోధ, మోహ, లోభాదులకు, అతీతునిగా ప్రవర్తించుట ముఖ్యము, అనివార్యము, శ్రేయస్సు.

**91. నవగ్రహాలకు అధిదేవతలు**

1. సూర్యునికి– శివుడు, 2. చంద్రునికి– గౌరి, 3. మంగళగ్రహానికి– సుబ్రహ్మణ్యుడు, 4. బుధునికి– విష్ణువు, 5. గురుగ్రహానికి– బ్రహ్మ, 6. శుక్రగ్రహానికి– ఇంద్రుడు, 7. శనిగ్రహానికి– యముడు, 8. రాహువునకు– దుర్గ, 9. కేతుగ్రహానికి– గణపతి.

**92. ఈ సామలను ధ్యానించాలి**

1. వసంతములో "హింకారము", 2. గ్రీష్మమున "ప్రస్తావము", 3. శరత్కాలమున "ప్రతిహారము", 4. వర్షఋతువునందు, 5. హేమంతములో "నిధనము" అనే ఐదు విధాల ఋతుసంబంధమైన ఈ "సామల" ను ధ్యానించాలి. శశిరఋతువు కూడా చలికాలమగుటచే హేమంతముతో కలిపి ఐదు ఋతువులుగా చెప్పబడినవి.

**93. అయోధ్య**

అయోధ్యానగరము శ్రీరాముని జన్మస్థలమైనందున మహాపుణ్య క్షేత్రములలో ముఖ్యమైనది. విష్ణుభగవానుని ఎడమకాలు బొటనవ్రేలు నుండి ఉద్భవించిన పవిత్రసరయూనదికి దక్షిణమున వెలసినది. 'అ' అంటే అకారము బ్రహ్మావాచకము 'య' కారము అంటే విష్ణు శబ్దము. 'ధ' కారము రుద్ర స్వరూపము. కాబట్టి, అయోధ్య బ్రహ్మ, విష్ణు, శివ త్రిమూర్తుల స్వరూపము.

**94. లక్ష్మీదేవి ఇష్టపడి నిలుచుస్థానాలు**

1. గురుభక్తికలవారు, 2. మాతాపితరులను పూజించేవారు, 3. దేవతలను పూజించేవారు, 4. సత్యమును చెప్పేవారు, 5. దానగుణము కలిగినవారు, 6. పరులధనాన్ని కోరనివారు, 7. పరస్త్రీని వాంఛించనివారు, 8. బ్రాహ్మణులంటే ఇష్టపడేవారు, 9. పగలు నిద్రపోనివారు, 10. వృద్ధులను స్త్రీలను, బలహీనులను దయతో చూచుకుంటున్నవారు, 11. అతిథులకు ముందు ఆహారము పెట్టిన తర్వాత భుజించేవారు.

**95. పది ఇంద్రియాలకు అధిదేవతలు**

1. శ్రవణేంద్రియానికి దిక్కులు, 2. త్వగింద్రియానికి వాయువు, 3. నేత్రేంద్రియానికి సూర్యుడు, 4. రసనేంద్రియానికి ప్రచేతసుడు, 5. ఘ్రాణేంద్రియానికి అశ్వనీదేవతలు, 6. వాగింద్రియానికి అగ్ని, 7. హస్తేంద్రియానికి ఇంద్రుడు, 8. పాదేంద్రియానికి ఉపేంద్రుడు, 9. గుదేంద్రియానికి మిత్రుడు, 10. ఉపస్థేంద్రియానికి ప్రజాపతి.

**96. పంచారామములు**

**1. క్షీరారామము :** క్షీరారామేశ్వరుడు, పాలకొల్లు, ప॥గో॥జిల్లా.

**2. సోమారామము :** సోమేశ్వరుడు, గునుపూడి, భీమవరం, ప॥గో॥జిల్లా.

**3. అమరా రామం :** అమరేశ్వరుడు, అమరావతి, గుంటూరుజిల్లా.

**4. ద్రాక్షారామము :** భీమేశ్వరుడు, ద్రాక్షారామం, తూ॥గో॥జిల్లా.

**5. భీమారామం :** కుమారభీమేశ్వరుడు, సామర్లకోట, తూ॥గో॥జిల్లా.

**97. అరిషడ్వర్గాలకు అతీతుడు కావాలనుకుంటే**

**1. కామం :** సంకల్పం అంటే మనసు నాకు ఇది కావాలి, అది కావాలి అనే ఆలోచనే కామం.



**2. క్రోధం :** తాననుకొంటున్న ఇతరులు పొరపాటునకాని, ఐచ్ఛికంగాకాని తప్పు చేస్తే అది మన మనస్సును పీడిస్తుంది. అదే క్రోధం. ఇది పోవాలంటే తనకు తాను తర్కించుకుని క్షమాగుణాన్ని ఆశ్రయించాలి.

**3. లోభం :** లోభం అంటే తానే సర్వస్వమని, తానొక్కడే లాభం పొందాలని ఇతరులతో నాకు సంబంధంలేదని, అని మనస్సులో వుంచుకుంటే అదే లోభం.

**4. మోహం :** ఇది పై జ్ఞానాలను తెలుసుకొనకపోవడమే.

**5. మదం :** బలం, విద్య, కులం, ధనం ఎక్కువగా ఉన్నపుడు మదం ఏర్పడుతుంది. ఇదిపోవాలంటే తనకు తాను మనసులో క్షుణ్ణంగా తర్కించుకుని అవి 'ఎంతటివిలే' అని లెక్కచేయకపోతే మదంపోతుంది.

**6. మాత్సర్యం :** ఇది పోవాలంటే సాత్త్వికబుద్ధిని స్థిరంగా ఏర్పరచుకోవాలి.

**98. యజ్ఞోపవీతం ధరించుమంత్రం**

యజ్ఞోపవీతం పరమంపవిత్రం – ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ – ఆయుష్యమగ్రియం ప్రతిముంచ శుభ్రమ్ । యజ్ఞోపవీతం బలమస్తుతేజః ।

**తాత్పర్యం:** ఓ జంధ్యమా! ప్రజాపతివలన సహజ పవిత్రమైన ప్రత్తి దారంగా ఆవిర్భవించినావు నువ్వు. నిన్ను ధరిస్తున్నాను. నాకు బ్రహ్మవర్చస్సును ఆయుస్సును, పవిత్రతను, బలాన్ని, తేజస్సును ప్రసాదించు. యజ్ఞోపవీతాన్నే బ్రహ్మసూత్రమని అంటారు.

**99. భగవానుడు పరమప్రాప్తికి ఉపదేశించిన రెండు ముఖ్యమార్గములు**

1. సాంఖ్యయోగము కృష్ణభగవానుని తప్ప అన్యమును ఎరుగును అనే అభ్యాసమే సాంఖ్యయోగము.

2. నిష్కామకర్మ యోగము : భక్తిశ్రద్ధలతో, ఏకాగ్రతతో పరమేశ్వరార్పణ మనస్సుతో, భగవంతుని స్వరూపమును నిరంతరము స్మరించుకుంటూ సర్వకర్మలను ఆచరించుటయే నిష్కామకర్మయోగము.

**100. ఇంద్రియక్రమశిక్షణ**

**1. దమం :** స్వయంగా నియంత్రించుకొనునది.

**2. ప్రత్యాహారం :** విషయవాసనలకు ఇంద్రియాలు లోనుకాకుండుట.

**3. ఉపవాసం, సాత్వికాహారం :** వీటివల్ల నాలుకపై నియంత్రణ కలుగుతుంది.

**4. బ్రహ్మచర్యం :** బ్రహ్మచర్యం అంటే జననేంద్రియములను స్వాధీనంలో ఉంచుకుని, నియంత్రించుకుని అదుపులో పెట్టుకొనుటయే బ్రహ్మచర్యం.